# కల్లోలిత కాశ్మీరం

ఇంగువ మల్లికార్జున శర్మ




6-3-1243/116, దామోదరం సంజీవయ్యా నగర్,
రాజ్‌భవన్ ఎదుట, హైదరాబాదు - 500 082.

# ముందు మాట

భారతదేశంలో చేరికప్పటినుండి కాశ్మీరు మనదేశ రాజకీయ శరీరంలో ఒక మానని గాయంగా వుంటూ వస్తున్నది. మన దేశంలో విలీనమైన యితర స్వదేశీ సంస్థానాల్లాకాక కాశ్మీరు చేరిక సందిగ్ధంగా వుంటూ వస్తున్నది.

ఈ సమస్యా పరిష్కారానికిగాను భారత, పాకిస్తాన్ ఉభయ దేశాలూ 1948 జనవరి 27నాడు భద్రతామండలి అధ్యక్షునికి ముసాయిదా ప్రతిపాదనలు సమర్పించాయి. కాశ్మీరు హోదాను అంతిమంగా తేల్చివేసే నిర్ణాయక చర్యగా అక్కడ ప్లెబిసైటు (జనాభిప్రాయ సేకరణ ఎన్నికలు) జరిపించడానికి భారతదేశం సమ్మతించింది. భద్రతా మండలి నిండు సభలో భారత ప్రతినిధి యిలా అన్నారు : "మా దేశంలో కాశ్మీరు చేరికకు సమ్మతించినప్పుడు మేము ఆ రాజ్యానికి ఏర్పడిన తక్షణ విపత్తును అవకాశంగా తీసుకుని లాభం పొంద నిరాకరించాము. అక్కడ శాంతి పునరుద్ధరణ జరిగిన వెంటనే ప్లెబిసైటు నిర్వహించి చేరిక సమస్యకు తుది పరిష్కారం సాధించాల్సి వుంటుందని మేము ఆ రాజ్యాధీశునికి చెప్పాము."

భద్రతామండలిలో చేసిన ఈ హామీ ప్రకటనపై భరోసా కల్పించడానికే మన రాజ్యాంగంలో 370వ అధికరణం ప్రవేశపెట్టారు. ఈ అధికరణంపై చర్చ జరుగుతున్నప్పుడు శ్రీ ఎన్. గోపాలస్వామి అయ్యంగార్ ప్రసంగిస్తూ కాశ్మీరు భావి హోదాను ఆ రాష్ట్రపు రాజ్యాంగ సభే అంతిమంగా నిర్ణయించగలదని, అంతదాకా అక్కడ భారత రాజ్యాంగం, చేరిక ఒప్పందంలో సూచించిన మేరకే,పరిమితంగా వర్తిస్తుందని, ఆ హద్దుల్లోనే అక్కడ శాసనాలు, రెగ్యులేషన్లు జరిగేట్లు చూసే రక్షణ కవచంగా 370వ అధికరణం వుంటుందని స్పష్టం చేశాడు.

ఈ ప్రత్యేక హోదావల్లే కాశ్మీరు భారత రాజ్యాంగాన్ని మొత్తంగానైతే ఆమోదించకుండా వస్తున్నది. ఈ విధంగా 370వ అధికరణం ఒక నిజమైన సమాఖ్యాపర స్థితిని అట్టిపెట్టి కొనసాగించింది. భారతదేశం, కాశ్మీరుల నడుమ నెలకొన్న యీ బాంధవ్యం అసలు తీరుతెన్నులు అంతిమంగా ఆ రాష్ట్ర రాజ్యాంగసభచేతనే నిశ్చయం గావించబడాలని మన రాజ్యాంగ నిర్మాతలు ఎంతో ఆదుర్దాపడినట్లు ఈ 370వ అధికరణం గురించి వివరించేటప్పుడు (ప్రేమ్‌నాథ్ కౌల్ కేసు - 1959 ఎస్.సి. 74లో) మన సుప్రీంకోర్టు కూడా పేర్కొన్నది. ఈ 370వ అధికరణాన్ని మరింత సమర్థవంతంగా అమలు చేయడానికే మన రాజ్యాంగంలోని యితర అనేక అధికరణాల్లోకూడా జమ్మూ-కాశ్మీరు విషయమై ప్రత్యేక ఏర్పాట్లు చేయబడ్డాయి.

కాని సరిగ్గా యీ 370వ అధికరణం ప్రసాదించిన అధికారాలతోనే భారత ప్రభుత్వం అక్కడ ఒక అత్యంత అప్రజాస్వామిక, దారుణ నిర్బంధ వ్యవస్థను నెలకొల్పింది. రాజ్యాంగపు 80, 81వ అధికరణాల వర్తింపుకు సంబంధించి సవరణలు చేయడం ద్వారా అక్కడి రాష్ట్ర

ప్రభుత్వాన్ని సంప్రదించి కేంద్ర ప్రభుత్వం అక్కడినుండి లోక్‌సభకు, రాజ్యసభకు ప్రతినిధుల్ని పేరెంపిక (నామినేట్) చేసే వీలు కూడా కల్పించుకోబడింది. పోతే రాజ్యాంగంలోని ప్రజాస్వామ్య సారం గూర్చి ఎన్ని చెప్పుకున్నా యథార్థంలో షేక్ అబ్దుల్లా, మరి పాతికమందిపై రాష్ట్ర ప్రభుత్వాన్ని కూలదోయడానికి కుట్రపన్నారనే అభియోగం మోపి వేధించారు. ఇందుమూలంగా ఈ రాష్ట్రం తమదేనని గొంతుచించుకోవడానికి పాకిస్తాన్‌కు వీలు కల్పించారు. షేక్ అబ్దుల్లా, తదితరులపై అంతిమ నేరారోపణలు (Final Charges) 1962 ఆగస్టు 31వ తేదీనాడు న్యాయమూర్తి ఎన్.కె. హక్ న్యాయస్థానంలో రూపొందించి, వారిపై కేసును పూర్తి విచారణకుగాను ఒక ప్రత్యేక కోర్టుకు పంపారు. ఆ సందర్భంగా తన డిఫెన్సు వాగ్మూలంలో షేక్ అబ్దుల్లా యిలా ఉద్ఘాటించాడు: "ఇది ఒక రాజకీయ విచారణ. నన్ను, నా మిత్రుల్ని అనేక సంవత్సరాలుగా డిటెన్షనులో వుంచుతున్నారు. నేడు మేము ఇక్కడ యీ న్యాయస్థానంలో నిలిచివున్నామంటే అది మేము సదా కట్టుబడుతూవస్తున్న ఆశయాలు, సూత్రాలకోసమేనని, తమ స్వీయ భవితవ్యాన్ని తామే తీర్చిదిద్దుకునేందుకు జమ్మూ-కాశ్మీరు ప్రజలకున్న పవిత్ర హక్కు కోసమేనని స్పష్టం చేస్తున్నాము." కాశ్మీరు లోయలోని ప్రజల నిశ్చయమూ యిదే. సరే, ఆనక షేక్ అబ్దుల్లాయే స్వయంగా మారిపోయాడనేదీ వాస్తవమే. కానీ వీరో వారో నాయకులు తమ వైఖరులు మార్చుకొంటూ వస్తూండవచ్చుగాని, ఆ రాష్ట్రంలో తలయెత్తుతూ వచ్చిన సకల రాజకీయ వుద్యమాల్లోనూ స్వయం నిర్ణయాధికార సూత్రం గురించి మట్టుకు సదా ప్రస్తావన లేక వక్కాణింపు వుంటూనే వచ్చిందని కూడా గమనించాలి. భారత పాకిస్తాన్ ఉభయ దేశాలూ "కాశ్మీరు సమస్యను" ఆ రాష్ట్రంలో నివసించే ప్రజల యిష్టాయిష్టాలకు సంబంధించి ఏ ప్రసక్తి లేకుండా కేవలం ఒక "ఆస్తుల పంపకం సమస్య"గా చూచి వ్యవహరిస్తూ వస్తున్నాయి.

దేశ సమగ్రతను కాపాడాలి, జాతి సమైక్యతకు ఎదురయ్యే ముప్పును ఎదుర్కోవాలనే ధారాళమైన వాగాడంబరాల మాటున అసలుకు సమస్యేకాని ఒక అంశంపై ఏళ్ల తరబడి ఎంత రక్తపాతం జరిగిపోయిందని! శాంతి భద్రతల పరిస్థితిగా చూచి, లేక దేశ భద్రతకు భంగకరమనే వైఖరి వహించి, అక్కడి వుద్యమాలను కొట్టిపారవేయజూస్తే సరిపోతుందా? లేక హవాలా కుంభకోణంలో కాశ్మీరీ తీవ్రవాద నాయకుల భాగస్వామ్యాన్ని సి.బి.ఐ. (కేంద్ర నేర పరిశోధనా బ్యూరో) దర్యాప్తు వెల్లడిస్తున్నదని చెప్పి అక్కడి వుద్యమాన్ని ఓడించజూస్తే అది సాధ్యపడేదేనా? నాయకులను అపఖ్యాతిపాలు చేసినంత మాత్రాన రాజకీయ వుద్యమాలు, వాటి ఆశయాలు, అభిలాషలుకూడా అభాసుపాలవుతాయనుకోవడం వ్యర్థం. అలా ఎన్నటికీ జరుగదు.

కనుక ప్రజాస్వామ్య పద్ధతులు అవలంభించడం మాత్రమే ఈ సమస్యకు ఏకైక పరిష్కార మార్గం. కేవలం భారత, పాకిస్తాన్‌ల నడుమ పంపకాల సమస్యగా మాత్రమేనైతే కాశ్మీరు ఎన్నడేగాని లేదు. 370వ అధికరణంలో జమ్మూ-కాశ్మీరు రాజ్యాంగ నిర్మాణ సభ గురించి ప్రస్తావన వుంది. ఆ అధికరణం అమలు, అన్వయం ఆ రాజ్యాంగ సభ ఉనికికి

ముడిపెట్టబడి వున్నాయి. కనుక పాక్ ఆక్రమిత కాశ్మీరులోని ప్రాంతాలనుకూడ కలిపి అవిభక్త జమ్మూ-కాశ్మీరు రాష్ట్రం మొత్తానికిగా, అంతర్జాతీయ పర్యవేక్షణలో, ఒక రాజ్యాంగ సభను ఏర్పాటు చేయడం బహుశా ఈ సమస్యకు సరియైన సమాధానం కావచ్చేమో!

మన దేశ రాజకీయ పరిణామాలు, స్వయం నిర్ణయాధికారం కోసం కాశ్మీరు ప్రజలు సాగించే వుద్యమాలు కలిసి నేడెంతో క్లిష్ట పరిస్థితుల్ని సృష్టించివున్న సమయంలో కాశ్మీరు చరిత్ర గురించి, ప్రత్యేకించి 1989నుండి అక్కడ సాగుతున్న 'ఆజాదీ' పోరాటం గురించి, అక్కడి వివిధ తీవ్రవాద సంస్థల గురించి గణనీయంగా సమాచారం అందించే ఈ పుస్తకాన్ని రచించి, మార్క్సిస్టు అధ్యయన వేదిక ద్వారా ప్రచురిస్తున్నందుకు, ఈ విధంగా తెలుగు ప్రజల దృష్టిని ఈ సమస్యపై కేంద్రీకరించే ప్రయత్నం చేసినందుకు ఇంగువ మల్లికార్జునశర్మకు నా అభినందనలు. ఈ పుస్తకాన్ని తెలుగు పాఠకులు విశేషంగా ఆదరించగలరని ఆశిస్తాను.

128 తూర్పు మారేడ్‌పల్లి,
సికిందరాబాదు - 500 026.

**కె.జి. కన్నబిరన్** ★
6/3/96

★ *ప్రఖ్యాత న్యాయవాది, పౌరహక్కుల ప్రజాసంఘం (P.U.C.L.) జాతీయ అధ్యక్షుడు.*

---

# విషయ సూచిక



జమ్మూ-కాశ్మీరు పటం 86వ పుటలో....


యాసీన్ మాలిక్ (JKLF)


జైలుపక్షి షబ్బీర్ షా


అబూ జిందాల్ (హర్కాత్ ఉల్ అన్సార్)


అమానుల్లాఖాన్ (JKLF)

# కల్లోలిత కాశ్మీరం

'ఆసియా ఖండపు స్విట్జర్లండు' అని; భారతదేశానికి తలమానికమని కాశ్మీరును పేర్కొనడం కద్దు. అయితే స్విట్జర్లండుకంటేకూడ అతిమనోహర ప్రకృతి రామణీయకతతో సందర్శకులను అలరారించే ఈ లోయ నేడు మనదేశానికిమాత్రం పెద్ద తలనొప్పిగా పరిణమించింది. 1947 అక్టోబరులో పాకిస్తాన్ సాయుధం చేసి ప్రోత్సహించిన పఠాను, తదితర గిరిజన సాయుధ ముఠాల దాడులకు బెంబేలెత్తిన జమ్మూ, కాశ్మీర్, తిబ్బత్ ఆది దేశాధిపతి శ్రీమాన్ ఇంద్ర మహేంద్ర రాజరాజేశ్వర  మహారాజాధిరాజ శ్రీ హరి సింగ్ తన సార్వభౌమాధికారాలకు ఎలాంటి కొరత వుండకూడదనే షరతుతో ఆ లోయను మన దేశంలో విలీనం చేసిననాటినుండి నేటిదాకా ఆ సమస్య అపరిష్కృతంగానే మిగిలివున్నది. రావణాసురకాష్టంలా రగులుతూ, మధ్యలో అప్పుడప్పుడు భగ్గుమని ప్రజ్వరిల్లుతూవుంది. ప్రస్తుతం మళ్లీ మన మీ సమస్య ప్రజ్వలనా దశలో వుంటంచేత ఇక్కడ దీన్ని గురించి టూకీగానైనా సాధ్యమైనంత నిష్పాక్షికంగా తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.

## నైసర్గిక పరిస్థితి, జనాభా వివరాలు :

భారతదేశానికి సరిగ్గా ఉత్తర కొసన వున్న జమ్మూ-కాశ్మీర్ రాజ్యానికి పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్, మునుపటి సోవియెట్ యూనియన్, చైనా (తిబ్బత్‌తోయుక్తంగా) లతో ఎల్లలు వున్నాయి. కాశ్మీర్‌లోయ, జమ్ము, లడఖ్‌లు ఆ రాజ్యంలోని మూడు ప్రధాన ప్రాంతాలు. అత్యధిక జనాభా కాశ్మీరు లోయలోనే కేంద్రీకృతమై వున్నారు. వారిలో 90శాతానికి పైగా ముస్లింలే. కాశ్మీరీ పండిట్‌లు (బ్రాహ్మణులు) అత్యల్ప సంఖ్యలో లోయ అంతటా చెదిరివున్నారు. జమ్మూ ప్రధానంగా హిందూ మెజారిటీ ప్రాంతం; డోగ్రాలు, రాజపుత్రులు, మేఘ్‌లనే దళితులు, మహమ్మదీయులు యిక్కడ నివాసమున్నారు. భారత దేశంలో చేరకపూర్వం జమ్మూ జనాభాలో 61శాతంమంది ముస్లింలు  వుండేవారుగాని విభజనానంతర మతకలహాలు, చేరిక తర్వాతి పరిణామాల వల్ల వారిప్పుడు మైనారిటీస్థాయికి పడిపోయారు. 1947లో జమ్మూ-కాశ్మీర్ జనాభా సుమారు 40 లక్షలు. అందులో ముస్లింలు 30 లక్షలకు కొద్దిగా ఎక్కువగా, 77.11 శాతంగా, వుండేవారు. హిందువులు 20.12శాతం, సిక్కులు 1.64 శాతం వుండినారు. సిక్కులు జమ్మూలోనే గాక, కాశ్మీరులోయ అంతటా కూడ చెదురుగా వ్యాపించి వున్నారు. లడఖ్‌లో సుమారు 68,000 జనాభా (1981సెన్సస్); అత్యధికం బౌద్ధ లామా మతస్తులు, కొందరు క్రిస్టియన్లు వున్నారు. 1981 జనాభా లెక్కల ప్రకారం మన అధీనంలోని జమ్మూ-కాశ్మీరు జనాభా సుమారు 60 లక్షలు, అందులో 30 లక్షలకుపైగా కాశ్మీరులోయలో నివసిస్తున్నారు.

ముఖ్యపట్టణం, వేసవి రాజధాని శ్రీనగర్ (4లక్షల జనాభా); శీతాకాల రాజధాని జమ్మూ (1.55 లక్షల జనాభా).

మొత్తం జమ్మూ - కాశ్మీర్ రాజ్యం వైశాల్యం 84,471 చదరపు మైళ్ళు. దానిలో కాశ్మీర్‌లోయ వైశాల్యం 12,378 చదరపు మైళ్లు. 1947 అక్టోబరులో పఠాన్లు యితర గిరిజన ముఠాల దాడులు, తదనంతరం 1948లో పాకిస్తాన్ రెగ్యులర్ సైన్యాలతో యుద్ధంమూలంగా జమ్మూలో స్వల్పమైన భాగం, కాశ్మీర్ లోయలో సుమారు ఐదింట రెండువంతులు, గిల్గిత్, హంజా-నాగిర్, బాల్టిస్తాన్ (లడఖ్‌కు ఉత్తరభాగం) పాకిస్తాన్ ఆధీనంలోకి వెళ్లిపోయాయి. జమ్మూ, కాశ్మీర్‌లలోని పాకిస్తాన్ అధీన ప్రాంతాల్లో ఆజాద్ కాశ్మీర్ ప్రభుత్వం ఏర్పడింది; ఇది సుమారు 5000 చదరపు మైళ్ల భూభాగాన్ని పరిపాలిస్తున్నది. 1948లో సుమారు 9 లక్షల జనాభా కలిగివుండిన ఆజాద్ కాశ్మీర్‌కు ముజఫరాబాద్ తాత్కాలిక రాజధానిగా వుండింది. భారతదేశం వంతుకు జమ్మూలో అత్యధిక భాగం, కాశ్మీరులోయలో ప్రధానభాగం, లడఖ్ (లే, కార్గిల్ జిల్లాలు) మిగిలినాయి. భారత అధీనంలోని జమ్మూ-కాశ్మీరుకు శ్రీనగర్ రాజధాని. 80శాతంమంది ప్రజలు వ్యవసాయంపైనే ఆధారపడి వున్నారు. వినోద పర్యటనే (Tourism) ప్రధాన పరిశ్రమ అని చెప్పవచ్చు.

జమ్మూ భౌగోళికంగా పర్వతశ్రేణులు, పీఠభూముల ప్రాంతం. పీర్ పంజాల్ పర్వతం జమ్మూను కాశ్మీరునుండి వేరుచేస్తున్నది. మంచుకురవని కాలంలో మాత్రమే సముద్రతలానికి 5000 అడుగుల ఎత్తునవున్న బానిహాల్ కనుమ ద్వారా జమ్మూనుండి కాశ్మీరుకు రవాణా మార్గం వుంటుంది. జమ్మూ నైరుతి భాగం నుండి పాకిస్తాన్‌కు, ఆగ్నేయభాగంనుండి భారతదేశానికి రవాణా మార్గాలున్నాయి. 1948కి పూర్వం మొత్తం జమ్మూ-కాశ్మీర్‌లో కేవలం 16 మైళ్ల రైలుమార్గం మాత్రమే, జమ్మూనుండి పాకిస్తాన్‌లోని సియాల్‌కోట వరకు, వుండేది. భారతదేశంలో చేరిక అనంతరం పంజాబ్‌లోని పఠాన్‌కోట నుండి జమ్మూ, ఉధంపూర్‌ల వరకు రైలుమార్గం నిర్మించారు. కాశ్మీరు పాలకులు యితర ప్రపంచంతో దూరంగా ఒంటరిగా వుండాలనుకోవడంచేత రైలు మార్గాలే నిర్మించలేదు. నేటి నేపాల్‌లో కూడ అదే పరిస్థితి గమనిస్తాము.

కాశ్మీర్‌లోయ ప్రపంచంలోని యితరదేశాలన్నిటినుండి సమున్నత పర్వతశ్రేణులచే వేరుచేయబడివుంది. ఒక్క వాయవ్యదిశలో అంటే ఇప్పటి పాకిస్తాన్ వైపుకు మాత్రమే రవాణా మార్గాలు వున్నాయి. శ్రీనగర్‌నుండి బారాముల్లా కనుమ ద్వారా పాకిస్తాన్‌కు, పైన పేర్కొన్న బానిహాల్ కనుమ ద్వారా జమ్మూ, అటునుండి సియాల్‌కోటకు, శ్రీనగర్‌నుండి తూర్పుగా జోజిలా కనుమ ద్వారా చైనాలోని కాష్‌గర్‌కు, టిబెట్‌కు పోయే ప్రధాన రోడ్డుమార్గాలు మూడే వున్నాయి. 1948 తర్వాత పఠాన్‌కోట నుండి జమ్మూవరకు రోడ్డువేశారు. అయితే మన దేశంనుండి కాశ్మీరులోయకు మంచుకురిసే శీతాకాలంలో ఒక్క విమానమార్గం తప్ప యితర రవాణా మార్గాలన్నీ బందయిపోతాయి. కాని పాకిస్తాన్‌వైపుకు మాత్రం అన్ని కాలాల్లో రోడ్డుమార్గాలు రవాణ యోగ్యంగా వుంటాయి. కాశ్మీరు లోయను భారతదేశం, సింకియాంగ్, టిబెట్‌లనుండి హిమాలయ పర్వతశ్రేణులు, మునుపటి

సోవియట్ యూనియన్, ఆఫ్ఘనిస్తాన్‌ల నుండి పామీరు పర్వతాలు వేరుచేస్తున్నాయి.

కాశ్మీరులోయలో ప్రధాన రవాణా మార్గాలు (1948దాకా) జలమార్గాలే. సింధునది, దాని ఉపనదులు జీలం, చీనాబ్‌లు కాశ్మీరు గుండా పాకిస్తాన్‌లోనికి ప్రవహిస్తాయి. ఆ నదీమార్గాల గుండా కాశ్మీరులోయనుండి కలప రవాణా చేసేవారు. ఆ రాజ్యం ఆదాయానికి అదే ప్రధాన వనరుగా ఉండేది. కాశ్మీరు నుండి ఎగుమతి, దిగుమతి వ్యాపారమంతా ప్రధానంగా పాకిస్తాన్ దిశగానే సాగేది. ఈ అన్ని అంశాలనుబట్టి నైసర్గికంగా భారతదేశంకంటె పాకిస్తానే కాశ్మీరుకు సన్నిహితమైనదని వేరుగా చెప్పనక్కర్లేదనుకొంటాను.

జమ్మూ-కాశ్మీరు ఉత్తర ప్రాంతంలో సమున్నత పర్వతశ్రేణులు వున్నాయి. వాటిల్లోనే ప్రపంచంలోకెల్లా అన్నిటికంటె ఎత్తయిన శిఖరాల్లో రెండవది మౌంట్ గుడ్విన్ ఆస్టిన్ వున్నది. లడఖ్‌ను చిన్న టిబెట్ అనికూడ అంటుంటారని, ఇక్కడి బౌద్ధలామాలు టిబెట్‌కు చెందిన దలైలామా పట్ల విధేయత చూపించుతారని, డోగ్రా వంశస్తుడు రాజా గులాబ్ సింగ్ 1837-39లలో టిబెట్‌నుండి లాగుకునేంతవరకు ఈ ప్రాంతం టిబెట్ ఆధీనంలో వుండిందని, 1947లో కాశ్మీర్ భారతదేశంలో చేరడంవల్ల ఈ ప్రాంతంపై భారత ఆధిపత్యం వచ్చిందనికూడ యిక్కడ తెలుసుకోవడం ఉపయోగకరం.

## కాశ్మీర్ చరిత్ర :

హిందూదేశస్తులకు అనాదిగా ఆధ్యాత్మిక చింతనపై వున్న మక్కువ చరిత్ర రచనపై లేదని ఒక బలమైన విమర్శ వుండనేవుంది. అపవాదం (exception , మినహాయింపు) నియమాన్ని రుజువు చేస్తుందనే విధంగా మనకు సంస్కృతంలో బహుకొద్ది చరిత్ర రచనలు లభిస్తాయి. వాటిలో మకుటాయమానమైన కల్హణుని 'రాజ తరంగిణి' కాశ్మీర రాజ చరితమే. అయితే, 'ఏ దేశచరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం' అనే కవి ప్రశ్నకు అనుగుణంగానే కాశ్మీర చరిత్ర అంతా ప్రధానంగా వివిధ రాజుల అకృత్యాల కథనమే. క్రీ.శ. 1వ శతాబ్ద ప్రాంతంలో కాశ్మీర్ కుషానుల పాలనలో వుండిందన్నంత మాత్రం తప్పితే క్రీ.శ. ఆరవ శతాబ్దానికి పూర్వం కాశ్మీరుకు గల ప్రాచీన చరిత్ర గురించి మనకు అంతగా తెలవదు. ఆరవ శతాబ్దంనుడి తన కాలం (12వ శతాబ్దం) దాకా కాశ్మీరాన్ని ఏలిన వివిధ రాజాధముల కుత్సితాలు, అత్యాచారాలను సవివరంగా ఏకరువు పెడతాడు కల్హణుడు. ముస్లింల రాకకు ముందు రాజ్యన్నేలిన వివిధ పాలకుల్లో శ్రేష్ఠుడని చెప్పదగిన లలితాదిత్యుడు సైతం ఒకనాడు బాగా తాగి ఆ మైకంలో శ్రీనగరాన్ని ఆసాంతం అగ్నికి అహుతి చేయమని ఆజ్ఞాపించాడట; తాను కొత్తగా నిర్మించిన పరిహాసపూర్ రాజధానిని పరిహసిస్తూ శ్రీనగర్ సగర్వంగా నిలవడం తనకు కడుపుమంట కలిగించడమే దానికి కారణం. విద్యావినోదాలను బాగా ప్రోత్సహించినట్లు గణుతికెక్కిన హర్షుడు (క్రీ.శ. 1059 - 1101) సైతం ప్రజలపై లెక్కలేనన్ని పన్నులు - ఆఖరుకు మలమూత్ర విసర్జనపై కూడా పన్నులు - విధించడమే గాక, అదీ చాలక రాజ్యంలోని వివిధ దేవాలయాల్లో గల అమూల్యాభరణ భరిత దైవవిగ్రహాలన్నిటినీ జప్తుచేసుకొన్నాడట. ఇందుకు

గాను, "ముక్కులు, చేతులు, కాళ్లు కుళ్లిన దిగంబర సన్యాసులను పంపించి మొదట ఆ దేవతావిగ్రహాలపై మలమూత్రాలు విసర్జింపజేసేవాడు. ఆ విధంగా అపవిత్రం చేయించిన పిదప, ఆ విగ్రహాలను తాళ్లతో కట్టి చీలమండల ఎత్తు ఉమ్మిగుండా వాటిని ఈడ్చుకు వచ్చేట్లు చేసే వాడు" అని కల్హణుడు వాపోయాడు. ముస్లిం రాజులు గుళ్లు కూలగొట్టారని, విగ్రహాలు విధ్వంసం చేసారని కంటనీరు పెట్టుకుంటూ ప్రజలలో అయినదానికీ, కానిదానికీ ముస్లిం మత విద్వేషం రెచ్చగొట్టజూచే హిందూమతోన్మాదులు ప్రత్యేకించి ఈ అంశం గమనించి బుద్ధితెచ్చుకుంటారని, అంతకంటె ప్రజలు వారి కల్లబొల్లి ప్రచారాలను గుడ్డిగా విశ్వసించకుండా ఏమతంవారైనా దోపిడీలు, దౌర్జన్యాలు చేస్తూ, అందుకుగాను తమకు పూజార్హమైన గుళ్లు, విగ్రహాలను సైతం ధ్వంసంచేసిన ఘటనలెన్నో వున్నాయని తెలిసి విశాలభావంతో వ్యవహరిస్తారని యిక్కడ ఆశించడం తప్పు కాదనుకుంటాను.

షా మిర్జా అనే సామాన్య యోధుడు కాశ్మీర్ సింహాసనాన్ని హస్తగతం చేసుకొనగల్గడంతో క్రీ.శ. 1339లో అక్కడ ముస్లిం పాలన మొదలైంది. మొదట్లో నిరంకుశపాలన నుండి ముక్తిగా భావించి ప్రజలు హర్షించినా అనతికాలంలో ముస్లింపాలన కూడ అతిదుర్భరంగా రూపొందింది. తర్వాత వచ్చిన సుల్తాన్ సికిందర్ వేలాది సంస్కృత గ్రంథాలన్నిటినీ తగుల బెట్టించడమేగాక ఎక్కడెక్కడి దేవాలయాల విగ్రహాలన్నింటినీ ధ్వంసం చేయించాడు. అపురూపమైన, అతిమనోహరమైన కాశ్మీర్ వాస్తుకళకు సముజ్వల నిదర్శనాలుగా సగర్వంగా నిలబడివుండిన అసంఖ్యాక దేవాలయాలను ధ్వంసం చేయించాడు. హిందువులను హిందువులుగా రాజ్యంలో బతకనీయక, అయితే యింకెక్కడకూ పారిపోనుకూడ అనుమతించక అలవికాని బాధలు పెట్టాడు. ఈ షా మిరీ వంశస్థుల పాలన 1555లో అంతమైంది. అప్పటినుండి 1586దాకా చాక్‌లనే ముస్లిం వంశస్థుల పాలన సాగింది. వీరి పాలనలో మరిన్ని దారుణాలు, ఈ సారి సున్నీముస్లింలపై జరిగాయి. 1586లో అక్బరు కాశ్మీరాన్ని ఆక్రమించుకొన్న దరిమిలా 166 సంవత్సరాల పాటు అక్కడ మొగలులు పాలన సాగింది. వారి హయాంలోనైనా సామాన్య ప్రజలకు నిష్కృతి లేకపోయింది. అక్బరు పాలనలో జరిగిన ఒక విచిత్ర ఘటనగురించి కాశ్మీరులో వింతగా కథలు చెప్పుకుంటారు. కాశ్మీర్ ప్రజలు తమలో తాము వ్యవహరించుకొనేటప్పుడెలావున్నా, పాలకవర్గాలతో వ్యవహరించేటప్పుడు మాత్రం చాల మోసంతో, కపటంగా ప్రవర్తిస్తారని ఒక పేరు పడిపోయింది. అలాగే వీరు అన్యాయాలను, అక్రమాలను, ధైర్యంగా ఎదిరించలేనివారని, వీరిలో పిరికితనం పాలెక్కువ, ఆడంగి స్వభావం హెచ్చనికూడ తెగనాడుతుంటారు. వీరుడైన అక్బరుకు వీరి మన్నుతిన్నపాము తత్వం బహుచిరాకు కలిగించిందట. 'అసలు మీరు మగవాళ్లేనా? సాహసిక పోరాటతత్వం కొద్దిగానైనా లేదే', అని విరుచుకుపడి ఆగ్రహంతో ఇకనుంచి మీరంతాకూడ పావడాలు కట్టుకుని తిరగండి అని కాశ్మీర్ పురుషులను ఆజ్ఞాపించాడట. అందువల్లే నేటికీ (యిటీవలి దాకా) కాశ్మీర్ పురుషుల ఉడుపులు స్త్రీల పరికిణీల్లా వుంటాయని ఎత్తిపొడుస్తారు. అయితే జాత్యభిమానంగల కాశ్మీరీలు ఈ ఘటనకే మరో భాష్యం చెబుతారు. కాశ్మీరీలు బహు సాహసికులు, భీకర యోధులని, వారి ప్రకోపానికి తాళడం కష్టం గనుక

పావడాలవంటి ఉడుపులు ధరించాలని ఆదేశించి, అలవాటుచేస్తే యిక వారు తేలిగ్గా, చలాకీగా కదిలి పోరాటం చేయడం అసాధ్యమవుతుందనే కుయుక్తితో అప్పటి కాశ్మీరీలను మోసంచేసి యిలాంటి ఉడుపులు అలవాటు చేయించారని వాళ్లంటారు. ఏదేమైనా మొగలుల పాలనలో సైతం కాశ్మీరీ జాతిని బాగా చిన్నచూపు చూసిన విషయమైతే నిజమేగదా.

1752లో అహమ్మద్ షా అబ్దాలీ ఆక్రమణతో కాశ్మీరులో ఆఫ్ఘన్ల పాలన మొదలైంది. దారుణాలు, అత్యాచారాలు జరపడంలో వీరిపాలన గతంలోని అన్నిరకాల పాలనలను తలదన్నింది. ఆఫ్ఘన్లు నియమించిన పఠాను సుబేదార్లు కిరాతకత్వానికి పెట్టింది పేరు. "తలలు కోయడమంటే పూలుతెంపడానికి మించి మరేమీ కాదనట్లు ఆ రాతిగుండె మనుషులు ప్రవర్తించారు" అంటూ అప్పట్లో ఒక పర్షియన్ కవితలో వీరిని తూలనాడారు. పఠాన్లను తరిమివేసి 1819లో మహారాజా రంజిత్‌సింగ్ కాశ్మీరును ఆక్రమించుకొనడంతో అక్కడ సిక్కులపాలన మొదలైంది. మొదట్లో కాశ్మీర్ ప్రజలు సిక్కులపాలనపై ఎన్నో ఆశలు పెట్టుకొని వుండినారు కాని అవన్నీ అడియాసలే అయినాయి. సిక్కులు కూడ కాశ్మీరీలను పశువుల్లా హీనంగా చూచారు. "ఎవరైనా సిక్కు ఎవరైనా స్థానిక కాశ్మీరీని చంపితే, అతనికి విధించే శిక్ష కేవలం 16నుండి 20రూపాయల జరిమానా మాత్రమే. చచ్చినవాడు హిందువైతే 4 రూపాయలు, ముస్లిమయితే 2 రూపాయల చొప్పున బాధితుల కుటుంబాలకు ఆ జరిమానాలోంచి ప్రభుత్వం చెల్లించేది." ఆఫ్ఘన్లకు వ్యతిరేకంగా చేసిన యుద్ధంలో తమకు సహకరించినందుకుగాను డోగ్రా వంశస్తుడు రాజా గులాబ్ సింగ్‌కు సిక్కులు జమ్మూ రాజ్యాన్ని మొత్తంగా బహూకరించారు. అనంతరం 1837-39లలో లడఖ్, బాల్టిస్తాన్‌లను టిబెట్‌నుండి కైవసం చేసుకొనడంలో గులాబ్‌సింగ్ కృతకృత్యుడయ్యాడు. 1846లో ఆంగ్లేయులకు, సిక్కులకు మధ్య జరిగిన యుద్ధంలో సిక్కులకు సామంతుడుగావుండిన గులాబ్ సింగ్ తన యజమానులకే నమ్మకద్రోహం చేసాడు. మొదట్లో తటస్థతను ప్రకటించినా, అనతికాలంలో యుద్ధపరిస్థితి బ్రిటిషువారికి అనుకూలంగా వుందని గ్రహించి ప్లేటు ఫిరాయించాడు. యుద్ధం చివరిదశలో పూర్తిగా ఆంగ్లేయుల పక్షం వహించి పోరాడాడు. యుద్ధంలో ఓడిన సిక్కులు కాశ్మీరులోయను వదులుకోవాల్సివచ్చింది. అప్పుడు రాజాగులాబ్‌సింగ్ ఎంతోయుక్తితో బ్రిటిషువారికి 75లక్షల రూపాయలు నజరానా చెల్లించి అమృత్‌సర్ సంధి అనేదొకటి కుదుర్చుకుని 1846లో కాశ్మీరుని తన హస్తగతం చేసుకొన్నాడు. "నేనీ అమృత్‌సర్ సంధి పాఠం చదివాను. అదొక అమ్మకం దస్తావేజు (Sale Deed) తప్ప మరేమీ కాదు. అప్పటి గవర్నరు జనరలు అమ్మకందారైతే, గులాబ్ సింగ్ కొనుగోలుదారు. మరిప్పుడు బ్రిటిషువారు నిష్క్రమించడంతో అది చెల్లని పత్రమే అవుతుంది. కనుక కాశ్మీరం సంగతేమి కావాలి? కాశ్మీర్ ప్రజల మనోభీష్టంపైనే కాశ్మీరు భవిష్యత్తు ఆధారపడి వుండాలనడంలో సందేహంలేదు" అని మహాత్మాగాంధీ ఈ అంశంపై వ్యాఖ్యానించాడు. గిల్గిత్‌కూడ ఈ అమ్మకం పత్రంద్వారా గులాబ్‌సింగ్‌కు సంక్రమించింది గాని అతడు ఆ సుదూర, దుర్గమప్రాంతంపై వాస్తవ అదుపాజ్ఞలు ఎన్నడూ సాధించుకోలేకపోయాడు. అనతికాలంలో గిల్గిత్‌లో బ్రిటిషువాళ్లే ఒక రాజకీయ ఏజెంటును నియమించి దానిని తమ వాస్తవ అదుపుకిందకు తెచ్చుకున్నారు.

ఇస్లాం మత ప్రభావం మూలంగా పద్నాలుగవ శతాబ్దంలో కాశ్మీర్ ప్రజల సాంఘిక జీవనంలో విప్లవాత్మక మార్పులు వచ్చాయి. ఛాందసబ్రాహ్మణులు ఇస్లాంరాకను గుడ్డిగా ప్రతిఘటిస్తే శైవమతావలంబకులు విమర్శనాత్మకంగా ఆమోదించారు. ఒక నవీన ధార్మిక మానవతావాదం ప్రాతిపదికగా లల్లాదేవి అనే సన్యాసిని ఇస్లాంలోని మేలి అంశాలను గ్రహిస్తూ ఒక కొత్త తాత్వికభావజాలాన్ని ఆవిష్కరించింది. ఆమె శిష్యుడు షేక్ నూరుద్దీన్ 'నందరుషి'గా పేరుపొంది అసంఖ్యాక ప్రజానీకాన్ని ఆకట్టుకొన్నాడు. కాశ్మీరులు నేటికీ అతడ్ని జాతీయరుషిగా భావించి, గౌరవిస్తారు. ఆయన మరణం తర్వాత ఆయన శిష్యులు ఒక రుషిపీఠాన్ని ఆవిష్కరించారు. ఈ ఇస్లామిక్ రుషుల ప్రభావంలో ఇస్లాం మతం ప్రధానంగా శాంతియుతంగానే ఉధృతంగా వ్యాపించింది. అప్పుడప్పుడు కత్తిబలంద్వారా బలవంతపు మార్పిడులు కూడ జరగకపోలేదు. అయితే మహమ్మదీయులైనా కాశ్మీరీలు తమ ప్రాచీన హిందూసంస్కృతిని పూర్తిగా విడిచిపెట్టలేదు. నేటికీ అందులోని అనేక ఆచారాలను పాటిస్తూనే వస్తున్నారు.

డోగ్రారాజుల పాలనకూడ కాశ్మీర్ ప్రజలకు సుఖసంతోషాలను ప్రసాదించలేకపోయింది. బ్రిటిషు ఇండియాలో హైదరాబాదు తర్వాత జమ్మూ-కాశ్మీరే అతిపెద్ద స్వదేశీ సంస్థానం. హైదరాబాదులో హిందూ మెజారిటీపై ముస్లిం నవాబు నిరంకుశత్వం చెలాయిస్తే, జమ్మూ-కాశ్మీర్‌లో తద్విరుద్ధంగా హిందూరాజు ముస్లిం ప్రజలను అణచివేయసాగాడు. కాశ్మీరీ పండిట్‌లు (బ్రాహ్మణులు) రాజుకు అన్నివిధాల సహాయ సహకారాలందించి ఈ అణచివేతలో తోడ్పడ్డారు. బహుశా ఐదుశతాబ్దాల ముస్లిం అణచివేతకు ఇదొక చారిత్రక ప్రతీకారమేమో. జమ్మూ-కాశ్మీర్ రాజ్యంలో భూములన్నీ అధికభాగం డోగ్రాలు, రాజపుత్రులు, కాశ్మీరీ పండిట్ల పాలయినాయి. చెమటోడ్చి కష్టించే ముస్లింరైతులు చెప్పుకోదగ్గ హక్కులేమీ లేని కౌలుదార్లుగా మగ్గిపోయారు. కాశ్మీర్ ప్రజలు పేదరికంలో, నిరంకుశత్వంలో అలమటించి పోయారు. రాజ్యం పోలీసులు నిర్దాక్షిణ్యంగా వ్యవహరించి, అతిచిన్న కారణాలకు కూడ విచారణలేకుండా ప్రజల్ని ఖైదుచేసేవారు. గోవధ నిషేధించబడింది. మొదట్లో తమ ఇంట్లో గోవులను కోసినా అందుకు ముస్లింలకు మరణశిక్ష విధించేవారు. తర్వాత అది పది సంవత్సరాల ఖైదుకు, చివరకు (1947కు పూర్వం) ఏడు సంవత్సరాల ఖైదుకు తగ్గించారు. 1941 జనాభాలెక్కల ప్రకారం 93.4శాతం మంది నిరక్షరాస్యులుగా వుండినారు. ప్రతి 3850 మందికి ఒక బాలుర పాఠశాల చొప్పున, ప్రతి 25,670 మందికి ఒక బాలికల పాఠశాల చొప్పున పాఠశాలలు వుండేవి. రాజ్యానికంతటికీ ఒకే ప్రభుత్వ కళాశాల వుండేది. సుమారు 60శాతం మంది రైతులకు ఇంచుమించు తలా 2 ఎకరాలు భూమి వుండేది. వారికి సుమారు 11 రూపాయల వార్షిక ఆదాయం లభించేది. మిగతా 40 శాతం మంది సాగుదార్లు భూమిలేని పేదలే. 1944-45లో రాజ్యంలో సగటు తలసరి వార్షిక ఆదాయం 11రూపాయలే; అందులోంచే 80పైసలదాకా పన్నులు చెల్లించాల్సివచ్చేది. మహారాజు దర్బారు ఖర్చులకు 40 లక్షల రూపాయలు, సైన్యానికి 50 లక్షల రూపాయలు ఖర్చుపెట్టగా వ్యవసాయం, పరిశ్రమలు, రోడ్లు, భవనాలు, నీటిపారుదల, విద్య, ప్రజారోగ్యం మొదలైన యితర పద్దులన్నింటి కింద కేవలం

36లక్షల రూపాయలే ఖర్చుపెట్టేవారు. దీనిని బట్టి డోగ్రాల పాలన ఎంత జనోద్ధారకమో అర్థం చేసుకోవచ్చు.

1850లో మహారాజా గులాబ్‌సింగ్‌కు ఒక వింతకోరిక కలిగింది. కాశ్మీరీలందరినీ మూకుమ్మడిగా హిందూమతంలోకి తిరిగి మార్పించి, ఆ విధంగా ఐదు శతాబ్దాల క్రితం జరిగిన దురంతాలకు ప్రతీకారం చేయాలనేదే ఆ కోరిక. తన పథకానికి హిందూమత ఉన్నతాచార్యుల ఆశీస్సులు, ఆమోదం తప్పనిసరి అవసరంగదా. కాశీవెళ్లి అక్కడి బ్రాహ్మణోత్తములకు నివేదించుకున్నాడు. కాని దురదృష్టవశాత్తూ అప్పుడు ఆర్యసమాజంగాని, దాని శుద్ధివుద్యమంగాని పుట్టనేలేదు. హిందూమతం వెలివేసేదేగాని దరిచేర్చుకునేది కాదు. మతాచార్యులు ఆశీర్వదించకపోగా చీవాట్లు పెట్టి పంపించారు. దానితో గులాబ్‌సింగ్ తన ప్రయత్నం విరమించుకున్నాడు. ఒక వేళ గులాబ్‌సింగ్ పథకమే పారివుంటే ఈనాడు కాశ్మీరు చరిత్ర పూర్తిగా భిన్నంగా వుండేదేమో!

## కాశ్మీర్ ప్రజల్లో నవచైతన్యం:-

భారత జాతీయ కాంగ్రెసు నాయకత్వంలో బ్రిటిషు ఇండియాలో జరిగే జాతీయోద్యమం కాశ్మీర్ ప్రజల అభిలాషలు, ఆకాంక్షలకుకూడ ఊపిరి పోసింది. 1921-22 నాటి సహాయ నిరాకరణోద్యమం ప్రభావం కాశ్మీర్ ప్రజల హృదయాలపై బలంగా పడింది. దానితో వారుకూడా డోగ్రారాజుల నిరంకుశత్వాన్ని నిరసించడం, విద్య, ఉపాధి కల్పనా రంగాల్లో సామాన్యప్రజలకు న్యాయం జరగాలని కోరడం మొదలైంది. మరిన్ని పాఠశాలలు, కళాశాలలు తెరవాలని, పరిపాలనలో ప్రజలకు తగుభాగం వుండాలని, భూముల యజమాన్యం విషయంలో సంరక్షణలు వుండాలనే డిమాండ్లతో నూర్‌షా నకీష్‌బందీ, మీర్‌వైజ్ జామా మస్‌జిద్, సాదుద్దీన్ షాల్ వంటి ముస్లింప్రముఖులు కాశ్మీరు మహారాజుకు విజ్ఞప్తి చేయడం, దానిని ఆయన వినిపించుకోకపోవడంతో 1924లో వైస్రాయ్ లార్డ్ రీడింగుకు అవే కోర్కెలతో ఒక వినతిపత్రం సమర్పించుకోవడం జరిగింది. దానిపై కినుక వహించిన మహారాజా వారి జాగీర్లను జప్తు చేయడమేగాక, సాదుద్దీన్ షాల్‌ను రాజ్యం నుండి బహిష్కరించాడుకూడ. అనంతరం 1928-29 ప్రాంతంలో కాశ్మీరీ పండితులు శంకర్‌లాల్ కౌల్ నాయకత్వంలో "కాశ్మీరు కాశ్మీరీలకే" అనే ఒక ఉద్యమం లేవదీసారు. దాని ఫలితంగా రాజ్యంలోకి కాశ్మీరేతరుల ప్రవేశంపై ఆంక్షలు విధిస్తూ మహారాజు కొన్ని చర్యలు తీసుకోవల్సివచ్చింది. 1929 డిసెంబరులో కాశ్మీరుకు అట్టేదూరంలేని లాహోర్‌లో జరిగిన అఖిలభారత కాంగ్రెస్ మహాసభ సంపూర్ణస్వాతంత్ర్య లక్ష్యాన్ని ప్రకటించి, అనతికాలంలో దేశవ్యాప్త శాసనోల్లంఘనోద్యమానికి సన్నద్ధులు కండని ప్రజలకు పిలుపు నిచ్చింది. దీని ప్రభావం, ఆనక కొద్దినెలల్లో పెద్దయెత్తున చెలరేగిన శాసనోల్లంఘనోద్యమ ప్రభావం కాశ్మీర్ ప్రజల హృదయాలపై బలంగా పడింది. దేశభక్తి కాశ్మీరీలు రాజ్యంలోని పరిపాలనా, సైనిక సేవల్లో ముస్లింలనుకూడ చేర్చుకోవాలంటూ ఉద్యమం ప్రారంభించారు. మొదట తమను రాజకీయంగా చైతన్యవంతంచేసుకొనడానికి పఠనమందిరాలు ప్రారంభించి వాటిల్లో సమస్యలు చర్చించేవారు. వీరి ప్రభావం క్రమక్రమేపీ పెరిగి ముల్లాల

ఆశీస్సులతో అనుమతితో మసీదుల్లో రాజకీయ సభల ఏర్పాటుకు, ఆనక కొద్దికాలంలోనే బహిరంగ సభల్లో డిమాండ్ల ప్రకటనలకు దారితీసింది. 1931లో మహారాజా మూడు ముస్లిమేతర పార్టీలు - కాశ్మీరీ పండిట్ల సదస్సు, జమ్మూ హిందూసభ, శిక్కుల శిరోమణి ఖల్సా దర్బారులకు చట్టబద్ధంగా వ్యవహరించేందుకు అనుమతి ప్రసాదిరచాడు. కాని ముస్లిం ప్రజలకు రాజకీయ హక్కులు మాత్రం యింకా ప్రసాదించబడలేదు.

ఈ కాలంలోనే ఒక 25 సంవత్సరాల యువకుడు - ఒక నిరుద్యోగి అధ్యాపకుడు - రంగంలోకి వచ్చి అయస్కాంతంలా అశేష కాశ్మీర్ ప్రజలను ఆకర్షించి ఒక మహత్తర ప్రజావుద్యమానికి నాందీ ప్రస్తావన చేసాడు. అతడే షేక్ మహమ్మద్ అబ్దుల్లా. షేక్ మహమ్మద్ ఇబ్రహీం అనే ఒక చిన్న కాశ్మీరీశాలువల వ్యాపారికున్న ఐదుగురి సంతతిలో ఒకడు. ఇస్లామిక్ కాలేజీ లాహోర్‌లోను, అనంతరం ఆలీఘర్ ముస్లిం యూనివర్సిటీలోనూ చదువుకుని వచ్చిన ఈ ఆరడగుల నాలుగంగుళాల ఎత్తయిన స్ఫురద్రూపి యువకుడు తన విప్లవదీక్ష, కుశాగ్ర బుద్ధి, అపార దేశభక్తులతో కాశ్మీరీ ముస్లింలను విశేషంగా ప్రభావితంచేసాడు. ఫలితంగా 1931 జులైలో కాశ్మీరులోయ అంతటా ఒక విస్తృతమైన జనాందోళన - దీన్ని ఒక విధంగా ప్రజల తిరుగుబాటు అని అనవచ్చు - చెలరేగింది. డోగ్రాసైన్యాన్ని ఉపయోగించి ఉద్యమాన్ని క్రూరంగా అణచివేయాలని మహారాజా ఎంత ప్రయత్నించినా అది ఆయన వల్లకాలేదు. షేక్ అబ్దుల్లానైతే అరెస్టుచేసి, అనేక వారాలపాటు జైల్లో నిర్బంధించి వుంచారుగాని, శతాబ్దాలుగా తమను పట్టిపీడించే విధేయతా దాస్యప్రవృత్తులను ఒక్కసారిగా దులుపుకుని విజృంభిస్తున్నారా అన్నట్లు వీరోచితంగా పోరాడే ప్రజలను సైనికపాలన వల్లకూడ అణచలేకపోయారు. డోగ్రాసైన్యాలు యిష్టంవచ్చినట్లు కాల్పులు సాగిస్తున్నా ప్రదర్శకుల్లో ఎవరూ వెన్నిచ్చి పారిపోలేదు. అసంఖ్యాకంగా మృతిచెందిన వారిలో ఏ ఒక్కరికీ వెన్నుగుండా తూటాలు దూసుకెళ్లక పోవడం, అందరికీ ఛాతీలపైనే గుండ్లదెబ్బలు తగలడమే యిందుకు తిరుగులేని నిదర్శనమని చెబుతారు.

మొదటి తిరుగుబాటును కాలక్రమాన అణచివేసారు; ఏవో కొన్ని కంటితుడుపు సంస్కరణలు చేశారు. కాని ప్రజలు కోరిన ప్రధాన డిమాండ్లు ఏవీ నెరవేరలేదు. ఫలితంగా జనాందోళన తిరిగి రాజుకో సాగింది. ఖైదుశిక్ష భరించి విడుదలై వచ్చిన షేక్ అబ్దుల్లాకు ప్రజలు బ్రహ్మరథం పట్టి 'కాశ్మీర్ సింహం' (షేర్-ఇ-కాశ్మీర్) అనే బిరుదు ప్రసాదించారు. జైలునుంచి విడులయిన వెంటనే షేక్ అబ్దుల్లా తిరిగి రాజకీయ కార్యకలాపాల్లో తలదూర్చాడు; 1932 అక్టోబరులో అఖిల జమ్మూ, కాశ్మీర్ ముస్లిం సదస్సును ఏర్పాటు చేశాడు.

మొదట్లో షేక్ అబ్దుల్లా, ఆయన అనుయాయుల ఉద్యమమంతా 'ఇస్లాం ప్రమాదంలో వున్నది' అనే బూచిని ముస్లిం ప్రజల యెదుట ప్రముఖంగా ప్రదర్శించడంద్వారా కొనసాగిందని గమనించాలి. అయితే షేక్ అబ్దుల్లా, ఆయన సన్నిహిత మిత్రులు జి.ఎమ్. సాదిక్ ప్రభృతులు లౌకిక భావాలతో కూడ ప్రభావితమైవుండడంవలన, ప్రత్యేకించి ముస్లిం లీగు కంటె హెచ్చుగా బ్రిటిష

పాలకుల నెదిరించి పోరాడే భారత జాతీయ కాంగ్రెసు వారిని అధికంగా ఆకర్షించడం వలన, క్రమక్రమంగా తమ వుద్యమాన్నికూడ లౌకికవాద పట్టాలపై ఎక్కించే ప్రయత్నం చేయసాగారు. ఇది చివరికి 1939లో జమ్మూ-కాశ్మీర్ జాతీయ సదస్సు ఏర్పాటుకు దారితీసింది. సరే ఆ సంగతికి మున్ముందు వద్దాము.

కాశ్మీరులో ప్రజల ప్రతిఘటనా తీవ్రతను గమనించిన బ్రిటిష్ ప్రభుత్వం అక్కడి పరిస్థితుల పరిశీలనకు గ్లాన్సీ కమీషన్ అనే ఒక సంఘాన్ని నియమించి కాశ్మీరీ ముస్లింల డిమాండ్లను విచారించి, కొన్ని భూసంస్కరణలు చేయవల్సిందిగాను, ఒక శాసన సభను ఎన్నుకొనేందుకు ప్రజలకు అధికారం ప్రసాదించవల్సిందిగాను మహారాజుకు సలహాయిచ్చింది. ఆ సూచనలను మహారాజా అమలుచేయ నిచ్చగించాడో, లేదో తెలియదుగాని తిరిగి 1933లో మరొక ప్రజా తిరుగుబాటు బద్దలయింది. ఈ సారి పంజాబునుండి వేల సంఖ్యలో వచ్చిన ముస్లింల జాథాలు కాశ్మీర్ప్రజల పోరాటానికి మద్దతు నిచ్చాయి. అయితే 1933 జూన్ 1 వతేదిన మళ్లీ సైనిక పాలన విధించి ఈ పర్యాయం కూడ తిరుగుబాటును క్రూరంగా అణచివేసారు. అనంతరం 1934 వసంతకాలంలో అప్పట్లో షేక్అబ్దుల్లా సన్నిహిత మిత్రుడైన చౌధరి గులాం అబ్బాస్ నాయకత్వాన ముస్లిం కాన్ఫరెన్సు ఒక శాసనోల్లంఘనోద్యమం నడిపింది. అయితే అదీ విఫలమైంది. ఎట్టకేలకు 1934 ఏప్రిల్ 22వ తేదీనాడు, అటు బ్రిటిషు వాళ్లు పైనుండి తెచ్చే వత్తిడికి, ఇటు ప్రజలు కిందనుండి జరిపే ప్రతిఘటనకు తలవంచి మహారాజా హరిసింగ్ బహదూర్ 1991 వి.శ. సంవత్సరపు 1వ రెగ్యులేషన్ అనే రాజ్యాంగచట్టం తీసుకొచ్చాడు. దాని ప్రకారం కనీసం 15000 రూపాయల మేర ఆస్తిపాస్తులుండి, 800రూపాయలు వార్షికాదాయం వుండి, అక్షరాస్యులైన వ్యక్తులకు ఓటుహక్కు ప్రసాదించబడింది. అంటే జనాభాలో కేవలం 8శాతం మందికన్నమాట. మొత్తం 75మంది సభ్యులుగల శాసనసభలో (దాన్ని ప్రజాసభ అన్నారు) 35 మందిని మహారాజా నియమిస్తే 40మందిని ప్రజలలు ఎన్నుకోవాలి. అంతేగాక ఈ శాసన సభకు సలహాలు, సంప్రదింపుల హక్కేగాని శాసననిర్మాణాధికారం లేదు. ఇలాంటి అతిపరిమిత అధికారాలుగల శాసన సభకుగాను కాశ్మీరులోయలో జరిగిన మొట్టమొదటి ఎన్నికల్లో (1934లో) ముస్లింలకని కేటాయించిన 21 స్థానాల్లో 14 స్థానాలను ముస్లిం కాన్ఫరెన్సు గెలుచుకొంది. 1936లో శాసనసభకు ఎన్నికైన సభ్యులంతా తమకు శాసననిర్మాణాధికారం లేకపోవడానికి నిరసనగా వాకౌట్ చేయడంతో దాని జీవితం అంతమైనట్లే అయింది. తిరిగి 1938లో జరిగిన ఎన్నికల్లో ముస్లిం కాన్ఫరెన్సు 21 సీట్లలో 19 ని గెల్చుకుని తన పెరుగుతున్న బలాన్ని ప్రదర్శించుకుంది.

షేక్ అబ్దుల్లా, జి.ఎమ్. సాదిక్లవంటి ప్రముఖులు మొదటినుండీ లౌకికవాద భారత జాతీయ కాంగ్రెసు ప్రభావంలో వున్నారని ఈ వరకే తెలుసుకున్నాము. 1937 నాటికే "హిందువులు, ముస్లింల నడుమగల అఖాతాన్ని పూడ్చేందుకు సత్వరచర్యలు తీసుకోవా" లనే విజ్ఞత వారు చూపించారు. కేవలం ముస్లింలను మాత్రమే సభ్యులుగా చేర్చుకుని ముస్లిం కాన్ఫరెన్సు నడపడమంటే

అది కాశ్మీరీలు తమ జాతీయోద్యమ మహత్తును గుర్తించకుండా హిందూ-ముస్లిం పోరాటంలోను, అభివృద్ధి నిరోధక ధోరణులు, మధ్యయుగాలనాటి బూజుపట్టిన చింతనా తత్వాల్లోను కూరుకుపోవడమే కాగలదని షేక్ అబ్దుల్లా భావించాడు. భారత జాతీయ కాంగ్రెసు ప్రచారం చేసే లౌకిక, ప్రజాస్వామ్య, సమైక్య స్వతంత్రభారత సాధనా ఆశయం ఆయన హృదయాన్ని బాగా ఆకట్టుకుంది. ఇక జి.ఎమ్. సాదిక్ మరొక అడుగు ముందుకు వేసి బోల్షివిక్ విప్లవ విజయాలను, సోషలిజం ఔనత్యాన్ని ప్రశంసిస్తూ సామ్యవాద మతావలంబకుడైనాడు. ఈ అభ్యుదయ భావాల ప్రచారానికిగాను షేక్ అబ్దుల్లా, ప్రేమ్‌నాథ్ బజాజ్ అనే కాశ్మీరీ బ్రాహ్మణ నాయకునితో కలిసి 'హమ్‌దర్ద్' అనే రాజకీయ వారపత్రికను 1935లో ప్రారంభించాడు. కాశ్మీరీ జాతీయ చైతన్యం పెంపొందించవల్సిన అవసరం గురించి ఈ పత్రిక విశేషంగా ప్రచారం చేసింది. ప్రేమ్‌నాథ్ బజాజ్ షేక్ అబ్దుల్లాకు నెహ్రూతో పరిచయం కలిగించాడు. అప్పటినుండి జవహర్‌లాల్ నెహ్రూతో ఆయన సన్నిహిత మైత్రి పెంపొందించుకున్నాడు. భారత జాతీయ కాంగ్రెస్ ఆధ్వర్యంలోని అఖిల భారత స్వదేశీ సంస్థానాల ప్రజల కాంగ్రెసుకు కూడ షేక్ అబ్దుల్లా ఒకసారి అధ్యక్షుడైనాడు. ఈ పరిణామాలకు పరాకాష్టగా 1939 జూన్‌లో ఒక చరిత్రాత్మకమైన అఖిల జమ్మూ, కాశ్మీర్ ముస్లిం కాన్ఫరెన్సు జరిగింది. షేక్ అబ్దుల్లా, మిర్జా అఫ్జల్ బేగ్, మౌలీ మహమ్మద్ సయ్యద్ మసూర్, బక్షీ గులాం అహమ్మద్, చౌధరీ గులాం అబ్బాస్‌ల వంటి ప్రముఖులు పాల్గొన్న ఈ సదస్సుకు జి.యమ్. సాదిక్ అధ్యక్షత వహించారు. అందులో ముస్లిం కాన్ఫరెన్సు అన్న పేరు మార్చి జమ్మూ కాశ్మీర్ జాతీయ కాన్ఫరెన్సు అనే పేరుపెట్టాలనే తీర్మానం 179 మంది ప్రతినిధుల మద్దతుతో కేవలం ముగ్గురు ప్రతినిధుల వ్యతిరేకతతో పాసయింది. అప్పటి నుండి కాశ్మీరులో ప్రజావుద్యమం మరింత విస్తృత ప్రాతిపదికన కొనసాగడం మొదలైంది.

కాని కాశ్మీర్ ముస్లింలకు సంబంధించి మాత్రం పై పరిణామం అశనిపాతమైంది. అంతవరకు ఒకే కట్టుగావున్న ముస్లింలు దీనితో విడిపోయారు. చౌధరి గులాం అబ్బాస్ నాయకత్వంలో విడిపోయి, ముస్లిం కాన్ఫరెన్సుగానే వున్నవారు మొదట్లో అతి బలహీనంగా వున్నా, అనతికాలంలో తగినంతగా పుంజుకున్నారు. బ్రిటిషు ఇండియాలో భారత జాతీయ కాంగ్రెసుకు, ముస్లిం లీగుకు నడుమ చీలిక ఎంత దురదృష్టకరమైందో, ముస్లిం కాన్ఫరెన్సుకు, జాతీయ కాన్ఫరెన్సుకు మధ్య చీలికకూడ కాశ్మీరుకు అంతే దురదృష్టకరంగా రూపొందింది. 1939లో మహారాజా కొన్ని ఉదారవాద సంస్కరణలు తెచ్చి ఒక మంత్రిమండలిని, పరిపాలనా వ్యవస్థలో న్యాయ వ్యవస్థకు కొంత స్వాతంత్ర్యాన్ని ఏర్పాటు చేసాడు. అయితే నిర్ణయాత్మక అధికారాలు మాత్రం తన చేతుల్లోనే పెట్టుకున్నాడు. బ్రిటిషు ఇండియాలో ఆంగ్లపాలకులు యిచ్చిన ప్రతి రాజకీయ రాయితీతోనూ కాంగ్రెసుకు, ముస్లింలీగ్‌కు మధ్య స్పర్థ, వైరం ఎలా పెరిగిపోతూ వచ్చిందో, అదే విధంగా మహారాజా చేసే సంస్కరణలతోబాటుగా జమ్మూ-కాశ్మీరులో ముస్లిం కాన్ఫరెన్సుకు, జాతీయ కాన్ఫరెన్సుకు మధ్య అఖాతం పెరిగిపోతూవచ్చింది. షేక్ అబ్దుల్లాకు గల అపూర్వ జనాదరణవల్ల జాతీయ కాన్ఫరెన్సు బలం చెక్కు చెదరకపోయినా, 1943లో మహమ్మద్ ఆలీ జిన్నా కాశ్మీర్ సందర్శన

అనంతరం నుండి ముస్లిం కాన్ఫరెన్సు పాకిస్తాన్ ఏర్పాటు డిమాండును బలపరిస్తే, జమ్మూ-కాశ్మీర్ జాతీయ కాన్ఫరెన్సు భారత జాతీయ కాంగ్రెసు అడుగుజాడల్లో అవిభక్త స్వతంత్ర భారతాన్ని కోరుకున్నది; అందులోనే కాశ్మీర్ ప్రజల జాతీయ ఆకాంక్షల్ని, స్వాతంత్ర్యాభిలాషనుకూడ నెరవేర్చుకోవాలనుకున్నది. 1944లో జమ్మూ-కాశ్మీర్ జాతీయ కాన్ఫరెన్సు ప్రజాదరణ యింకా పెరుగుతున్న దశలోనే షేక్ అబ్దుల్లా సన్నిహిత సహచరుడు మిర్జా అఫ్జల్ బేగ్ మహారాజు ప్రభుత్వంలో ప్రజాపనుల శాఖామంత్రిగా చేరాడుకూడ. కాని అనతికాలంలో అఖిల భారతంలో ముస్లింల మనోభావాలు ఎలా త్వరత్వరగా పాకిస్తాన్ అనుకూలంగా మారాయో, అదే రీతిలో కాశ్మీర్ ముస్లింలు కూడ గణనీయంగా ముస్లిం కాన్ఫరెన్సు వైపుకు మొగ్గడం మొదలుపెట్టారు.

1942లో భారతదేశమంతటా చెలరేగిన క్విట్ ఇండియా ఉద్యమ ప్రభావం కాశ్మీర్ ప్రజలపై కూడ పడింది. మహారాజా ప్రజలకు నిజమైన పాలనాధికారాలు యివ్వడంలేదన్న ఆగ్రహంతో షేక్ అబ్దుల్లా 1946 మే లో 'క్విట్ కాశ్మీర్' వుద్యమం ప్రారంభించాడు. డోగ్రా మహారాజు పదవీత్యాగం చేసి ప్రజలచేతులకు పాలనాధికారాలన్నీ అప్పగించాలనే డిమాండుతో జాతీయ కాన్ఫరెన్సు ఈ ఉద్యమం నడిపింది. కాని ముస్లిం కాన్ఫరెన్సు ఈ ఉద్యమానికి మద్దతు నివ్వలేదు. అంతేగాక ప్రేమ్‌నాథ్ బజాజ్‌వంటి హిందూ మిత్రులు కూడ షేక్ అబ్దుల్లాకు దూరమైనారు. మహారాజాను పూర్తిగా తరిమేస్తే తమ ప్రయోజనాలకు ముస్లిం మెజారిటీవల్ల ముప్పువాటిల్లుతుందనే భయం హిందువులకు, సిక్కులకు కలిగింది. షేక్ అబ్దుల్లాను అరెస్టుచేసి రాజద్రోహ నేరం కింద కేసు పెట్టి జైల్లో తోశారు. దీనిపై ఆందోళన చెందిన జవహర్‌లాల్ నెహ్రూ, షేక్‌అబ్దుల్లా తరపున డిఫెన్సు వాదనలకు సహాయం చేయడానికని, శ్రీనగర్‌కు వస్తే ఆయన్నికూడ, త్వరలో భారతప్రధాని కానున్నాడని సైతం పరిగణనలోనికి తీసుకోకుండా, 1946 జూన్ 21వ తేదీనాడు అరెస్టుచేసి, తిరిగి వెనక్కు పంపించివేసారు. 1947 సెప్టెంబరు వరకు షేక్ అబ్దుల్లా జైల్లో మగ్గిపోవల్సి వచ్చింది.

ముస్లిం లీగ్ నాయకుడు మహమ్మద్ ఆలీ జిన్నా పాకిస్తాన్ డిమాండు సాధనకోసం 1946 ఆగష్టు 14వ తేదీనాడు భారతదేశమంతటా ప్రత్యక్ష చర్యకు పిలుపిచ్చాడు. కాశ్మీరు ముస్లిం కాన్ఫరెన్సు కూడ అందుకు అనుకూలంగా ప్రతిస్పందించి ఆందోళన జరిపింది. భారతదేశమంతటా, ప్రత్యేకించి పంజాబు, బెంగాల్‌లలో ఊహించనంత పెద్దస్థాయిలో మతకలహాలు, మారణహోమాలు చెలరేగాయి. ఈ మతవర్గాల బద్ధవైషమ్యం ప్రభావం జమ్మూ-కాశ్మీరుపై కూడ పడింది. ఈ ప్రత్యక్షచర్య వుద్యమ క్రమంలో చౌధరి గులాం అబ్బాస్ అరెస్టయి జైల్లో బంధింపబడ్డాడు. అప్పుడు షేక్ అబ్దుల్లా, చౌధరి గులాం అబ్బాస్‌లు ఉభయులూ చిరకాలం తర్వాత మళ్లీ జైల్లో కల్సుకొని తమ పాతస్నేహాన్ని, కాశ్మీరు జాతీయ స్వాతంత్ర్యం కోసం తమ పోరాట స్మృతుల్నిగురించి నెమరువేసుకున్నారు. భవిష్యత్తులో సమైక్యంగా జమ్మూ-కాశ్మీర్ ప్రజల స్వయంనిర్ణయాధికారం కోసం పోరాడాలని అనుకున్నారట కాని బ్రిటిషు ఇండియాలో, యితరత్రా ఉధృతంగా మారిపోయే రాజకీయ వాతావరణం వారి కలల్ని కల్లలుగానే చేసివేసింది. 1947 జనవరిలో కాశ్మీర్ శాసనసభకు తిరిగి ఎన్నికలు జరిగాయి. ఈ సారి జాతీయ కాన్ఫరెన్సు ఎన్నికల్ని బహిష్కరించింది. కాని ముస్లిం

కాన్ఫరెన్సు అందులో పాల్గొని 21 ముస్లిం స్థానాల్లో 16 స్థానాలు గెలుచుకుంది. ఈ ఎన్నికల ఫలితాలను ఉభయ కాన్ఫరెన్సులూ తమకే విజయంగా ప్రకటించుకున్నాయి. మొత్తం 6,07,419 మంది ఓటర్లలో కేవలం 1,82,800 మంది అంటే 30-31 శాతం మాత్రమే ఓటు చేశారంటే అది తమ బహిష్కరణ పిలుపుకు ఘనవిజయమని జాతీయ కాన్ఫరెన్సు పొంగిపోతే, కాదు, ఎన్నికల సమయంలో మంచుకురిసి దుర్గమమైన ప్రదేశాలు ఎన్నో ఏర్పడినా 30 శాతం పైగా ఓటుచేశారంటే అది బహిష్కరణ వాదుల ఓటమేనని, ఓటుచేసిన ముస్లింలలో అత్యధిక శాతం తమకే మద్దతు నిచ్చారని ముస్లిం కాన్ఫరెన్సు ప్రకటించింది. ఏమైనా ఎవరి ఆనందమూ ఎంతో కాలం నిలవలేదు. మరో 9 నెలలు నిండకముందే కాశ్మీరు కనీవినీ ఎరుగని సంక్షోభానికి గురయింది.

## భారత యూనియన్, పాకిస్తాన్, స్వదేశీ సంస్థానాలుః-

భారతదేశంలో బ్రిటిషు పాలన కొనసాగడానికి ఏ కాస్త నైతిక అధికారం మిగిలివున్నా అదంతా క్విట్ ఇండియా ఉద్యమంతో బుగ్గిపాలయింది. రెండవ ప్రపంచయుద్ధం ముగింపు మిత్రరాజ్యాలకు విజయంగానే పరిణమించినా, బ్రిటన్ మాత్రం బాగా బలహీనపడింది. వేలు, లక్షల సంఖ్యలో ప్రాణాలను, కోట్ల పౌన్ల విలువగల ఆస్తిపాస్తుల్ని నష్టపోయిన అనంతరం బ్రిటిషు పౌరులు యుద్ధమంటేనే బాగా విసిగి పోయారు; సామ్రాజ్య ప్రయోజనాలకోసమని మరెంత మాత్రం రక్తంగాని, ధనంగాని వెచ్చించే స్థితిలో లేరు. యుద్ధానంతర ఎన్నికల్లో శాంతికి, సాంఘిక ప్రజాస్వామ్యానికి కట్టుబడిన లేబర్ పార్టీ గెలిచి, అట్లీ ప్రధానమంత్రి అయ్యాడు. 1947 ఫిబ్రవరి 20వ తేదీనాడు బ్రిటిషు కామన్సు సభలో ప్రసంగిస్తూ, "1948 జూన్‌లోగా బాధ్యతాయుతమైన భారతీయ హస్తాలకు అధికార మార్పిడీ చేయడానికి తాము కృతనిశ్చయంతో" వున్నట్లు ఆయన ప్రకటించాడు. కాని భారత ఉపఖండంలో రాజకీయ కల్లోలాలు, మతకలహాలు, మూకుమ్మడి ఊచకోతలు నానాటికీ ఉధృతం కావడంతో 1947 మార్చి 24వ తేదీనాడు భారతదేశానికి కొత్త వైస్‌రాయ్‌గా వచ్చిన లార్డ్ మౌంట్ బాటెన్ భారతదేశాన్ని రెండు అధినివేశాలు - భారతయూనియన్, పాకిస్తాన్‌లుగా విభజించి 1947 ఆగష్టు 15లోగా అధికార మార్పిడీ జరపాలనే తన తొందరపాటు నిశ్చయం వెల్లడించాడు. ఫలితంగా వ్యవహారాలు చకచకా సాగిపోయాయి. బ్రిటిషు కామన్సు సభలో భారత స్వాతంత్ర్య బిల్లును 1947, జులై 14న ప్రవేశపెట్టారు; జులై 15న ఆ సభలోను, మరునాడు ప్రభువుల సభలోనూ ఆ బిల్లు పాసై జులై 18వ తేదీనాడు రాజామోదం పొంది చట్టంగా రూపొందింది.

1947 ఆగష్టు 15వతేదీ నాటినుండి భారత యూనియన్, పాకిస్తాన్ అనే రెండు స్వతంత్ర అధినివేశాల ఏర్పాటు జరగాలని ఆ చట్టం పేర్కొన్నది. ఆ రెండు అధినివేశాల సరిహద్దులను గిరిగీసి అందుమూలంగా పంజాబ్, బెంగాల్ రాష్ట్రాల విభజన తప్పదని సూచించింది; యితరత్రా తలయెత్తే అనేక సంబంధిత సమస్యల పరిష్కారాన్ని గురించి కూడ ఆ చట్టం ప్రస్తావించింది. అప్పటికి అవిభక్త భారతదేశంలో బ్రిటిషు సర్వాధిపత్యంకిందవున్న వివిధ స్వదేశీ సంస్థానాలు సుంకాలు, రాకపోకలు, రవాణా, తంతి-తపాలా మొదలైన సౌకర్యాలు

మునుపటి లాగానే కొనసాగించుకోవచ్చని సూచించింది.

1857 తిరుగుబాటు తర్వాత భారతదేశంలోని స్వదేశీ సంస్థానాధీశులంతా విధిగా బ్రిటిషు సర్వాధిపత్యానికి (Paramountcy) లోను కావల్సివచ్చింది. అయితే అదేసమయంలో తమ సంస్థానాల అంతర్గత వ్యవహారాల్లో నిరంకుశంగా మెలిగే వెసులుబాటుకూడా వారికి లభించింది. 1857 తిరుగుబాటుతో పెద్దదెబ్బ తినివున్న బ్రిటిషు పాలకులు, అంతకు మునుపటిలా చీటికీమాటికీ స్వదేశీ సంస్థానాల వ్యవహారాల్లో అనవసర జోక్యం కల్పించుకోవడం మానేసారు. తమ సామ్రాజ్యం పాలనకు దన్నుగానిలిచే నమ్మకమైన సామంతులుగా స్వదేశీ రాజుల్ని రూపుదిద్దే ప్రయత్నాలు చేసారు. వాటిలో గణనీయంగా విజయం సాధించారుకూడ. అయితే బ్రిటిషు ఇండియా అంతటా బాధ్యతాయుత ప్రభుత్వం కోసం, స్వరాజ్యంకోసం, పౌరహక్కుల కోసం జరిగే జాతీయోద్యమ ప్రభావం స్వదేశీ సంస్థానాల్లో నిరంకుశ పాలనలో నలిగిపోతున్న ప్రజలపై కూడ పడకపోలేదు. ఒకటి వెనుక మరొకటిగా వివిధ-స్వదేశీ సంస్థానాల్లో ప్రజా వుద్యమాలు ఆవిర్భవించడం ప్రజాస్వామిక హక్కులు, పరిపాలనాధికారాలు కావాలనే డిమాండ్లు చేయడం మొదలైంది. స్వదేశీ సంస్థానాల అంతర్గత వ్యవహారాల్లో జోక్యం చేసుకోరాదని మొదట్లో భారత జాతీయ కాంగ్రెసు భావించినా ఎంతో కాలం అలా మడికట్టుకుని కూర్చోలేకపోయింది. స్వదేశీ రాజ్యాల ప్రజలను ప్రజామండలుల ఆధ్వర్యంలో సమీకరించడానికి స్థానిక కాంగ్రెస్ కార్యకర్తలకు అనుమతి నిచ్చింది. 1946 నాటికి వివిధ స్వదేశీ సంస్థానాల ప్రజామండలుల అఖిల భారత ఫెడరేషన్ కూడా ఏర్పడింది. వివిధ స్వదేశీ సంస్థానాల్లో బాధ్యతాయుత ప్రభుత్వంకోసం, ప్రజాస్వామ్య చట్టాలకోసం ప్రజోద్యమాలు తీవ్రతరం కాసాగాయి. ఈ నేపథ్యంలో బ్రిటిషువారు నిష్క్రమించిన పిదప ఈ స్వదేశీ సంస్థానాల భవితవ్యం ఏమి కావాలనే ప్రశ్న తలయెత్తింది.

దేశవిభజన నాటికి భారత ఉపఖండంలో మొత్తం 584 స్వదేశీ సంస్థానాలు నలుదిక్కులా చెదురుగా వ్యాపించి వున్నాయి. మొత్తం ఉపఖండం వైశాల్యంలో 45.3 శాతం భాగం వున్న ఈ స్వదేశీ సంస్థానాల మొత్తం జనాభా 9.9 కోట్లు. కొన్ని స్వదేశీ సంస్థానాలు - హైదరాబాదు, జమ్మూ-కాశ్మీరు, మైసూరు, తిరువాన్కూరు వంటివి - మాత్రమే తగుమాత్రం పెద్దవి. ఏవోకొంతమేర నిజమైన అధికారాలు, శక్తి సంపదలు గలవి. మిగతా అత్యధికం సంస్థానాలు చాల చిన్నవి. హైదరాబాదు సంస్థానం అన్నిటికంటె పెద్దది; సుమారు జర్మనీ దేశ మంత వైశాల్యం కలిగి, 1.7 కోట్ల జనాభా కలిగివుండేది. దీని తర్వాత జమ్మూ-కాశ్మీర్ రాజ్యమే అతిపెద్దది.

భారత దేశంలోని స్వదేశీసంస్థానాల రాజులంతా కలిపి 1921లో ఢిల్లీలో ఒక రాజమండలి (ఛాంబర్ ఆఫ్ ప్రిన్సెస్) ఏర్పాటు చేసుకున్నారు. 108 మంది పాలకులు, 127 చిన్నరాజ్యాలకు ప్రాతినిధ్యం వహించే మరి 12 మంది అదనపు సభ్యులు గల ఈ ఛాంబర్ ప్రధాన లక్ష్యం భారత దేశంలో సంభవించే యథార్థ రాజకీయ పరిణామాలగురించి స్వదేశీరాజులకు పరిచయం కలిగించడం, మారుతున్న పరిస్థితులను శ్రద్ధగా పరిశీలించడం. 1946లో బ్రిటిషు ప్రభుత్వం భారత దేశానికి

స్వాతంత్ర్యం ప్రసాదించనున్నదని స్పష్టమైనప్పుడు, అంతవరకు బ్రిటిషు సర్వాధిపత్యం కిందనున్న సంస్థానాల భవిష్యత్తు ఏమి కాగలదనే ప్రశ్న సహజంగానే తలయెత్తింది. భారతదేశానికి వచ్చివున్న కాబినెట్ మిషన్ 'స్వదేశీ సంస్థానాలతో సంధులు, సర్వాధిపత్యాలను గురించి" అనే ఒక పత్రంతో రాజమండలి ఛాన్సలర్‌కు ఈవిధంగా సమాచారం తెలిపింది. "బ్రిటిష్ రాజు ప్రభుత్వం సర్వాధిపత్య అధికారాలు చెలాయించడం మానివేస్తుంది. బ్రిటిషు రాజసింహాసనంతో తమకున్న సంబంధంద్వారా స్వదేశీ సంస్థానాలు సమర్పించుకున్న హక్కులేవీ యిక బ్రిటిషు రాజు ప్రభుత్వానికి వుండవని, సర్వాధిపత్య శక్తికి స్వదేశ సంస్థానాలు సమర్పించుకున్న అధికారాలన్నీ తిరిగి వాటికే సంక్రమిస్తాయని దీని అర్థం," అని స్పష్టం చేయబడింది. తిరిగి 1946 మే 16 తేదీనాడు యిదే కాబినెట్ మిషన్ స్వదేశీ సంస్థానాలపై తన పై వైఖరిని పునరుద్ఘాటిస్తూనే యింకా "బ్రిటిషు ఇండియాను, స్వదేశీ రాజ్యాలను కలుపుకొని ఒక భారత యూనియన్ వుండాలి. అది ఈ క్రింది అంశాలుః విదేశీ వ్యవహారాలు, రక్షణ, సమాచార సంబంధాలతో వ్యవహరిస్తుంది. యూనియన్‌కు అప్పగించిన పై అంశాలు, అధికారాలు తప్ప తక్కినవన్నీ స్వదేశీరాజ్యాలు అట్టి పెట్టుకోవచ్చు" అని ప్రకటించింది. కాబినెట్ మిషన్ ప్లాను భగ్నమైనా, దేశవిభజన తప్పనిసరి అయినా స్వదేశీ సంస్థానాలకు సంబంధించి యిదే మౌలిక సూత్రం వర్తించింది.

భారత స్వాతంత్ర్య చట్టం పాసయిన తర్వాత లార్డ్ మౌంట్‌బాటెన్ జులై 25వ తేదీనాడు ఛాంబర్ ఆఫ్ ప్రిన్సెస్‌లో ప్రసంగిస్తూ ఆ చట్టం అంతరార్థాలను వివరించాడు. బ్రిటిషువాళ్లు నిష్క్రమించిన తర్వాత స్వదేశీరాజ్యాలకు సంపూర్ణ స్వాతంత్ర్యం లభిస్తుందని, అవి సాంకేతికంగా చట్టబద్ధంగా సర్వస్వతంత్రమై వుంటాయని స్పష్టంచేశాడు. కాని భారతదేశం ఒకే ఆర్థిక సముదాయంగా వ్యవహరిస్తూ వచ్చిన విషయాన్ని, అతి త్వరగా మారుతున్న రాజకీయ పరిస్థితులను స్వదేశీ రాజులకు గుర్తుచేస్తూ ఈ నేపథ్యంలో స్వదేశీ సంస్థానాలు స్వతంత్రంగా మనడం కష్టసాధ్యమని, కనుక సంస్థానాధీశులు ఇండియాలోనో, పాకిస్తాన్‌లోనో చేరడమే అత్యుత్తమం కాగలదని స్పష్టంచేశాడు. అయితే దాని మూలంగా వాళ్లు కేవలం రక్షణ, విదేశీ వ్యవహారాలు, సమాచార సంబంధాలకు సంబంధించిన అధికారాలను మాత్రమే అధినివేశ ప్రభుత్వానికి అప్పగించినట్లవుతుంది, గాని స్వదేశీ సంస్థానాల ఆంతరంగిక స్వపరిపాలనను లేక సార్వభౌమాధికారాన్ని హరించే అధికారం ఆ అధినివేశ ప్రభుత్వాలకు వుండదని కూడ ఆయన స్పష్టంచేశాడు. ఏమైనా భారత యూనియన్‌తోనో, పాకిస్తాన్‌తోనో వెంటనే యథాతథస్థితి కొనసాగింపు ఒప్పందాలు (Standstill Agreements) చేసుకొని సుంకాలు, రవాణా, సమాచార సంబంధాలు, తంతి, తపాలా మొదలగు అంశాలపై మునుపటి వ్యవస్థ కొనసాగే ఏర్పాట్లు చేసుకోమని సలహాయిచ్చాడు. అలాగే భౌగోళిక సామీప్యాన్ని, యితర తప్పనిసరులను (compulsions) దృష్టిలో వుంచుకొని ఏ డొమినియన్‌లో చేరాలో నిర్ణయించుకోవల్సిందిగా సూచించాడు. మొత్తం స్వదేశీ సంస్థానాల్లో సుమారు 12 మాత్రమే ముస్లిం నవాబుల రాజ్యాలు. సాధారణంగా హిందూ రాజ్యాలు భారతదేశంలోనూ, ముస్లిం రాజ్యాలు పాకిస్తాన్‌లోనూ చేరుతాయని అంతా అనుకుంటూ వస్తున్నారు. అయితే బ్రిటిష్ పాలకులకు

సంబంధించి ఫలానా డొమినియన్‌లో చేరవల్సిందిగా తాము ఆదేశాలు జారీచేయలేమని, ఒకవేళ సంస్థానాధీశులు ఏదో ఒక డొమినియన్‌లో చేరాలని నిర్ణయించుకున్నా, అక్కడ ప్రజలు అత్యధిక సంఖ్యలో ఆ నిర్ణయాన్ని ఆమోదించనట్లయితే తుదకు ప్రజాభీష్టాన్నే మన్నించవల్సివుంటుందనికూడ మౌంట్‌బాటెన్ చూచాయగా చెప్పాడు.

అత్యధిక సంఖ్యాక స్వదేశ సంస్థానాల విషయంలో పెద్ద యిబ్బందులేమీ తలయెత్తలేదు. ముఖ్యంగా సర్దార్ పటేల్ చాకచక్యం వలన భారతయూనియన్ హద్దులలోపల వున్న స్వదేశీ సంస్థానాలు దాదాపు అన్నీ ఎక్కువ వత్తిడి లేకుండానే యూనియన్‌లో చేరాయి. మొత్తం ఉపఖండంలో మూడే సంస్థానాలు - హైదరాబాదు (దక్కన్), జునాగఢ్ (గుజరాత్), జమ్మూ-కాశ్మీర్‌ల భవిష్యత్తు మాత్రమే ప్రశ్నార్థకంగా మిగిలింది.

హైదరాబాదులో ముస్లిం నవాబు పాలనలో అత్యధిక మెజారిటీ ప్రజలు హిందువులుగా ఉన్న పరిస్థితి. ఇక్కడ ప్రజాభీష్టాన్ని కాదని నైజాం నవాబు స్వతంత్రరాజ్యంగా సాగడానికి వేసిన ఎత్తులు, జిత్తుల గురించి, వాటిని వమ్ముచేయడానికి ఇక్కడి ప్రజలు జరిపిన మహత్తర పోరాటాలు, అనంతరం సర్దార్ పటేల్ కృతనిశ్చయంతో 1948 సెప్టెంబరులో తీసుకున్న సైనిక చర్యలను గురించి మనకు తెలుసు. అయితే ఇక్కడ మనం గమనించవల్సిన ముఖ్యమైన అంశం ఏమిటంటే సంస్థానాధీశుడు విలీనం కాకూడదనే నిర్ణయం తీసుకొన్నప్పుడు రాజు ముఖ్యంకాదు, ప్రజలే ముఖ్యం అన్న వైఖరిని భారత ప్రభుత్వం తీసుకొని వర్తించిందని, భారత ప్రజలు కూడ ఆవైఖరిని హర్షించారని.

జునాగఢ్‌లోకూడ దాదాపు యిదే వరస. అయితే అక్కడ సాంకేతికంగా భారత ప్రభుత్వం అంతర్జాతీయ న్యాయాన్ని ఉల్లంఘించినట్లయింది. జునాగఢ్ పాలకుడు ముస్లిం, కాని అత్యధిక ప్రజలు హిందువులే (సుమారు 7 లక్షలమంది) అయినా జునాగఢ్ నవాబు పాకిస్తాన్‌లో చేరడానికి నిర్ణయించడం, దానికి జిన్నా సహర్షంగా ఆమోదించడంకూడా జరిగింది. కాని ఆ సంస్థానపు దివాన్, యితర ప్రముఖుల అభ్యర్థన మేరకు, చేరిక ఒడంబడికను తీవ్రంగా నిరసించిన హిందూ మెజారిటీ ఏర్పాటు చేసుకున్న తాత్కాలిక ప్రభుత్వానికి వత్తాసుగా భారత సైన్యం ప్రవేశించి అక్కడ ప్లెబిసైట్ జరిపించింది. ఆ స్వయం నిర్ణయాధికార ఎన్నికల్లో అత్యధిక మెజారిటీ భారత యూనియన్‌లో చేరాలని ఓటు చేయడం జరిగింది. ఇక్కడ కూడా సంస్థానాధీశుని నిర్ణయాన్ని తోసిరాజని ప్రజలే సర్వంసహాధికారులనే సూత్రాన్నే భారతప్రభుత్వం అవలంబించింది. అంతేగాక, ఇంకాకూడ ఒక అడుగుముందుకు వేసి, చేరిక ఒప్పందం జరిగిపోయినా, ప్రజల ఆమోదంలేనిదే దానికి చెల్లుబాటు లేదనే ఒక పూర్వనిర్ణీత న్యాయం (precedent) తానే నెలకొల్పింది.

మరి జమ్మూ-కాశ్మీర్ సమస్యమాత్రం పై రెంటికీ భిన్నంగా విచిత్రమైన మలుపులు తీసుకున్నది. నేటికీ అది అపరిష్కృతంగా రగులుతూనే వుంది. ఈ వివరాలేమిటో యిప్పుడు కాస్త లోతుగా తెలుసుకుందాం.

## కాశ్మీరులో కల్లోలం - భారతదేశంలో చేరికః

1947 జులైలో భారత స్వాతంత్ర్య చట్టంరూపొందేటప్పటికి షేక్ అబ్దుల్లా యింకా జైలులోనే వున్నాడు. 1946 'క్విట్ కాశ్మీర్' ఉద్యమం నడిపినందుకుగాను రాజద్రోహనేరం కింద 9 సంవత్సరాల ఖైదు శిక్ష షేక్ అబ్దుల్లా అనుభవిస్తూండినాడు. మరి భారతస్వాతంత్ర్య చట్టం తెచ్చిపెట్టే తప్పనిసరి పరిస్థితుల దృష్ట్యా, వైస్రాయి మౌంట్‌బాటెన్ సంస్థానాధీశులకు యిచ్చిన సూచనల దృష్ట్యా మహారాజా హరిసింగ్ తీసుకోవాల్సి వుండిన సరియైన నిర్ణయం ఏమిటి? అసలు 1947 జూన్‌లోనే మౌంట్‌బాటెన్ 4 రోజులపాటు శ్రీనగర్‌లో మకాము వేసి, ఆగష్టు 14 నాటికే ఇండియాలోనో, పాకిస్తాన్‌లోనో చేరవల్సిందిగా మహారాజుకు పదే పదే సలహాలు యిచ్చాడు. "ఆగష్టు14లోగా మీరు పాకిస్తాన్‌లో చేరేందుకు నిర్ణయం తీసుకొన్నట్లయితే దానికి తమ అభ్యంతరమేమీ వుండదని భారతప్రభుత్వం హామీ యిస్తున్నది. అలాగే ఒక వేళ మీరు భారతదేశంలో చేరాలని నిర్ణయించినట్లయితే అప్పటికింకా పాకిస్తాన్ ఉనికిలో వుండదు గనుక పాకిస్తాన్ తరపున అభ్యంతరం తలయెత్తే ఆస్కారమే ఉండదు" అని ఆయన మహారాజాకు స్పష్టంచేశాడు. కాని మహారాజా ఆ సలహాను పెడచెవిని పెట్టాడు. 1947 ఆగష్టు 15వ తేదీనాడు శ్రీనగర్ అంతటా పాకిస్తాన్ జెండాలే రెపరెపలాడాయి. మహారాజు హిందూ, సిక్కు సైన్యాలు ఆ జెండాలన్నింటినీ చించివేసి, ప్రజలపై తీవ్ర నిర్బంధం అమలు జరిపాయి. మహారాజా ఏ అధినివేశంలో చేరాలి అనే నిర్ణయం తీసుకోలేదు గాని యథాతథస్థితి కొనసాగింపు ఒప్పందాల (Standstill Agreements) కోసం భారత,పాకిస్తాన్‌లు రెంటినీ అభ్యర్థించాడు. పాకిస్తాన్ వెంటనే అలాంటి ఒడంబడిక చేసుకుని, కాశ్మీరులో తంతి తపాలా వ్యవస్థను ఆపరేట్ చేయసాగింది కూడ. కాని భారత ప్రభుత్వం మాత్రం మరేవో వివరణలు, చర్చలు కావాలంటూ ఒప్పందం విషయం వాయిదా వేసింది. ఈ జాప్యం దురుద్దేశ్యపూరితమని, మహారాజుతో రహస్యమంతనాలు సాగించి, రహస్య వత్తిళ్లు తెచ్చి, ఏకంగా భారత యూనియన్‌లో చేరిక ఒప్పందం చేసుకొనేట్లు చూడడానికే ఈ వరసంతా అని పాకిస్తాన్ తర్వాత దుమ్మెత్తి పోయడాన్ని మనం యిక్కడ గమనించాలి.

ఏ అధినివేశంలో చేరాలనే సమస్య కాశ్మీరు ప్రభుతను, ప్రజలను ఉభయుల్నీ వేధించసాగింది. కాని ప్రజలలో అత్యధికులు షేక్‌అబ్దుల్లా జాతీయ కాన్ఫరెన్సు ఏమన్నా, దానితో నిమిత్తం లేకుండానే, పాకిస్తాన్‌లో చేరికపైనే మొగ్గు చూపారనేది నిర్వివాదం. భౌగోళిక సామీప్యం, యితర తప్పనిసరుల దృష్ట్యా చూస్తే జమ్మూ-కాశ్మీరు పాకిస్తాన్‌లో చేరడమే సరైన పరిష్కారం. దీన్ని గుర్తించిన జమ్మూ-కాశ్మీరు రైతుకూలీ సదస్సు (కిసాన్ మజ్‌దూర్ పంచాయత్), కాశ్మీరు సోషలిస్టు పార్టీలు రెండూ పాకిస్తాన్‌లో విలీనాన్నే కోరాయి. 1947 సెప్టెంబరు 5 వ తేదీనాడు జమ్మూ-కాశ్మీరు కిసాన్ మజ్దూరు కాన్ఫరెన్సు చేసిన తీర్మానంలో యిలా పేర్కొన్నారుః "కాశ్మీర్ ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులు ముస్లింలు. ఈ రాజ్యం ఎక్కువగా పాకిస్తాన్ భూభాగాలను అనుకొనివున్నది. రాజ్యంలోని నదులన్నీ, వున్న మూడు పెద్ద రాజమార్గాలూ పాకిస్తాన్‌వైపే సాగుతున్నాయి. ఈ

కారణాలవల్ల పాకిస్తాన్‌లో చేరడమే సరైనది. మనం అవలంబించాల్సిన సహజమైన, సరియైన వైఖరి యిదే. ఈ రాజ్యం స్వతంత్రంగా మనజాలదు. అలాగే అత్యధిక జనాభా మహమ్మదీయులై వుండడంచేత, పాకిస్తాన్ భూభాగాలకు అనుకొని వుండడం చేత భారతదేశంలో చేరనూ లేదు. మన జనాభాలో అత్యధికులు పాకిస్తాన్‌లో చేరాలనే కోరుతున్నారని, ఇక్కడి 39 లక్షలమంది కార్మికులు, కర్షకుల శ్రేయస్సు యిందులోనే యిమిడి వుందని మేము భావిస్తున్నాం."

"ఇంత స్పష్టంగా ద్యోతకమయ్యే ప్రజాభిప్రాయం పట్ల మహారాజుగారికి ఏమైనా సంశయాలు వుంటే, ఆయన వెంటనే జనాభిప్రాయ సేకరణ ఎన్నికలు జరిపించాలి; భారతదేశంలో చేరాలా, లేక పాకిస్తాన్‌లోనా అనే అంశంపై ఓటుచేసే హక్కు ప్రతి వయోజనునికీ కల్పించాలి."

కాశ్మీరు సోషలిస్టు పార్టీకూడ యిదే విధంగా అభిప్రాయపడి, "మరే అనవసర జాప్యం లేకుండా పాకిస్తాన్‌లో చేరుతున్నట్లు ప్రకటించవలసిందిగా" మహారాజుకు విజ్ఞప్తి చేసింది.

కాని మహరాజు హరిసింగ్ అంతరంగం మాత్రం మరోవిధంగా వుండింది. పాకిస్తాన్‌లో చేరే ప్రసక్తే ఆయనకు నచ్చలేదు. వీలైతే పాకిస్తాన్, భారతదేశాలు రెంటితోనూ సత్సంబంధాలు వుంచుకుంటూనే సర్వస్వతంత్రంగా పరిపాలన సాగించాలనే అభిలాష ఆయనకు బలంగా వుండింది. పోతే జమ్మూ-కాశ్మీరు జాతీయ కాన్ఫరెన్సుకూడ ఈ విషయమై ఒక ఇదమిత్థమైన నిర్ణయం తీసుకొనలేదు. మొదటినుంచి కాశ్మీరులో ప్రజావుద్యమానికి స్ఫూర్తి నిచ్చింది భారత జాతీయ కాంగ్రెసు, దాని ప్రజాస్వామ్య, లౌకిక సాంప్రదాయాలే. కాంగ్రెసు ఆధ్వర్యంలోని అఖిలభారత స్వదేశీ సంస్థానాల ప్రజామండలుల సమాఖ్యతో వీరూ సన్నిహితసంబంధం కలిగివుండినారు. జిన్నా, ముస్లిం లీగ్‌ల మతతత్వ పోకడలు వీరికి, ప్రత్యేకించి షేక్‌అబ్దుల్లాకు, గిట్టేవి కావు. పైగా పఠానుల క్రూరపాలనా స్మృతులు శతాబ్దాలు గడిచినా యింకా చెరిగి పోలేదు. అన్నింటికీ మించి క్విట్ కాశ్మీరు వుద్యమం వల్ల షేక్ అబ్దుల్లా , తదితర కొందరు ప్రముఖులు జైళ్లలో మగ్గుతూండినారు. మహారాజును తొలగించి ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పాటుచేసి, కాశ్మీరీ జాతికి స్వయంనిర్ణయాధికారం సాధించుకోవాలి, వీలైతే స్వతంత్రంగానే వుండాలనేదే వారి ధ్యేయం. కనుక వారి వైఖరి కూడ కాశ్మీరులో అనిశ్చితత్వానికి బాగా తోడ్పడింది. ఇక ముస్లిం కాన్ఫరెన్సు అయితే మొదటినుండీ నిర్ద్వంద్వంగా పాకిస్తాన్ ఏర్పాటును, పాకిస్తాన్‌లో విలీనాన్ని కోరుతూ వచ్చిన విషయం మనకు తెలుసు. అయితే మనకేగాక, అపూర్వ ప్రజాదరణగల షేక్ అబ్దుల్లాకు కూడ అప్పట్లో తెలియనిదేమంటే జమ్మూ-కాశ్మీరు జాతీయ కాన్ఫరెన్సుకు ఎంత పలుకుబడి వున్నా, చేరిక విషయంలోమాత్రం మెజారిటీ ముస్లింలు పాకిస్తాన్ వైపుకే మొగ్గుచూపుతున్నా రనేదే.

ఈ నేపథ్యంలో, మొదట జమ్మూ పశ్చిమ ప్రాంతంలోని పూంఛ్‌లో ముస్లిం ప్రజల సాయుధ తిరుగుబాటు ప్రారంభమైంది. సుమారు 60వేల మంది పూంఛీలు భారతసైన్యంలో చేరి రెండవ ప్రపంచయుద్ధంలో సాహసోపేతంగా పోరాడారు. యుద్ధానంతరం వారు తమ ప్రాంతానికి తిరిగి వచ్చి, అంతవరకు తమకున్న కాస్త మెతకతత్వంగల రాజు చట్టపరమైన దావాలో ఓడిపోయాడని,

ఫలితంగా జమ్మూ-కాశ్మీర్ మహారాజుకు సంపూర్ణ అధికారాలు సంక్రమించాయని తెలుసుకున్నారు. పైగా మహారాజు పాలనలో లెక్కలేనన్ని పన్నులు చెల్లించాల్సిరావడం, పన్నుల వసూలుకు వచ్చిన డోగ్రా సైన్యాల అత్యాచారాలు వారికి దుర్భరం కాసాగాయి. ఇదిలావుండగా 1947 లో దేశవిభజన జరిగింది. పూంఛీలంతా పాకిస్తాన్‌లో చేరాలని ప్రదర్శనలు, సభలు జరిపారు. మహారాజా సైన్యాలు దారుణ నిర్బంధానికి తలపడ్డాయి. దానితో వారంతా సాయుధ తిరుగుబాటుకు పూనుకున్నారు. నానాటికీ తిరుగుబాటు వెల్లువ అధికమై జమ్మూ తూర్పుప్రాంతాలకు కూడ విస్తరించసాగింది. మరోవైపున భారతదేశంనుండి వేలసంఖ్యలో హిందూ, సిక్కు శరణార్థులు జమ్మూకు రావడం, వారిలో తీవ్రవాదులు ముస్లింలను తరిమివేసే, నరికివేసే చర్యలకు తలపడడం జరిగింది. అలానే వేలాది ముస్లిం శరణార్థులు కూడ కాశ్మీరులో తలదాచుకోవడానికి రావడం, మహారాజు పరిపాలనలో బాధలు, అవమానాల పాలుకావడం జరిగింది. కాశ్మీరులోయ పశ్చిమభాగంలో కూడ, సాయుధ తిరుగుబాటు ఒక మోతాదులో సాగింది. మొత్తం మీద 1947 ఆగష్టు - సెప్టెంబరు ప్రాంతానికే జమ్మూ-కాశ్మీర్ అంతా ఒకవైపు ప్రజల తిరుగుబాట్లతో, మరొకవైపు శరణార్థుల ప్రవాహాలు, వారి మధ్య కలహాలతో, అలాగే మహారాజు సైన్యాల దమన చర్యలతో ఉద్రిక్త వాతావరణం నెలకొనేవున్నది. దేశవిభజన సందర్భంగా చెలరేగిన మనోద్రేకాల కరాళనృత్యం ప్రభావంలో ముస్లిం పోరాట వాదులకు పాకిస్తాన్, హిందూ, సిక్కు ప్రజల కోర్కెలకు భారతదేశం మద్దతు, సానుభూతి చూపించడమూ సహజ పరిణామమే.

ఇలాంటి అస్తవ్యస్త పరిస్థితిలో, బహుశా పండిట్ నెహ్రూ సలహామేరకు, మహారాజా హరిసింగ్ 1949 సెప్టెంబరు 29వ తేదీనాడు షేక్ అబ్దుల్లాను విడుదల చేశాడు. విడుదలయి నప్పటినుండి షేక్ అబ్దుల్లా పాకిస్తాన్‌లో చేరికను స్పష్టంగా వ్యతిరేకిస్తూ, అయితే మొదటగా జమ్మూ-కాశ్మీరులో పూర్తి ప్రజాస్వామ్యం నెలకొని, ప్రజలకు స్వయంనిర్ణయాధికార హక్కులభ్యమైన పిదపే చేరిక విషయం ఆలోచించగలమని చెబుతూ రాసాగాడు. షేక్ అబ్దుల్లా వైఖరి సహజంగానే పాకిస్తాన్ అనుకూల ముస్లింలలో ఆగ్రహావేశాలను ద్విగుణీకృతం చేసింది. విచిత్రమేమంటే ప్రేమ్‌నాథ్ బజాజ్ వంటి హిందూ సహచరులు సైతం షేక్ అబ్దుల్లాతో చిరకాలం కిందటే తెగతెంపులు చేసుకుని వున్నారు. ప్రేమ్‌నాథ్ బజాజ్ నాయకత్వంలోని కాశ్మీరు సోషలిస్టుపార్టీ, కిసాన్ మజ్దూర్ పంచాయత్‌లు పాకిస్తాన్‌లో చేరికను సమర్థించివుండడం మనమివరకే గమనించాము. బజాజ్ అభిప్రాయంలో కాశ్మీరీ ముస్లింలు పాకిస్తాన్‌కు అనుకూలంగానూ, షేక్ అబ్దుల్లాకు దూరంగా అయిపోతున్నారని, అదే సమయంలో హిందువులు, సిక్కులు షేక్‌ను విశ్వసించజాలరని, కనుక అబ్దుల్లా కున్న జనాదరణ తాత్కాలికమని. ఒక దశలో కాశ్మీరీ హిట్లర్ అని కూడ ఆయన షేక్ అబ్దుల్లాను తూలనాడాడు.

ఈ పరిస్థితుల్లో, బహుశా ఎవరూ ఊహించని రీతిలో, 1947 అక్టోబరు 22వ తేదీనాడు కాశ్మీరు లోయ పశ్చిమ భాగంనుండి పాకిస్తాన్ వాయవ్యసరిహద్దు ప్రాంతంలో నివసించే అఫ్రీద్,

మహ్సూద్ కొండతెగలకు చెందిన వేలాది సాయుధ దుండగులు 'ధర్మ యుద్ధం' (జిహాద్) అని నినాదాలు చేస్తూ కాశ్మీర్ లోయలోకి పెద్దఎత్తున చొచ్చుకువచ్చారు. వీరికి పాకిస్తాన్ సైన్యాలు, ప్రభుత్వం అత్యధునాతన ఆయుధాలు, రవాణాసౌకర్యాలు సరఫరా చేసి తాము వెనుకనుండి మార్గదర్శకత్వం,నాయకత్వం వహిస్తూ వీరిని ముందుకు నెట్టాయని భారత ప్రభుత్వం, జమ్మూ-కాశ్మీర్ ప్రభుత్వం నిందించాయి. కాని, కొండతెగల దాడులతో తమకే ప్రమేయం లేదని, ప్రజల తిరుగుబాటును నిర్దాక్షిణ్యంగా అణచివేసే మహారాజు దమనచర్యలకు నిరసనగా తమ మతస్తుల రక్షణకని వారంతట వారే తరలివచ్చారని, వారిపై తమకెట్టి అదుపాజ్ఞలు లేవని పాకిస్తాన్ పాలకులు వాదించసాగారు. అయితే ఈ కొండతెగల ముఠాలన్నింటికీ జనరల్ తారిఖ్ అనే మారుపేరుతో పాకిస్తాన్‌కు చెందిన ఒక జనరల్ అక్బర్ ఖాన్ నాయకత్వం వహించాడని అంటారు. ఇతడు అనంతర కాలంలో పాకిస్తాన్ సర్వసైన్యాధ్యక్షుడవడమేగాక, ఒక సైనిక తిరుగుబాటు తీసుకురావడానికి ప్రయత్నించినందుకుగాను ఖైదు చేయబడ్డాడుకూడ. అలాగే సుభాష్ బోస్ నాయకత్వంలోని ఆజాద్ హింద్ ఫౌజ్‌లో పోరాడివున్న యిరువురు ఉన్నతాధికారులు కూడ ఈ ఆక్రమణదారులకు నాయకత్వం వహించారు. పాకిస్తాన్ గుంభనంగా ఈ గిరిజన ముఠాలకు ఆయుధ సహాయం, నైతిక మద్దతు, భౌతిక ప్రోత్సాహాలు యిచ్చిన మాట నిస్సందేహమేగాని, రెగ్యులర్ సైనిక దళాలను మాత్రం రంగంలోకి దింపలేదు. అలాగే, పాకిస్తాన్ కేంద్రప్రభుత్వంకంటె ఎక్కువగా, వాయవ్య సరిహద్దు ప్రాంత ప్రభుత్వ లాలూచీ, పాకిస్తాన్ సైన్యంలోని కొందరు ఉన్నతాధికారుల మద్దతులే ఎక్కువగా వున్నట్లు కనిపిస్తుంది. సరే, ఏమైనా, ఈ సాయుధ గిరిజన ముఠాలు దారిపొడుగునా వందలాది గ్రామాలను, అనేక పట్టణాలను కొల్లగొడుతూ, విస్తృతంగా దహనకాండ, హత్యలు, మానభంగాలు, ఆడవారిని ఎత్తుకుపోవడాలు మొదలైన దుశ్చర్యలుజరుపుతూ శ్రీనగర్‌పైకి దండెత్తి రాసాగారు. ముజఫరాబాద్, ఊరీలను మొదటి రోజే ఆక్రమించిన వీరు జమ్మూలోనికి రాగానే ఆజాద్ కాశ్మీర్ తిరుగుబాటుదారులు, పాకిస్తాన్‌నుండి వచ్చిన వాలంటీర్లు వీరితో పొత్తు కలిసారు. అటు నుండి త్వరత్వరగా మీర్‌పూర్, పూంఛ్, కోట్లీ, జాంగెర్, నౌషెరా, భింభార్‌లను ఆక్రమించుకుంటూ నాలగవరోజున అంటే అక్టోబరు 26వతేదీనాడు బారాముల్లాను పట్టుకొన్నారు. అక్కడ వారు జరిపిన మారణహోమంలో ఎంత లేదన్నా పదివేలమంది (మొత్తం జనాభా 14 వేలే) ఆహుతి అయివుంటారని అంచనా. శ్రీనగర్‌కు కేవలం 45 మైళ్లు ఆగ్నేయంగా వున్న ఈ పట్టణంనుండి ఓపిగ్గా లూటీలు చేసుకుని ఒక రోజు ఆలస్యంగా శ్రీనగర్‌కు దండెత్తివచ్చారు. దారిలో మాహూరా పవర్‌హౌస్‌ను దగ్ధంచేసి శ్రీనగర్‌కు విద్యుత్ సరఫరాకు అంతరాయం కల్పించారు. అనేక రోజులపాటు ఆ నగరమంతా గాఢాంధకారంలో మునిగిపోయింది. మహారాజుకున్న కొద్దిపాటి డోగ్రాసైన్యాలు బాగా తరిఫీదు పొందివున్న ఈ విధ్వంసకులను, చొరబాటుదారులను నిలవరించలేక పోయాయి. ఈ మహాసంక్షోభస్థితిలో భారతదేశ సైనిక సహాయం అర్థించడం తప్ప మహారాజాకు గత్యంతరం లేకపోయింది. కాని సాంకేతికంగా భారతదేశంలో విలీనమైతే తప్ప కాశ్మీరుకు సైనిక సహాయం చేయడానికి భారత ప్రభుత్వం సంసిద్ధత చూపించలేదు. అందుకని 1947 అక్టోబరు 26వ తేదీనాడు

మహారాజా హరిసింగ్ తన రాజ్యాన్ని భారతదేశంలో కలుపుతూ ఒక చేరిక ఒప్పందం (Instrument of Accession) పై సంతకం చేసాడు. కాని అందులో ఏ కారణాలవల్లనైతే భారతదేశంలో చేరుతున్నదీ, తదనుగుణంగా ఏ అధికారాలు భారతదేశానికి సంక్రమించేదీ అన్యాపదేశంగా సూచిస్తూ అవితప్ప తక్కిన వేటిలోనూ రాజ్యంపై తన సార్వభౌమాధికారం కుంటుపడదని ఖచ్చితంగా పేర్కొన్నాడు కూడ. దాన్ని అప్పటి గవర్నరు జనరల్ మౌంట్‌బాటెన్ ఆఫ్ బర్మా, వెంటనే ఆమోదిస్తూ, "ఏరాజ్యంలోనైనా చేరిక సమస్య వివాదాస్పదమైనప్పుడు ఆ రాజ్య ప్రజల అభీష్టానికి అనుగుణంగా ఆ చేరిక సమస్యను పరిష్కరించాల్సి వుంటుందనే మా విధానానికి అనుగుణంగా, కాశ్మీరులో శాంతి భద్రతలు నెలకొని, దురాక్రమణదారులను పారద్రోలిన వెంటనే చేరిక సమస్యపై ప్రజల అభిమతాన్ని తెలుసుకొని తదనుగుణంగా దాన్ని పరిష్కరించ వల్సివుంటుంది." అని కూడ స్పష్టం చేశాడు. షేక్ అబ్దుల్లా నాయకత్వంలోని జాతీయ కాన్ఫరెన్సు, వివిధ హిందూ, సిక్కు సంఘటనలు కూడ చేరిక పట్ల హర్షం ప్రకటించాయి. ఇక్కడ ఒక విషయం గమనించ వల్సివుంది. షేక్ అబ్దుల్లాకు పాకిస్తాన్‌లో చేరిక ఎన్నడూ యిష్టంలేదు. అయితే భారతదేశంలో చేరికను కూడ అతడు మనసారా సమర్థించలేదు. "చేరిక పూర్వం స్వాతంత్ర్యం" అన్నది ఆయన నినాదం. కాని కొండతెగల దాడుల వల్ల తలయెత్తిన అపూర్వ సంక్షోభ పరిస్థితిలో, అలాంటి దుస్థితిలో మాత్రమే గత్యంతరం లేక మొదట చేరికను ఆమెదించాడు. కాని ఈ చేరికను కాశ్మీరు ప్రజలు స్వయం నిర్ణయాధికార ఎన్నికల ద్వారా భవిష్యత్తులో ఆమోదిస్తేనే అది శాశ్వతం కాగలదనే భావన ఆయన హృదయంలో చివరిదాకా బలంగా వుండిపోయింది. ఇక భారతదేశ కేంద్రమంత్రివర్గంలో సైతం ఒక్క నెహ్రూతప్ప మరెవరూ కాశ్మీరు చేరికను మొదట హర్షించలేదు. జమ్మూ-కాశ్మీర్ ప్రజల మనోభీష్టం స్పష్టంకానిదే చేరికను ఆమోదించడం తగదనే పటేల్, తదితరులు గట్టిగా వాదించారు. అయితే షేక్ అబ్దుల్లా పట్ల, ఆయనకుగల అపూర్వప్రజాదరణ పట్ల అచంచల గౌరవ విశ్వాసాలుగల ప్రధాని నెహ్రూ పట్టుబట్టి షేక్ అబ్దుల్లా ఆమోదం అంటే కాశ్మీరు ప్రజల ఆమోదమేనన్న ఆభాస కల్పించి ఆ కాశ్మీరు చేరికను వెంటనే ఆమోదించేట్లు చేసాడు.

సరే, గడ్డుపరిస్థితుల్లో షేక్ అబ్దుల్లా నాయకత్వంలోని జాతీయ కాన్ఫరెన్సు శ్రీనగర్ రక్షణకు అద్భుతమైన ధైర్యసాహసాలతో ఉపక్రమించింది. ఇంతలో భారత ప్రభుత్వం మొదటి సిక్కు బెటాలియన్‌ను హుటాహుటిన విమానాలద్వారా తరలించింది. ఆ బెటాలియన్ శ్రీనగర్ విమానాశ్రయంలో దిగే సమయానికి ఆఫ్రీద్ తదితర కొండతెగల దురాక్రమణదారులు విమానాశ్రయానికి కేవలం $2\frac{1}{2}$ మైళ్లదూరంలోనే వున్నారు. వాళ్లు కనీసం 2,3 గంటల పూర్వమైనా విమానాశ్రయాన్ని ఆక్రమించుకుని వుంటే శ్రీనగర్ పతనం తప్పనిసరి అయ్యేదే. అంతటి గడ్డుస్థితిలో నాటకీయంగా ప్రవేశంచేసిన భారత సైన్యాలు వీరోచితంగా పోరాడి దురాక్రమణదారుల్ని తిప్పికొట్టసాగాయి. జాతీయ కాన్ఫరెన్సు ఏర్పాటు చేసిన జాతీయ రక్షణదళం, హిందూ, సిక్కు వలంటీర్లు కూడ భారత సైన్యాలకు అమోఘమైన సహాయ సహకారా లందించారు. ఈ క్రమంపై మహాత్మాగాంధీ యిలా వ్యాఖ్యానించారు: "కాశ్మీరును పాలించే మహారాజు నిస్సహాయ స్థితిలో పడిపోయి, భారత

యూనియన్‌లో చేరగోరినప్పుడు భారత గవర్నరు జనరలు ఆ కోర్కెను ఎలా కాదనగలడు? అయితే ఆ చేరిక తాత్కాలికమైనదని, మతంతో నిమిత్తం లేకుండా కాశ్మీర్ ప్రజలంతా తమ అభిమతాన్ని తెలిపే నిష్పాక్షికమైన ప్లెబిసైటు ద్వారా ఆ చేరిక భవిష్యత్తును తుదిగా తేలుస్తారని స్పష్టం చేసిన పిదపే, విమానాలద్వారా శ్రీనగర్‌కు సైన్యాలను తరలించారు. కాశ్మీరు మహారాజాకూడ వివేకంతో షేక్ అబ్దుల్లాను ప్రధాన మంత్రిగా నియమించాడు. షేక్ అబ్దుల్లా కూడ సంక్షోభానికి తగిన విధంగా ప్రతిస్పందించి, ఆ ఆహ్వానాన్నిఆమోదించాడని పత్రికల్లో చదివి నాకెంతో సంతోషం కలుగుతున్నది.''

షేక్ అబ్దుల్లాను మొదట ఒక నూతన అత్యవసర పరిపాలనకు అధిపతిగా నియమించారని యిక్కడ తెలియాలి. బక్షీ గులాం అహమ్మద్ ఉప అధిపతిగా, మీర్జా మహమ్మద్ అఫ్‌జల్ బేగ్, జి. ఎమ్. సాదిక్, షామ్ లాల్ సరాఫ్, సర్దార్ బుధ్ సింగ్, డి.పి. ధార్, సర్దార్ బల్‌దేవ్ సింగ్, మౌలానా మహమ్మద్ సయ్యద్ ప్రభృతులు వివిధ రంగాల్లో ఎమర్జెన్సీ ఆఫీసర్లుగా నియుక్తులైన ఈ నూతన అత్యవసర పరిపాలన 1947 అక్టోబరు 30వ తేదీనాడు ప్రారంభమైంది. ఆనక 1948 మార్చి 5వ తేదీనాడు షేక్ అబ్దుల్లా ప్రధానమంత్రిగా ఒక మంత్రివర్గాన్ని మహారాజా హరిసింగ్ ఏర్పాటు చేసాడు.

భారత సైన్యాల ఆగమనం, షేక్ అబ్దుల్లా నాయకత్వానగల అత్యవసర పాలన జరిపిన చురుకైన ఏర్పాట్లతో కొండ తెగల దుండగీళ్ల ఆటకట్టినట్లయింది. శ్రీనగర్ సురక్షితమయింది. కాశ్మీరులోయలో సుమారు మూడింట రెండువంతుల భాగంనుండి దుండగులను పారద్రోలివేయగలిగారు. కాని పరిస్థితులు యింకా ఆందోళనాకరంగానే వుండినాయి. పాకిస్తాన్ నుండి ఆజాద్ కాశ్మీర్ బలాలకు దన్నుగా వాలంటీర్ల ప్రవాహం ఆగలేదు. శీతాకాలం బాగా ముంచుకురావడంతో సైనిక కార్యకలాపాలు దాదాపు స్తంభించి పోయాయి.

అటు పాకిస్తాన్‌లోకూడ కాశ్మీరు పరిణామాలు పెద్దఎత్తున ఆవేశకావేషాలు రేకెత్తించాయి. అక్టోబరు 27వ తేదీ ఉదయం భారతసైన్యాలు శ్రీనగర్ చేరుకుంటే అదే రోజు అర్ధరాత్రి పాకిస్తాన్ గవర్నరు జనరల్ మహమ్మద్ ఆలీ జిన్నా, తన కార్యనిర్వాహక కమాండర్-ఇన్-చీఫ్ జనరల్ సర్‌డగ్లస్ డి. గ్రేసీని పిలిచి కాశ్మీరుకు తక్షణమే సైన్యాలు పంపించవల్సిందిగా ఆదేశించాడు. వివేకవంతుడైన ఆ జనరల్ భారతసైన్య విభజనను సూపర్‌వైజ్ చేస్తూండిన సుప్రీం కమాండర్ మార్షల్ సర్‌క్లాడ్ ఆచిన్‌లెక్‌ను పిలిపించాడు. ఆచిన్‌లెక్ వెంటనే లాహోరుకు విమానంలో వచ్చి, జిన్నాను ఒప్పించి, పాకిస్తాన్ సైన్యాలను కాశ్మీరులోనికి పంపాలనే ఉత్తరువును ఉపసంహరిచుకునేట్లు చేశాడు. ఆచిన్‌లెక్ సలహాపై జిన్నా వెంటనే మౌంట్‌బాటెన్, నెహ్రూలను లాహోరుకు ఆహ్వానించాడు. పరస్పర చర్చల ద్వారా కాశ్మీరు సమస్యను పరిష్కరిద్దామని పిలుపిచ్చాడు. అయితే జమ్మూ-కాశ్మీరు భారతదేశంలో చేరడం "దగా, దౌర్జన్యాల"పై ఆధారపడి జరిగిందని, కనుక ఈ చేరికను తాము సుతరామూ ఆమోదించబోమని పాకిస్తాన్ ప్రభుత్వం తక్షణమే స్పష్టంచేసింది.

## ఐ.రా.స. లో కాశ్మీరు సమస్య :

జవహర్‌లాల్ నెహ్రూ 'అస్వస్థత' కారణంగా లాహోరుకు వెళ్లలేదు. 1947 నవంబరు 1వ తేదీనాడు జిన్నా, మౌంట్‌బాటెన్‌లుమాత్రం లాహోర్‌లో సమావేశమైనారు. జమ్మూ-కాశ్మీరు నుండి పరాయి సైన్యాలను, సాయుధ ముఠాలన్నిటినీ ఉపసంహరించుకొనేట్లు చేసి, తమ ఉభయ గవర్నరు జనరల్‌ల సంయుక్త పర్యవేక్షణలో చేరిక సమస్యపై అక్కడ ప్లెబిసైటు జరిపించాలని జిన్నా ప్రతిపాదిస్తే, ఆ విషయంలో తనకు ప్రభుత్వం నుండి తనకు సర్వాధికారం లేదని, కాని ఐక్య రాజ్య సమితి ఆధ్వర్యంలో ప్లెబిసైటు జరిపించాలనేది తమ ప్రతిపాదన అని మౌంట్‌బాటెన్ జవాబిచ్చాడు. ఐ.రా.స. జోక్యానికి జిన్నా యిచ్చగించలేదు. సమావేశం అప్పటికి విఫలమైంది. అయితే నవంబరు 16 వ తేదీనాడు పాకిస్తాన్ ప్రధానమంత్రి లియాఖత్ ఆలీ ఖాన్, ఆశ్చర్యకరంగా, సమస్యను ఐ.రా.స. కు నివేదించాలనే నెహ్రూ ప్రతిపాదనను అంగీకరిస్తూ, పరాయిసైన్యాలన్నీ ఉపసంహరించబడేట్లు,నిష్పాక్షికంగా ప్లెబిసైటు జరిపేట్లు ఉభయదేశాలు ఐ.రా. స. కు నివేదించుకోవాలని విజ్ఞప్తి చేశాడు. దీనికి నెహ్రూయిచ్చిన జవాబు వింతగావుంది. ఐ.రా.స. కు సైనికదళాలు లేవుగాబట్టి అదెలా పోరాటాన్ని అదుపు చేస్తుందో తాను అర్థంచేసుకోలేక పోతున్నానని తమ (భారత) సైనికదళాలు యిప్పటికే ఆ పని చేస్తున్నాయిగనుక వాటి పని ఆసాంతం పూర్తిచేయనివ్వాలని, షేక్ అబ్దుల్లా పాలన ప్రజామోదంపై ఆధారపడివున్నట్లు తమకు పూర్తి నమ్మకం వుందని, కనుక గిరిజన ఆక్రమణదారులను ఉపసంహరించుకొనేట్లు చేయగల్గితే అనంతరం ఐ.రా.స. లేక మరేదైనా అంతర్జాతీయ సంస్థల ఆధ్వర్యంలో కాశ్మీరు ప్రజల చేరిక సమస్యను ప్లెబిసైటు ద్వారా పరిష్కరించుకోవచ్చునీ 1947 నవంబరు 21 వ తేదీనాడు నెహ్రూ లియాఖత్ ఆలీ ఖాన్‌కు లేఖ రాసాడు. అంటే నెహ్రూకైనా పిచ్చిపట్టివుండాలి లేక ఎదుటివాళ్లు మతిలేనివాళ్లనుకొని వుండాలి, లేక ఎలాగూ దీనికి ఒప్పుకోడు కనుక అలాగే రాద్దామనే మడతపేచీ మనస్తత్వం అయివుండాలి. అంతకుమించి దీన్ని నేను మరోలా అర్థంచేసుకోలేక పోతున్నాను. సహజంగానే లియాఖత్ ఆలీ ఖాన్ లేక జిన్నాలు మాత్రం దీనికి అంగీకరిస్తారా? పైగా సమస్యలో ప్రత్యక్ష జోక్యం కల్పించుకోవడానికి ఐ.రా.స.నుఅభ్యర్థించాలని పాకిస్తాన్ భావన అయితే కేవలం ప్లెబిసైటు జరిపే వ్యవహారంలో సలహాగురించి మాత్రమే ఐ.రా.స.కు వెళ్లాలని భారత ప్రభుత్వ భావన. కనుక యిక్కడా భారత, పాకిస్తాన్‌ల మధ్య పరస్పరాంగీకారం కుదరలేదు.

చివరకు భారతదేశమే ఏకపక్షంగా ఐ.రా.స. గడప తొక్కింది. కాశ్మీరు ఘర్షణలో జోక్యం కల్పించుకోవాల్సిందిగా భారతప్రభుత్వం ఐ.రా.స. భద్రతా మండలిని 1948 జనవరి 1వ తేదీనాడు అభ్యర్థించింది. ఐక్య రాజ్య సమితి ప్రణాళిక లోని 34, 35 అధికరణాల ప్రకారం, 'అంతర్జాతీయ శాంతి భద్రతలకు ముప్పుగా పరిణమించగల ఏ పరిస్థితినైనా భద్రతా మండలి దృష్టికి తీసుకురావచ్చు' అని వున్నది. "ఇప్పుడు భారతదేశం, పాకిస్తాన్‌ల నడుమ అలాంటి పరిస్థితి నెలకొనివున్నది. భారత అధినివేశంలో చేరి, యిప్పుడు భారతదేశంలో భాగంగావున్న జమ్మూ-కాశ్మీర్ రాజ్యంలో సైనిక చర్యలు, విధ్వంస కాండలు జరిపేందుకని పాకిస్తాన్ జాతీయులు, కొండతెగల ముఠాలతో

కూడుకున్న దురాక్రమణ దారులకు పాకిస్తాన్‌నుండి సహాయం లభించడం యిలాంటి పరిస్థితికి కారణం. కనుక భారతదేశానికి వ్యతిరేకంగా దురాక్రమణచర్యగా లెక్కకువచ్చే యిలాంటి సహాయ చర్యలకు వెంటనే స్వస్తి చెప్పవల్సిందిగా పాకిస్తాన్‌ను భద్రతామండలి కోరాలి. పాకిస్తాన్ ఈ విధంగా చేయనట్లయితే, భారత ప్రభుత్వం తప్పనిసరి అయి ఆత్మరక్షణ కోసమని పాకిస్తాన్ భూభాగంలో ప్రవేశించి, దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా సైనిక చర్య తీసుకోవల్సి వస్తుంది. అందువల్ల ఈ సమస్య అతి తక్షణ ప్రాముఖ్యం గలది, దీనిపై అత్యవసర చర్యలు తీసుకొనాలి" అని భారత ప్రభుత్వం వారు భద్రతా మండలికి రాసిన లేఖలో పేర్కొన్నారు. భారతదేశం అంతవరకు తీసుకున్న చర్యలు పూర్తిగా న్యాయసమ్మతమైనవేనని, పాకిస్తాన్ దురాక్రమణదారు అని, అలా పేర్కొని, దాన్ని నిరసించాలని ఈ లేఖ సారాంశం. "ఒకసారి రాజ్యం నేలనుండి దురాక్రమణదారుల్ని పారద్రోలిన తర్వాత, సాధారణ పరిస్థితులు పునరుద్ధరింప బడిన పిదప, అక్కడి ప్రజలు ప్లెబిసైటు లేక జనాభిప్రాయసేకరణ ఎన్నికల (రిఫరెండమ్) ద్వారా తమ భవిష్యత్తును ప్రజాస్వామికంగా నిర్ణయించుకునే స్వేచ్ఛ కలిగివుంటారు. సంపూర్ణ నిష్పాక్షికతను సునిశ్చయం గావించడానికి గాను ఈ ప్లెబిసైటు లేక రిఫరెండంను అంతర్జాతీయ (సంస్థల) అధ్వర్యంలో జరపవచ్చు," అనికూడ ఆ లేఖలో పేర్కొన్నారు.

భద్రతా మండలి 1948 జనవరి 15వ తేదీనాడు సమావేశమైంది. కాశ్మీర్ మహారాజు పాలనలో జమ్మూ - కాశ్మీరు ప్రధానిగా పనిచేసివుండిన శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ భారతదేశ ప్రతినిధిగా వున్నారు. ఆయనకు శ్రీ యమ్.సి. సెతల్వాడ్, షేక్ అబ్దుల్లాలు సహాయకులుగా వున్నారు. కాశ్మీరు ఘర్షణ అంతర్జాతీయ శాంతి, భద్రతలకు ముప్పుగా పరిణమించగలదని, దాన్ని తక్షణమే పరిష్కరించవల్సివున్నదని ఆయన (అయ్యంగార్) విజ్ఞప్తి చేశాడు. జమ్మూ-కాశ్మీరు రాజ్యం చేరిక సమస్య అక్కడి ప్రజల అభిమతానికి అనుగుణంగా పరిష్కరించబడాలి అనే హామీని మౌంట్‌బాటెన్ యిదివరకే యిచ్చివున్నారని, అది 'ఉన్నత ప్రమాణాల రాజనీతిజ్ఞత' అని అయ్యంగార్ ప్రశంసించాడు. కాశ్మీరు సమస్య ఏదో "భూభాగానికి సంబంధించిన వివాదం కాదు" [అంటే కాశ్మీరు నిర్వివాదంగా భారతదేశంలో అంతర్భాగమని అన్నట్లు], పాకిస్తాన్ సాయంతో దురాక్రమణ, అత్యాచారాలు జరుపుతున్న, అఫ్రీదీ, యితర కొండతెగలు, సాయుధ ముఠాల ఉపసంహారణకు సంబంధించినదని ఆయన నొక్కిచెప్పారు. అయితే కాశ్మీర్ భావిహోదాను గురించి మాట్లాడుతూ, "భారతదేశానికి చేరికను కాశ్మీర్ ఉపసంహరించుకోవాలా, అలా చేసిన తర్వాత పాకిస్తాన్‌లో చేరాలా లేక స్వతంత్రంగానే వుండి, ఐక్య రాజ్య సమితిలో సభ్యదేశంగా చేరే హక్కు సాధించుకోవాలా - ఇవన్నీ సాధారణ జీవనం పునరుద్ధరింపబడిన తర్వాత స్వయంగా కాశ్మీర్ ప్రజలే, ఎలాంటి బంధనాలు లేకుండా, స్వేచ్ఛగా నిర్ణయించుకోవల్సిన విషయాలని మేము గుర్తిస్తున్నాము" అని కూడ గోపాలస్వామి అయ్యంగార్ స్పష్టం చేశాడు. దీనికి ప్రతిగా, అసలు భారత ప్రభుత్వమే పాకిస్తాన్‌ను నిర్మూలించాలనే కుతంత్రంతో దురాక్రమణకు తలపడుతున్నదని, కాశ్మీరును కబళించాలని సైనిక చర్యకు పూనుకున్నదని, అక్కడ మారణహోమం జరుపుతున్నదని, కాశ్మీరు పాకిస్తాన్‌తో

యథాతథస్థితి కొనసాగింపు ఒప్పందం (Standstill Agreement) చేసుకొనికూడ కనీసం ముందు సమాచారమైనా కూడ లేకుండా భారతదేశంలో చేరిక ప్రకటించడం పూర్తిగా న్యాయవిరుద్ధమని, ఇది దగా, దౌర్జన్యాలపై ఆధారపడినదని, దీన్ని తాము గుర్తించజాలమని, కనుక తక్షణమే భారత సైన్యాలు, అలాగే కొండతెగలు, సాయుధ ముఠాలు కాశ్మీరులోయనుండి ఉపసంహరించుకొనేట్లు చేసి, అక్కడ ఐ.రా.స. ఆధ్వర్యంలో ప్లెబిసైటు జరిపించాలని పాకిస్తాన్ ప్రతినిధి సర్ జాఫరుల్లా ఖాన్ విజ్ఞప్తిచేశారు. భద్రతామండలి ఈ సంక్షోభంపై తీవ్రచర్చలు జరిపి చివరకు జనవరి 17న తేదీనాడు, భారత, పాకిస్తాన్ ఉభయ ప్రభుత్వాలకు శాయశక్తుల పరిస్థితిని మెరుగుపర్చడానికి ప్రయత్నించ వలసిందిగా విజ్ఞప్తి చేసింది. భద్రతామండలి అధ్యక్షుని సాయంతో భారత, పాకిస్తాన్ ప్రతినిధులిద్దరినీ ఒక దగ్గర కలిపి, "పరిష్కారానికి సంబంధించిన నిర్మాణాన్ని సాధ్యంచేసే సామాన్య భూమికను కనుగొనడానికి ప్రయత్నించాలని" నిశ్చయించింది. ఫలితంగా, భారత, పాకిస్తాన్ ప్రతినిధులు జరిపిన సంప్రదింపుల మూలంగా 1948 జనవరి 20 నాటి భద్రతా మండలి తీర్మానం తయారయింది. ఉభయ ప్రభుత్వాలు చేసిన ఫిర్యాదులకు సంబంధించిన వాస్తవాలను గురించి వాకబు చేయడానికిగాను ఘర్షణ స్థలానికి సాధ్యమైనంత త్వరలో వెళ్లి, మధ్యవర్తిత్వం వహించి, ఆవేశకావేషాలు చల్లబర్చేందుకుగాను ఒక త్రిసభ్య సంఘాన్ని నియమించారు. దీనినే తర్వాత ఐదుమంది సభ్యుల సంఘంగా చేసి, భారత, పాకిస్తాన్‌లకు (గాను) ఐ.రా.స. (ఏర్పాటు చేసిన) సంఘం (యునైటెడ్ నేషన్స్ కమిషన్ ఫర్ ఇండియా అండ్ పాకిస్తాన్ - **U.N.C.I.P.** ) గా నామకరణం చేశారు. అయితే ఈ కమిషన్ నియామకానికి సంబంధించి తప్పితే, అందులో భారతసైన్యం లేక కొండతెగల ముఠాల ఉపసంహరణ గురించి గాని లేక ప్లెబిసైటును గురించి గాని ఏమాత్రం పేర్కొనలేదు. భారత, పాకిస్తాన్‌లు ఉభయ పక్షాలూ ఈ తీర్మానానికి ఒప్పుకున్నాయి. సోవియెట్ యూనియన్, ఉక్రెయిన్ గైర్‌హాజరుకాగా 9-0 ఓట్లతో భద్రతామండలి దీన్ని ఆమోదించింది.

అయితే ఆ కమిషన్ భారత, పాకిస్తాన్‌లకు వచ్చి దర్యాప్తు జరిపేంతలోగా భారతసైన్యాలు మళ్లీ తమ వసంతకాలపు ఎదురుదాడి (Spring Offersive) ప్రారంభించి ఆజాద్ కాశ్మీర్ పోరాట కారులను, కొండతెగల సాయుధ ముఠాలను పాకిస్తాన్ సరిహద్దులవైపుకు నెట్టివేయడం ప్రారంభించాయి. ఒక విధంగా ఇది భద్రతా మండలి తీర్మానాల అంతర్భావనకు విరుద్ధమే . దానితో పాకిస్తాన్ తానేమీ తక్కువ తినలేదని మూడు బ్రిగేడ్ల రెగ్యులర్ సైన్యాన్ని కాశ్మీరు భూభాగంలోకి దించింది. దానితో భారత, పాకిస్తాన్‌ల నడుమ ఒక అప్రకటిత యుద్ధం మొదలైంది. అయితే **U.N.C.I.P.** జరిపిన మహత్తర కృషి ఫలితంగా భారత , పాకిస్తాన్ ప్రభుత్వాలు యుద్ధవిరమణకు అంగీకరించాయి. 1948, ఏప్రిల్ 21 వ తేదీనాటి భద్రతా మండలి తీర్మానం యుద్ధ విరమణను ఆదేశించింది. అదే సమయంలో భారత, పాకిస్తాన్ ఉభయ ప్రభుత్వాలూ జమ్మూ-కాశ్మీర్ రాజ్యం భారతదేశంలో చేరాలా లేక పాకిస్తాన్‌లో చేరాలా అనే సమస్యను స్వేచ్ఛాయుత, నిష్పాక్షిక ప్లెబిసైటు ద్వారా ప్రజాస్వామిక పద్ధతిలో పరిష్కరించుకోవడానికి అంగీకరించినట్లు సహర్షంగా ప్రకటించింది. 1948 ఆగష్టు 13 నాటి **U.N.C.I.P.** తీర్మానం ఈ యుద్ధ విరమణ అమలు చేయడానికి సంబంధించిన వివరాలను

పేర్కొంటూ, భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలు రెండూ యుద్ధ విరమణ ఒప్పందం దరిమిలా జమ్మూ-కాశ్మీర్ ప్రజల సంకల్పానికి అనుగుణంగా ఆ రాజ్యపు భావి హోదాను నిర్ణయించడానికి ఒప్పుకున్నాయని సంతృప్తిని వ్యక్తం చేసింది. అలాగే 1949 జనవరి 5వ తేదీనాటి **U.N.C.I.P.** తీర్మానం కూడ జమ్మూ-కాశ్మీరు రాజ్యం భారత దేశంలో చేరాలా లేక పాకిస్తాన్‌లో అనే సమస్యని స్వేచ్ఛాయుత, నిష్పాక్షిక ప్లెబిసైటు ద్వారా నిర్ణయించడానికి భారత,పాకిస్తాన్‌ల ప్రభుత్వాలు రెండూ అంగీకరించినట్లు పేర్కొన్నది. అదే విధంగా ఆ తర్వాతి 1950 మార్చి 14వ తేదీనాటి, అలాగే 1951 మార్చి 30 వ తేదీనాటి భద్రతామండలి తీర్మానాలు కూడ భారత, పాకిస్తాన్ ఉభయ ప్రభుత్వాలు స్వేచ్ఛాయుత, నిష్పాక్షిక ప్లెబిసైటుకు అంగీకరించినట్లు పునరుద్ఘాటించాయి. పైగా 1951 మార్చి 30వ తేదీనాటి తీర్మానమైతే, అఖిల జమ్మూ-కాశ్మీరు జాతీయ కాన్ఫరెన్సు తన అధీనంలోని జమ్మూ-కాశ్మీరు భూభాగంలో రాజ్యంగ సభ ఏర్పాటుకు, రాజ్యాంగం నిర్మాణానికి చేసే ప్రయత్నాలను ప్రస్తావిస్తూ, పై జాతీయ కాన్ఫరెన్సు లేక అది ఏర్పాటుచేసే రాజ్యాంగ సభ తీసుకునే ఏ చర్య అయినా స్వేచ్ఛాయుత, నిష్పాక్షిక ప్లెబిసైటు కిందకు రావని, కనుక వాటిని ఐ.రా. స. గుర్తించబోదనికూడ స్పష్టంచేసింది. 1950 మార్చి 14నాటి భద్రతామండలి తీర్మానంలో భారత, పాకిస్తాన్ ఉభయ ప్రభుత్వాలు ఫ్లీట్అడ్మిరల్ చెస్టర్ నిమిట్జ్ ప్లెబిసైట్ నిర్వాహకునిగా నియమించబడడానికి అంగీకరించాయని కూడ పేర్కొన్నారు. అంతేగాక 1953 ఆగష్టులో భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ, పాక్ ప్రధాని మహమ్మద్ ఆలీలు ఉభయులూ కూడ సక్రమమైన, నిష్పాక్షికమైన ప్లెబిసైటు ద్వారా కాశ్మీరు సమస్యను పరిష్కరించుకోవడానికి అంగీకరించారు. ఈ తీర్మానాలు లేక సంయుక్త ప్రకటనలు వేటిలోకూడ ఇటు భారతదేశాన్ని గాని, లేక అటు పాకిస్తాన్‌ను గాని దురాక్రమణదారుగా పేర్కొనడం జరగలేదని, అలాగే కాశ్మీర్ చేరిక సమస్య అంతిమంగా నిర్ణయమైపోయినట్లు, అది భారతదేశంలో అభిన్న భాగమైనట్లు ఎక్కడా ప్రస్తావించలేదని గ్రహించాలి. పైగా కాశ్మీరును భారతదేశంలోని 14 రాష్ట్రాలలో ఒకటిగా పేర్కొంటూ 1956లో భారత పార్లమెంటులో పాసయిన రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బిల్లు, అలాగే కాశ్మీరు భారతదేశంలో అభిన్న అంతర్భాగమని పేర్కొంటూ 1956 నవంబరులో కాశ్మీరు రాజ్యాంగ సభ రూపొందించిన రాజ్యాంగం రెండూ ప్లెబిసైటు జరిపిస్తామని కట్టుబడిన వైఖరికి విరుద్ధమని నిరసిస్తూ 1957 జనవరిలో భద్రతా మండలి ఒక తీర్మానం పాసు చేసిందనికూడ తెలుసుకోవాలి.

అంటే, పాకిస్తాన్ కాశ్మీరులో దురాక్రమణ జరిపింది అని భారత ప్రభుత్వం చెవినిల్లు కట్టుకుని చేసే పోరును ప్రపంచరాజ్యాలేవీ ఆమోదించలేదు సరిగదా, స్వయంగా భారత ప్రభుత్వం కూడ పై తీర్మానాలు, సంయుక్త ప్రకటనలను ఆమోదించడంవల్ల నిజానికి ఆ అంశంపై పట్టుబట్ట లేదని సైతం తెలుస్తున్నది. అలాగే కాశ్మీరు సమస్య అంతర్జాతీయ సమస్య అయిపోయిందని, నిష్పాక్షికమైన ప్లెబిసైటు ద్వారా అటో ఇటో తేలేదాకా అది భారతదేశంలో అభిన్న భాగమనడానికి వీలు లేదని కూడ మనం తెలుసుకోవాలి. భారత ప్రభుత్వం ఐ.రా.స. కు వెళ్ళింది ఒకందు కయితే జరిగింది మరొకటి. "మనం ఐ.రా.స. కు వెళ్లనవసరం లేదు, సైనికంగా మనం తగు శక్తివంతమైన

స్థితిలోనే వున్నాము, కనుక కావాలనుకుంటే పాకిస్తాన్‌నే వెళ్లనీండి," అని ఉన్నత సేనాధిపతులు ఎంత చెప్పినా నెహ్రూ పెడచెవిన పెట్టాడట. అంటే తను రాజకీయ విజ్ఞత లేకుండా ప్రవర్తించాడన్నమాట. అదే పొరపాటనుకుంటే, ఒకసారి ఐ.రా.స. ను అర్థించి, దాని వివిధ తీర్మానాలకు అంగీకరించి మళ్లీ చాటుగానో, నేటుగానో ఆ తీర్మానాల సారాంశాన్ని కుంగదీయడం, జమ్మూ-కాశ్మీరు భారతదేశంలో అంతర్భాగమై పోయింది, అభిన్న భాగమై పోయిందని ఉద్ఘాటించడం అంతకంటె పెద్దతప్పు; ఒక విధంగా అంతర్జాతీయ మానవతా విలువలను కాలరాచే పెద్ద నేరం కూడ. భద్రతామండలిలోని శాశ్వత సభ్యులు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, చైనాలు మాత్రమేగాక అర్జెంటీనా, బెల్జియం, కెనడా, కొలంబియా, సిరియా, ఈజిప్టు, క్యూబా, ఈక్వడార్, బ్రెజిల్, హాలండ్, టర్కీ, లెబనాన్, గ్రీసు, చిలీ,నార్వేలవంటి సాధారణ సభ్యదేశాలుకూడా కాశ్మీరుపై చర్చల సందర్భంగా సాధారణంగా పాకిస్తాన్ అనుకూల వైఖరినే ప్రదర్శించాయంటే, సోవియట్ యూనియన్ సైతం 1953 దాకా తటస్థంగానే వుంటూ వచ్చిందంటే, అంతర్జాతీయ సముదాయంలో మనమెంత ఏకాకులమైపోయామో గ్రహించవచ్చు. ఇంకా న్యాయం మన పక్షమే ఉంది, మనమే చక్కనోళ్లం అని ప్రచారాలు చేసుకుంటున్నామంటే అదెంత సిగ్గుపడవల్సిన ప్రవర్తన!

భారత ప్రభుత్వం, ప్రజల మొండితనం వల్లే, తమ తప్పులు తాము గుర్తించని అహంభావంవల్లే కాశ్మీరు సమస్య నేటికీ ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లు పడివున్నది. కాశ్మీరీ ముస్లింలలో నేడు అపార ఆగ్రహజ్వాలలు సృష్టించి, వారు భయంకరమైన బీభత్సకాండకు, భారతదేశం పట్ల ఉన్మత్త ద్వేషానికి తల పడేటట్టు చేస్తున్నది.

## రాజ్యాంగ సభ - భారత రాజ్యాంగంలో 370వ అధికరణం :

కాశ్మీరులో కల్లోలం చెలరేగి, ఆ రాజ్యం భారతదేశంలో చేరేనాటికి భారత రాజ్యాంగం యింకా రూపుదిద్దుకోలేదు. భారత రాజ్యాంగ సభ సమావేశాలు యింకా కొనసాగుతూ, వివిధ అధికరణాలపై కూలంకషంగా చర్చలు జరుగుతూ వుండినాయి. కాశ్మీరులోకూడ రాజ్యాంగ సభ ఏర్పాటు చేయాలనే చిరకాల నినాదాన్ని జమ్మూ-కాశ్మీరు జాతీయ కాన్ఫరెన్సు మళ్ళీ 1950లో పైకెత్తింది. జమ్మూ-కాశ్మీర్‌లో మూడవ భాగం కబళించిన పాకిస్తాన్ దురాక్రమణదారులు వైదొలగాలనే డిమాండుతోపాటు, జమ్మూ-కాశ్మీరు రాజ్యపు భావి రూపురేఖలు, అనుబంధాలను నిర్ణయించడానికిగాను రాజ్యంలోని సకల ప్రాంతాలు, సమస్త ప్రజా సముదాయాల భాగస్వామ్యంతో వయోజన ఓటు హక్కు ప్రాతిపదికపై ఒక రాజ్యాంగ సభను ఏర్పాటు చేయవల్సిందిగా కూడా 1950 నాటి కాన్ఫరెన్సు వార్షిక సదస్సు కాశ్మీరు మహారాజాకు విజ్ఞప్తి చేసింది. "మన రాజ్య ప్రజల సమున్నత సంకల్పాన్ని ప్రతిఫలించే ఈ **సర్వసత్తాక సభలో** మనం జరిపిన స్వాతంత్ర్య పోరాటానికి తగినట్లుగా వుండేటువంటి, నవ కాశ్మీరు నిర్మాణ లక్ష్యానికి అనుగుణంగా వుండేటటువంటి ఒక రాజ్యాంగాన్ని మనకు, మన సంతతికి సమర్పించుకుందాం," (వక్కాణింపు మాది) అని కూడా ఆ తీర్మానంలో పేర్కొన్నారు. దానిపై జమ్మూ-కాశ్మీరు రాజ్యాధినేత, యువరాజా కరణ్ సింగ్, 1951

మే 1 వ తేదీనాడు ఒక ప్రకటన చేస్తూ, "ప్రత్యక్ష, రహస్య బాలట్ ద్వారా, వయోజన ఓటు హక్కు ప్రాతిపదికన, రాజ్యాంగ సభను ఎన్నుకోవల్సింది," అని తన రాజ్య ప్రజలను కోరాడు. ఆ మేరకు ఏర్పాటయిన రాజ్యాంగ సభలో జమ్మూ-కాశ్మీరు ప్రధాన మంత్రి షేక్ అబ్దుల్లా ప్రసంగిస్తూ. 1 - 1947 అక్టోబరులో కాశ్మీరుపై దాడిచేసిన పాకిస్తాన్ చర్య నిర్ద్వందంగా దురాక్రమణేనని; 2. భారతదేశానికి చేరిక పూర్తిగా న్యాయబద్ధమైనదేనని; 3. జమ్మూ-కాశ్మీరు వంటి చిన్న రాజ్యం స్వతంత్రంగా మనగల్గడం అతి కష్టం, అవాంఛనీయమని స్పష్టం చేశాడు. అయితే జమ్మూ-కాశ్మీరుకు పూర్తి స్వయం ప్రతిపత్తి సాధించుకోవాలని, రక్షణ, విదేశీ వ్యవహారాలు, సమాచార సంబంధాలు మినహా తతిమ్మా అంశాలన్నీ రాష్ట్ర ప్రభుత్వం చేతుల్లోనే ఉండాలని, అంటే ఆంతరంగిక వ్యవహారాల్లో పూర్తి నిర్ణయాధికారం కాశ్మీరీ ప్రజలకే వుండేట్లు రాజ్యాంగాన్ని రూపొందించుకోవాలని కోరాడు. ఆయన కోరికకు అనుగుణంగానే రాజ్యాంగ సభ వివిధ నిర్ణయాలు తీసుకుంటూ వచ్చింది.

జమ్మూ-కాశ్మీరుకు చెందిన నలుగురు ప్రతినిధుల్ని భారత రాజ్యాంగ సభలో కూడా తీసుకున్నారు. వారు ప్రధానంగా కాశ్మీరు స్వయం ప్రతిపత్తిని కాపాడేందుకు ప్రయత్నాలు చేస్తూ వచ్చారు.

అయితే జమ్మూలోనూ, లడఖ్‌లోనూ వేర్పాటువాద ధోరణులు అంతమయినాయి. భారత యూనియన్‌లో నిర్ద్వందంగా చేరిపోవాలని యితర రాష్ట్రాలకు భిన్నంగా కాశ్మీరుకు ప్రత్యేక ప్రతిపత్తి ఏదీ ఉండరాదని జమ్మూ ప్రజా పరిషత్ ఆందోళన కూడా ప్రారంభించింది. లడఖ్‌లోని లామాలు కూడా షేక్ అబ్దుల్లా నిరంకుశ ధోరణుల్ని నిరసించారు. భారత యూనియన్‌లో పూర్తి విలీనానికే తాము కట్టుబడి వున్నట్లు స్పష్టం చేశారు. మిహిర్‌లాల్ ఛటోపాధ్యాయ అనే భారత రాజ్యాంగ సభ సభ్యుడు జమ్మూ సందర్శించి భారత ప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించాడు. ప్లెబిసైటు జరిగితే 90 శాతం మంది ముస్లింలు పాకిస్తాన్‌తో చేరికకు అనుకూలంగా ఓటు వేయడం ఖాయమని జమ్మూ - కాశ్మీరులోని హిందువులంతా అభిప్రాయపడుతున్నారని, హిందువులకు, సిక్కులకు దన్నుగా వున్న మహారాజు అధికారాల్ని షేక్ అబ్దుల్లా అతి త్వరితగతిని కుంగదీయడం వారికి ఆందోళనకరంగా వుందని ఆ నివేదికలో పేర్కొన్నాడు. జమ్మూ-కాశ్మీరు రాజ్యాంగ సభకు ఎన్నికలు కూడా పూర్తిగా అక్రమాలతో కూడుకున్నవే. కాశ్మీరు లోయ, లడఖ్‌లకు కేటాయించిన 45 స్థానాల్లోనూ జాతీయ కాన్ఫరెన్సు అభ్యర్థులు 'పోటీ లేకుండా' ఎన్నికయినారు. అంటే అక్కడ అసలు ఓట్లు వేయాల్సిన (పోలింగు) అవసరమే రాలేదు. జమ్మూకు కేటాయించిన 30 స్థానాల్లోంచి 13 స్థానాల్లోపై ప్రజా పరిషత్ నామినేషన్లను అతి స్వల్ప కారణాలతో తోసివేసారు. అందుకు నిరసనగా ప్రజా పరిషత్ తక్కిన 17 స్థానాల్లో కూడా ఎన్నికలు బహిష్కరించింది. ఫలితంగా 30 స్థానాలూ పోలింగు లేకుండానే జాతీయ కాన్ఫరెన్సు కైవసం అయినాయి. కనుక ఆ రాజ్యాంగ సభ, అది రూపొందించిన రాజ్యాంగం ఎంత అప్రజాస్వామికమో, ఎంత హాస్యాస్పదమో వేరుగా చెప్పనక్కరలేదు. పైగా ఈ రాజ్యాంగ సభ నిర్ణయాలు ఆమోదయోగ్యం కాజాలవని

భద్రతా మండలి తీర్మానం చేయడం కూడా మనం గుర్తు చేసుకోవాలి.

ఏమైనా నెహ్రూను, ఆయన ద్వారా కాంగ్రెసు పార్టీని ప్రభావితం చేసి భారత రాజ్యాంగంలో జమ్మూ - కాశ్మీరుకు ప్రత్యేక ప్రతిపత్తి సాధించడంలో మాత్రం షేక్ అబ్దుల్లా సఫలీకృతుడయ్యాడు. రాజ్యాంగంలోని 370వ అధికరణం ప్రకారం, జమ్మూ కాశ్మీరు రాష్ట్రానికి సంబంధించినంత వరకు ఆ రాష్ట్ర ప్రభుత్వం సమ్మతి వ్యక్తం చేసిన అంశాలపై మాత్రమే భారత పార్లమెంటుకు చట్టాలు చేసే అధికారం ఉంటుందని, అదే విధంగా ఆ రాష్ట్ర ప్రభుత్వం ఆమోదంతో రాష్ట్రపతి నిర్దేశించిన అంశాలపై మాత్రమే పార్లమెంటు చట్టాలు చేయవచ్చునని పరిమితులు విధించారు. ఒక వేళ ఈ 370వ అధికరణాన్ని తాత్కాలికంగా నిలుపుదల చేయవల్సి వచ్చినా, అది అప్పటి కాశ్మీరు మహారాజు లేక రాష్ట్ర రాజ్యాంగ సభ ఆమోదంతో మాత్రమే సంభవమని స్పష్టం చేశారు. ముఖ్యంగా కాశ్మీరేతరులు ఆ రాష్ట్రంలో తిష్ట వేయడాన్ని, ఆస్తులు సముపార్జించుకోవడాన్ని ఈ అధికరణం వల్ల నిషేధించినట్లయింది. జమ్మూ-కాశ్మీరులో వివిధ మత వర్గాల జనాభాల అనుపాతాన్ని చాటుగానో, నేటుగానో మార్చే అవకాశం లేకుండా చేసివేసారు. అలాగే రాష్ట్రపతి పాలన విధించాలన్నా అక్కడి శాసనసభ ఆమోదం లేకుండా సాధ్యం కాకుండాను, అత్యవసర పరిస్థితి విధించాలన్నా రాష్ట్రపతికి నేరుగా అధికారాలు లేకుండాను చేసివేసారు.

కాని ఈ 370వ అధికరణం కూడ తరచూ అంతర్భావన ప్రకారం గాక అక్షరక్రమం ప్రకారమున్నట్లుగా అమలవుతూ జమ్మూ-కాశ్మీరు ప్రజల స్వయం ప్రతిపత్తిని బాగా దెబ్బతీస్తూ వస్తున్నది. జమ్మూ-కాశ్మీరును రక్షించే అడ్డుగోడగా కాక దానిలోకి క్రమక్రమంగా ప్రవేశం కల్పించే సొరంగంలాగ ఈ అధికరణం ఉపయోగపడుతుందని ప్రముఖ కేంద్ర మంత్రివర్యులే కొందరు శెలవిచ్చివున్నారు. షేక్ అబ్దుల్లా తర్వాత వచ్చిన గులాం ప్రభుత్వంలో సుంకాల అడ్డుగోడల్ని తొలగించి భారతదేశ ఆర్థిక వ్యవస్థలో జమ్మూ-కాశ్మీరును పూర్తిగా కలిపేశారు. రాష్ట్రపతి పాలన నిరాటంకంగా విధించే వెసులుబాటు క్రమక్రమంగా సంపాదించుకున్నారు. చివరకు అక్కడి ముఖ్యమంత్రిని (ఫారుఖ్ అబ్దుల్లాను) కనీసం సంప్రదించకుండానే ఒక నిరంకుశ గవర్నరు (జగ్‌మోహన్)ను నియమించి అప్రకటిత సైనిక శాసనం నెలకొల్పేందుకు కూడ ఈ 370వ అధికరణాన్నే వినియోగించుకున్నారు. ఎం.సి.చాగ్లా వంటి న్యాయవేత్తలు సైతం 370వ అధికరణం ద్వారానే భారత రాజ్యాంగంలోని సకల అధికరణాలూ జమ్మూ-కాశ్మీరు రాష్ట్రానికి వర్తింపజేయవచ్చని ధీమాగా భాష్యం చెప్పారంటే కాశ్మీరు ప్రజలను భారత ప్రభుత్వం ఎంత దగా చేసిందో తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు. అయినప్పటికీ అసలీ అధికరణాన్ని పూర్తిగా రద్దు చేసి, జమ్మూ-కాశ్మీరును సంపూర్ణంగా విలీనం చేసుకోవాలనే పార్టీలు, వ్యక్తులకు కూడ మనదేశంలో కొరతలేదు. వీరికి విశ్వమానవతా విలువలతో, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, పౌరహక్కులతో, అంతర్జాతీయ జనాభిప్రాయంతో, మనమే అంగీకరించిన అంతర్జాతీయ ఒప్పందాల కట్టుబాట్లతో ఏమాత్రం పనిలేదు. అఖండ భారత సామ్రాజ్యం మాత్రమే కావాలి. లక్షలు, కోట్లాది పీడిత ప్రజల, జాతుల రక్తం, కన్నీళ్ల ప్రవాహాల

గుండా నైనా సరే జమ్మూ కాశ్మీరు మనదేశంలో అభిన్న భాగం కావల్సిందే. కేవలం భారతీయ జనతాపార్టీ, ఆర్.ఎస్.ఎస్. వంటి సంస్థలే అనుకునేరు, జనతాదళ్, కాంగ్రెస్ (ఐ)లు కూడ, ఆఖరుకు కమ్యూనిస్టు పార్టీలు అని చెప్పుకునే కొన్ని కూడ ఈ జాతీయోన్మాద ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నాయి. అసలు 370వ అధికరణాన్నే రద్దు చేయాలనే ఒక ప్రైవేటు సభ్యుని తీర్మానానికి 1964లో పెద్ద ఎత్తున కాంగ్రెస్ సభ్యులు సైతం మద్దతు ప్రకటించారని, చివరి దశలో కేంద్ర ప్రభుత్వం విజ్ఞతతో చేసిన వత్తిడివల్ల ఈ ప్రమాదం తప్పి పోయిందని మనలో ఎందరికి తెలుసు? ఈ రకమైన పరిణామాలన్నీ కాశ్మీరీ ముస్లింల మనోభావాలను బాగా దెబ్బతీసి, వారిని భారత ద్వేషులుగా చేసివేసాయి.

## ఏకు మేకైన అబ్దుల్లా!

కాశ్మీర్ సింహంగా పేరు పొంది జమ్మూ-కాశ్మీరు ప్రజల అవ్యాజ ప్రేమానురాగాలు పొందిన షేక్ అబ్దుల్లా నానాటికీ యధేచ్ఛగా, నిరంకుశంగా ప్రవర్తిస్తూ అనేక తప్పటడుగులు వేయసాగాడు. "కాశ్మీరులో మతతత్వవాది, జమ్మూలో కమ్యూనిస్టు, భారతదేశంలో జాతీయవాది," అని ఎవరో షేక్ అబ్దుల్లాను చక్కగా అభివర్ణించారు. చాలా చంచల స్వభావుడు; అవకాశవాది. తనకున్న అపూర్వ ప్రజాదరణను దుర్వినియోగం చేసుకొన్నాడని చెప్పవచ్చు. అబ్దుల్లాకు మొదటినుండీ పాకిస్తాన్ అంటేనే అలెర్జీ. కనుక పాకిస్తాన్‌లో చేరికను ఆయన తీవ్రంగా ప్రతిఘటిస్తూ వచ్చాడు. కాని వ్యక్తిగత అభిలాష అనండి, సమున్నత జాతీయ స్పృహ అనండి, ఏమన్నా, కాశ్మీరు ప్రజలు వీలైతే స్వతంత్రంగా ఉండాలనే కోర్కె ఆయన హృదయంలో గూడుకట్టుకొని వుండింది. కనుక ఒకసారి జమ్మూ-కాశ్మీరును పాకిస్తాన్ కబళించే అవకాశం లేకుండా చేసివేసిన పిదప, భారత ప్రభుత్వ ఛత్రచ్ఛాయల్లో కాశ్మీరుకు సాధ్యమైనంత స్వయం ప్రతిపత్తి సాధించుకోవాలని అనుకున్నాడు. కాని అదంతా తన నాయకత్వంలోనే తిరుగులేని తన ఉత్తరువుల ప్రకారమే సాగాలి. రాజ్యంలోని వివిధ ప్రతిపక్షాలను నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు. పౌరహక్కుల్ని రూపుమాపాడు. మునుపటి సన్నిహిత సహచరులే తనను కాశ్మీరీ హిట్లరుగా తూలనాడేంతదాకా దిగజారాడు.

మరోవైపున నెహ్రూతో, భారత ప్రభుత్వంతో కూడా ఎడమొగం, పెడమొగంగా ప్రవర్తించడం మొదలు పెట్టాడు. భారతదేశంలో చేరిక నిర్ద్వంద్వం, దాన్ని ప్రశ్నించే ప్రసక్తి లేనే లేదని ఒకసారి అంటాడు. మరునాడే కాశ్మీరు విషయంలో అగ్రరాజ్యాలు గాని, భారత, పాకిస్తాన్‌లు గాని ఎవరు జోక్యం చేసుకున్నా సహించేది లేదని కారాలు, మిరియాలు నూరుతాడు. నెహ్రూను శ్రీనగర్‌కు ఆహ్వానించి ఎల్లెడలా జాతీయ కాన్ఫరెన్సు పతాకాల రెపరెపలు చూపిస్తాడు. కాని ఒక్కచోట కూడా జాతీయ జెండా వుండదు! నెహ్రూ పక్కన వుండగానే కాశ్మీరు ప్రజలు సర్వస్వతంత్రులని ఉపన్యాసం దంచుతాడు. భారతదేశం లౌకిక, ప్రజాస్వామ్య సంప్రదాయాలు గలదని ఒకసారి ప్రశంసిస్తాడు. పాకిస్తాన్ మత తత్వంలోను, మిలిటరీ పాలనలోను మగ్గిపోతున్న రాజ్యమని నిరసిస్తాడు. మరునాడే భారతదేశంలో ముస్లింలపై దారుణాలు జరిగిపోతున్నాయి; కాశ్మీర్ ప్రజలు యిదంతా చూచి

ఊరుకోలేరని బెదిరిస్తాడు. ఈ విచిత్ర వీరుని ఆర్భాటాలతో భారత ప్రభుత్వంవారు, నెహ్రూగారు సైతం బాగా ఖంగుతిన్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ఢిల్లీకి రావాల్సిందిగా నెహ్రూ పదే పదే ఆహ్వానించినా అబ్దుల్లా వెళ్ళలేదు. కాని అబ్దుల్లాకు కుడిభుజం అనుకున్న బక్షీ గులాం మహమ్మద్, గవర్నరుగా వున్న యువరాజా కరణ్ సింగ్‌లు వెళ్లి అబ్దుల్లాపై ఫిర్యాదులు చేసి వచ్చారు. అమెరికా మద్దతుతో కాశ్మీరును స్వతంత్ర రాజ్యంగా ప్రకటించాలని అబ్దుల్లా తలపోస్తున్నాడని, అప్పట్లో శ్రీనగర్‌కు వచ్చిన అడ్లాయ్ స్టీవెన్సన్‌తో ఈ విషయమై రహస్య మంతనాలు సాగించాడని పుకార్లు వ్యాపించాయి. ఈ నేపథ్యంలో కాశ్మీరు జాతి స్వాతంత్ర్యం వాంఛనీయం, భారతదేశంలో చేరిక తాత్కాలికం మాత్రమేననే భావంతో అబ్దుల్లా రాసిన ఉర్దూ ప్రసంగ పాఠాన్ని కేంద్ర ప్రభుత్వం జప్తు చేసుకున్నది. బక్షీ గులాం మహమ్మద్ భారతదేశంలో చేరిక శాశ్వతం, దాన్ని ప్రశ్నించే వీలే లేదని ప్రకటించి బాహాటంగా జాతీయ కాన్ఫరెన్సులో చీలిక తెచ్చాడు. "అఁ....... వీళ్ళంతా నన్నేం చేయగలరులే," అనే ధీమాతో షేక్ అబ్దుల్లా తాపీగా గుల్మార్గ్‌కు వెళ్ళి విశ్రాంతి తీసుకోసాగాడు. అదే అదనుగా, మరి కొందరు కాబినెట్ సహచరుల్ని కలుపుకుని, షేక్ అబ్దుల్లాను బర్తరఫ్ చేయాల్సిందిగా గవర్నరుకు దరఖాస్తు పెట్టుకున్నాడు గులాం. తమ రాజవంశాన్ని బాహాటంగా అవమానించి, పదవీచ్యుతుల్ని చేసిన అబ్దుల్లాపై పగ సాధించడానికి యింతకంటే సువర్ణావకాశం కరణ్ సింగ్‌కు దొరుకుతుందా? తక్షణమే షేక్ అబ్దుల్లా మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేసి, బక్షీ గులాం మహమ్మద్ ప్రధానమంత్రిగా నూతన ప్రభుత్వాన్ని 1953 ఆగస్టు 8వ తేదీ నాడు ఏర్పాటు చేశాడు. అబ్దుల్లాను అరెస్టు చేసి జైల్లో తోసాడు.

అయితే కాశ్మీరు ప్రజలు ఆగ్రహావేశాలతో ప్రదర్శనలు చేశారు. వందలాది మంది అరెస్టయ్యారు. కనీసం 200-300 మంది పోలీసు కాల్పుల్లో మరణించారు. ఇది షేక్ అబ్దుల్లా పట్ల కాశ్మీర్ ముస్లింలకు యింకా చావని ఆదరాభిమానాలకు, వారి హృదయాల్లో రగిలే స్వాతంత్ర్య కాంక్షకు నిదర్శనం. అంతవరకు 'భారతదేశపు తొత్తు'గా అబ్దుల్లాను నిందించే పాకిస్తాన్ పత్రికలు ఒక్కసారిగా ప్లేటు ఫిరాయించి అతడిని 'జాతీయ వీరుని'గా చిత్రించసాగాయి. భారత ప్రభుత్వాన్ని దుమ్మెత్తి పోయసాగాయి. కాని అనతి కాలంలో వాతావరణం మళ్లీ చల్లబడింది. నక్కజిత్తుల గులాం మహమ్మద్ జమ్మూ-కాశ్మీరు రాజ్యాంగ సభ సభ్యుల్లో అత్యధికుల్ని నయాన, భయాన తన చెప్పు చేతల్లో వుంచుకున్నాడు. రాజ్యాంగ నిర్మాణ కార్యక్రమం శీఘ్రంగా ముగింపజేశాడు. గులాం ఆధ్వర్యంలో రూపొందించిన జమ్మూ-కాశ్మీరు రాజ్యాంగం, భారతదేశంలో జమ్మూ-కాశ్మీరు అభిన్న భాగమని ప్రకటించింది. 75 మంది రాజ్యాంగ సభ సభ్యుల్లో 64 మంది యిందుకు అనుకూలంగా ఏకగ్రీవంగా ఓటు చేశారు. గైరు హాజరయిన 11 మందిలో ఆరుగురు ఖైదులో వున్నవారు.

## గులాం, సాదిక్‌ల పాలన - తదనంతర పరిణామాలుః

కాశ్మీరు లోయ అంతటా విస్తృతమైన ప్రజాదరణ వుండీ ప్రజాస్వామ్యాన్ని అపహాస్యం చేసే విధంగా ఎన్నికలలో పెద్ద ఎత్తున అక్రమాలకు పాల్పడడం షేక్ అబ్దుల్లా పతనానికి దారితీసిన

ముఖ్య కారణాల్లో ఒకటి. ఈ వరస బక్షీ గులాం పాలనలో కూడా కొనసాగింది. షేక్ అబ్దుల్లా వంటి ప్రముఖులు ఖైదులో వుండినప్పటికీ, విస్తృతంగా అక్రమాలకు పాల్పడుతూ బక్షీ గులాం ఎన్నికల్లో విజయం సాధిస్తూ వచ్చాడు. 1957 ఎన్నికల్లో 47 స్థానాల్లోంచి 41 స్థానాల్లోనూ, 1962 సాధారణ ఎన్నికల్లో 45 లోంచి 40 స్థానాల్లోనూ బక్షీ గులాం అనుయాయులు పోటీ లేకుండా ఎన్నికైనారంటే అవెంత ప్రజాస్వామికంగా జరిగాయో అర్థం చేసుకోవచ్చు. ఇంత పెద్ద ఎత్తున అక్రమాలు భారతదేశంలో మరెక్కడా జరగలేదు. అంతేగాక ప్రజల ప్రాథమిక హక్కులన్నీ బక్షీ గులాం పాలనలో నిర్దాక్షిణ్యంగా కాలరాచి వేయబడ్డాయి.

గులాం ప్రభుత్వ అత్యాచారాల పట్ల ప్రజల్లో రగులుకొంటూండిన క్రోధ ద్వేషాలు 1963 డిసెంబరులో హజరత్ బాల్ ఘటనతో జ్వాలాయమానంగా ప్రజ్వరిల్లాయి. శ్రీనగర్‌లోని హజరత్ బాల్ మసీదునందలి మహమ్మద్ ప్రవక్త పవిత్ర కేశం అపహరింపబడిందనే వార్త పొక్కడంతో కాశ్మీరు లోయ అంతటా మహమ్మదీయ ప్రజలు ఆగ్రహావేశాలతో ప్రదర్శనలు జరిపారు. పెద్దయెత్తున హింసా దౌర్జన్యాలకు దిగారు. పరిపాలన యావత్తూ స్తంభించి పోయింది. చివరకు ఎలాగో ఆ పవిత్ర కేశం తిరిగి దొరకడంతో ఆ ఆందోళన చల్లారినా, దాని ఫలితంగా బక్షీ గులాం రాజీనామా చేయవలిసే వచ్చింది. ఆయన స్థానే జి. ఎమ్. సాదిక్ ముఖ్యమంత్రిగా ప్రభుత్వం ఏర్పడింది. మొదట్లో సాదిక్ ప్రజాస్వామ్య సాంప్రదాయాలను, పౌరహక్కుల్ని పునరుద్ధరించే కొన్ని మంచి చర్యలు చేపట్టాడు. 1953లో జైలుపాలైనప్పటినుండీ నడుమ 1958లో ఒక మూడు నెలల పాటు మాత్రమే స్వేచ్ఛ పొందిన షేక్ అబ్దుల్లా, సాదిక్ ఆమోదం వల్ల 1964లో విడుదలయ్యాడు. 1961లో షేక్ అబ్దుల్లాపై, మరి 14 మందిపై ప్రభుత్వాన్ని కూలద్రోసే ప్రయత్నం చేశారనే అభియోగం మోపారని, ఆ కేసులో తాను కాశ్మీరు స్వాతంత్ర్యం, స్వయం నిర్ణయాధికారాల కోసమే పోరాడాననే డిఫెన్సు వాదాన్ని షేక్ అబ్దుల్లా ముందుకు తెచ్చాడని కూడా యిక్కడ తెలుసుకోవాలి.

అయితే జి.ఎమ్. సాదిక్ కూడా అనతి కాలంలో తప్పటడుగులు వేయసాగాడు. అసలు జాతీయ కాన్ఫరెన్స్‌నే రద్దు చేసుకోవాలని ఆయన ప్రతిపాదించడం కాశ్మీరు ప్రజలకు కంటకమయింది. పైగా 1964 నవంబర్‌లో 370వ అధికరణాన్నే రద్దు చేయాలని భారత పార్లమెంటులో ఒక స్వతంత్ర సభ్యుడు ప్రవేశపెట్టిన తీర్మానానికి విస్తృత మద్దతు లభించి, అది పాసయ్యే ప్రమాదం తలయెత్తడంతో కాశ్మీరు లోయలో పరిస్థితులు తిరిగి విషమించాయి. షేక్ అబ్దుల్లాకు, మీర్జా అఫ్జల్ బేగ్, ఆయన ప్లెబిసైట్ ఫ్రంట్‌లకు జనాదరణ విస్తృతంగా పెరగసాగింది. ఈ నేపథ్యంలోనే విదేశాల్లో పర్యటనకు వెళ్ళినప్పుడు షేక్ అబ్దుల్లా, కాశ్మీరు స్వాతంత్ర్యం, స్వయం ప్రతిపత్తులను గురించి భారత దేశానికి అభ్యంతరకరమైన వ్యాఖ్యలు చేయడం, ఫలితంగా ఆయన పాస్‌పోర్టును చెల్లకుండా చేసి (ఇంపౌండ్ చేసి), భారతదేశానికి తిరిగి రాగానే ఆయన్ను గృహ నిర్బంధంలోకి తీసుకొనడం జరిగింది. 1965లో షేక్ అబ్దుల్లాను కాశ్మీరు లోయకు 2000 మైళ్ళ దూరంగా దక్షిణానగల కొడైకెనాల్‌కు పంపించి, గృహ నిర్బంధంలో వుంచారు.

అనంతరం 1965లో ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య భీషణ యుద్ధం చెలరేగింది. కాశ్మీరు రంగంలో కూడా సంకుల సమరం సాగింది. అయితే ఉభయ పక్షాల్లో ఏదీ నిర్ణయాత్మక విజయం సాధించలేదు. చివరకు సోవియెట్ యూనియన్ మధ్యవర్తిత్వంలో ఆయూబ్‌ఖాన్, లాల్ బహదూర్ శాస్త్రిల మధ్య తాష్కెంటులో ఒక అంగీకారం కుదిరి, వారొక సంయుక్త ప్రకటన జారీ చేసిన విషయం మనకు తెలుసు. ఆ ప్రకటనలో కాశ్మీరు సమస్య ప్రస్తావన కూడా వున్నది. ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య వివాదాలన్నీ ఐ.రా.స. ప్రణాళికలోని సూత్రాలకు అనుగుణంగా బలప్రయోగానికి దిగకుండా శాంతియుత పద్ధతుల్లో పరిష్కరించుకోవాలని ఆ ప్రకటన నిర్దేశించింది. దాని అర్థం జమ్మూ - కాశ్మీరు సమస్యకు అంతర్జాతీయ ప్రాధాన్యం లేదనిగాని, వివిధ ఐ.రా.స. భద్రతా మండలి తీర్మానాల్లో నిర్దేశించిన ప్లెబిసైటు అవసరం యింక లేదని గాని కాదు. తర్వాత 1971 యుద్ధంలో సైతం, తూర్పు పాకిస్తాన్ నంతటినీ కోల్పోయినా, పశ్చిమ రంగంలో మాత్రం పాకిస్తాన్ సేనలు భారత సైన్యాలకు దీటుగానే నిలిచాయి. అప్పుడైనా ఆక్రమిత (ఆజాద్) కాశ్మీరును విముక్తం చేయడం అటుంచి వ్యూహాత్మకంగా అనుకూలమైన స్థావరాలను కైవసం చేసుకోవడంలోనైనా భారత సైన్యాలు కృతకృత్యం కాలేకపోయాయి. యుద్ధానంతరం, సగం చిక్కిన పాకిస్తాన్‌కు ప్రధానమంత్రిగా వుండిన జుల్ఫికర్ ఆలీ భుట్టోతో మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ సిమ్లాలో మంతనాలాడి, ఇరుపక్షాలూ బల ప్రయోగం ద్వారా కాక శాంతియుత చర్చల ద్వారా పెండింగులో వున్న సమస్యలు పరిష్కరించుకోవాలనే అంగీకారంతో సిమ్లా ఒప్పందాన్ని 1973లో కుదుర్చుకున్నది. జమ్మూ - కాశ్మీరులోని యుద్ధ విరమణ రేఖను ఉభయ పక్షాలు అనుల్లంఘనీయంగా భావించుకోవాలని కూడా ఈ ఒప్పందంలో అంగీకారానికి వచ్చారు. అంటే, అక్కడికి అదొక అంతర్జాతీయ సరిహద్దు అయిపోయినట్లు పెడర్థాలు తీయకూడదు. అలా తీసినా యావత్ జమ్మూ-కాశ్మీరు రాష్ట్రం (ఆజాద్ కాశ్మీరుతో సహా, గిల్గిత్, బాల్టిస్తాన్‌లతో యుక్తంగా) భారతదేశంలో చేరినట్లే భావించుకోవాలని అంతర్జాతీయ వేదికలపై వివిధ సందర్భాల్లో భారత ప్రభుత్వం చేసిన వాదాలన్నీ నీరు గారినట్లే అవుతాయి. అలాగే పరస్పర చర్చల ద్వారా సమస్యలు పరిష్కరించుకోవాలనంటే యిదివరకే అంతర్జాతీయ వేదికల కెక్కిన సమస్యల్ని కేవలం ద్వైపాక్షిక సమస్యలుగా చూస్తామన్నట్లు కాదు. అలాగైతే ఈ 22 సంవత్సరాల్లో భారతదేశంగాని, పాకిస్తాన్‌గాని కాశ్మీరు సమస్యపై ఫిర్యాదులను ఐ.రా.స. నుండి ఎందుకు ఉపసంహరించుకోనట్లు? కనుక నేటికీ కాశ్మీరు సమస్య అంతర్జాతీయ సమస్యేనని, 1950, 1951ల నాటి భద్రతామండలి తీర్మానాలు నేటికీ అప్రస్తుతం కావని మనం తెలుసుకోవాలి.

శ్రీమతి ఇందిరాగాంధీ చతురతతో షేక్ అబ్దుల్లాను విడుదల చేసి, ఆయన్ను ముఖ్యమంత్రిగా చేసే హామీతో కాంగ్రెసు-జాతీయ కాన్ఫరెన్సుల మధ్య ఒడంబడిక కుదుర్చుకున్నది. ఫలితంగా షేక్ అబ్దుల్లా సుమారు 16 సంవత్సరాల ఖైదు అనంతరం మళ్లీ కాశ్మీరు ముఖ్యమంత్రిగా (గులాం పాలనలో ప్రధానమంత్రి హోదా రద్దయి, ముఖ్యమంత్రి స్థాయే మిగిలింది) అయ్యారు. గతంలోని కటువైన అనుభవాల దృష్ట్యా తాను బతికివున్నంతదాకా మళ్లీ కాశ్మీరు స్వాతంత్ర్యం, స్వయం

నిర్ణయాధికారం అనే మాటలైతే ఎత్తలేదు. కాని ఆయన పాలనలోనే జమ్ము-కాశ్మీర్ జాతీయ విముక్తి సంఘటన, మరికొన్ని తీవ్రవాద ముస్లిం సంస్థలు క్రియాశీలమైనాయి. జమ్మూ - కాశ్మీరు జాతీయ విముక్తి సంఘటన అనతి కాలంలో టెర్రరిస్టు చర్యలకు కూడా తలపడసాగింది. మొట్టమొదటిసారిగా ఒక భారత విమానాన్ని హైజాక్ చేసినవారు ఈ సంఘటనకు చెందిన గెరిల్లాలే కావడం విశేషం. కాలక్రమంలో దాని నాయకుడు మగ్బూల్ భట్‌ను అరెస్టు చేయడం, 1984 ఫిబ్రవరి 11న అతడ్ని ఉరితీయడం మనకు తెలిసిందే. కానీ ఈ కఠిన చర్యలేవీ ఆ సంఘటన పలుకుబడిని అంతమొందించలేకపోయాయి.

షేక్ అబ్దుల్లా 1982 సెప్టెంబరు 7వ తేదీనాడు మరణించిన అనంతరం ఆయన కొడుకు ఫరూఖ్ అబ్దుల్లా ముఖ్యమంత్రి కావడం, అచిరకాలంలో అబ్దుల్లా కొడుకుకు, అల్లుడు జి.ఎం.షా కు మధ్య స్పర్థ పెరిగి వైరంగా మారడం, దాన్ని ఆసరా తీసుకొని గవర్నరు జగ్ మోహన్ చే అబ్దుల్లా ప్రభుత్వాన్ని ఇందిరాగాంధీ రద్దు చేయించడం, ఇక్కడ గవర్నర్ రామ్‌లాల్ కుత్సితంతో ఎన్.టి.ఆర్.ను బర్తరఫ్ చేయడం వల్ల ఉవ్వెత్తున చెలరేగిన ఆందోళనలాగే కాశ్మీరులోయలో కూడా ఫరూఖ్ అబ్దుల్లా ప్రభుత్వం బర్తరఫ్‌కు నిరసనగా ఆందోళన చెలరేగడం యివన్నీ మనకు తెలిసిన విషయాలే. కాశ్మీరు ప్రజల నిరసన వెల్లువ మూలంగా మళ్లీ ఫరూఖ్ అబ్దుల్లానే ముఖ్యమంత్రిగా నియమించక తప్పలేదు. అనంతరం జరిగిన ఎన్నికల్లో ఫరూఖ్ అబ్దుల్లా ఘన విజయం సాధించాడు. 1989 సాధారణ ఎన్నికల్లో సైతం జాతీయ కాన్ఫరెన్సుకు చెందిన ప్రతినిధులే కాశ్మీరులోయనుండి లోక్‌సభకు ఎన్నికైనారు.

1982 నుండి పంజాబులో భీభత్సవాదం పెరగడం, 1983లో ఆపరేషన్ బ్లూస్టార్ వల్ల సిక్కుల మనోభావాలు బాగా దెబ్బతినడం, 1984లో ఇందిరాగాంధీ హత్య, తదనంతరం ఢిల్లీలో సిక్కుల ఊచకోత మొదలైన పరిణామాల వల్ల పంజాబులో ఖలిస్తాన్ వేర్పాటువాదులు బలమైన శక్తిగా అవతరించారు. వారు జమ్మూలో కూడ విచ్ఛిన్నకర, టెర్రరిస్టు చర్యలకు తలపడసాగారు. జమ్మూ-కాశ్మీరు జాతీయవిముక్తి సంఘటనతో, బహుశా యితర తీవ్రవాద ముస్లిం వర్గాలతో కూడ ఖలిస్తాన్ టెర్రరిస్టులు సంబంధాలు పెట్టుకున్నారు. వీరందరికీ పాకిస్తాన్ సాధ్యమైనంతమేర సహాయ సహకారాలు, శిక్షణ అందిస్తున్నది. 1971లో తమ దేశాన్ని ముక్కలు చేసినందుకు కసితో భారతదేశంలో కూడా విచ్ఛిన్నకర, వేర్పాటువాద ధోరణులు ప్రబలేట్లు చూడాలని పాకిస్తాన్ తాపత్రయపడడం, సర్వ ప్రయత్నాలు చేయడం ఒక విధంగా మానవ సహజమేనేమో కూడా. కాని అంతమాత్రాన అసలు సమస్యలు అంత తీవ్ర స్థాయికి పరిణమించడానికి విదేశీ హస్తమే ముఖ్య లేక ఏకైక కారణమనడం హాస్యాస్పదమే అవుతుంది. మన దేశంలోనే అంతర్గతంగా రగిలే వైరుధ్యాలు, తలయెత్తే వివిధ సమస్యలు ప్రధానమైనవని, విదేశీ జోక్యం లేక సాయం లేక ప్రేరణ ద్వితీయ ప్రాధాన్యత గలది (secondary) మాత్రమేనని తెలుసుకోవాలి.

ఉదాహరణకు జమ్మూ-కాశ్మీరు సమస్యపై ఐ.రా.స. భద్రతా మండలి తీర్మానాలను,

ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని మన్నించకుండా ఇన్ని దశాబ్దాలుగా దాన్ని నానబెట్టడం కాశ్మీరు ప్రజలలో స్వాతంత్ర్య కాంక్షను మరింత బలీయం చేసింది. భారత పాలనపై ద్వేషాన్ని ఇనుమడింప జేసింది. ఆ నేపథ్యంలో మగ్బూల్ భట్ వంటి జాతీయ విముక్తి సంఘటన నాయకులను కనికరం, రాజకీయ విజ్ఞతలు లేకుండా ఉరితీయడం అగ్నిలో ఆజ్యం పోసినట్లే అయింది. దీనితో జమ్మూ - కాశ్మీరు జాతీయ విముక్తి సంఘటన క్రమ క్రమంగా తన అంగబలాన్ని, ఆయుధ బలాన్ని పెంచుకుంటూ నేడు కాశ్మీరులో అల్లకల్లోలం సృష్టించగలుగుతున్నది. దానికి మరికొన్ని ముస్లిం తీవ్రవాద వర్గాలుకూడా తోడైనాయి. సిక్కు టెర్రరిస్టుల రహస్య సంబంధాల గురించి పైన తెలుసుకొని వున్నాము. 1989 చివర వి.పి. సింగ్ నాయకత్వాన కాంగ్రెసేతర కేంద్ర ప్రభుత్వం ఏర్పడినప్పటినుండి జమ్మూ-కాశ్మీర్‌లో బీభత్సవాద చర్యలు బ్రహ్మాండంగా పెరిగిపోయాయి. రాజీవ్ గాంధీ ప్రభుత్వాన్ని పంజాబ్ టెర్రరిజం ముప్పతిప్పలు పెడితే, వి.పి. సింగ్ ప్రభుత్వానికి కాశ్మీరు టెర్రరిస్టులు ప్రధానమైన తలనొప్పిగా పరిణమించారు; అలాగని పంజాబ్‌లో టెర్రరిస్టుల ప్రాబల్యమూ తగ్గలేదు. వి.పి. సింగ్ ప్రభుత్వం సరిగ్గా ఏర్పడీ ఏర్పడకముందే హోం మంత్రి ముఫ్తీ మహమ్మద్ సయీద్ కుమార్తె రుబాయాను జమ్మూ-కాశ్మీర్ విముక్తి సంఘటనకు చెందిన గెరిల్లాలు అపహరించుకుని పోవడం, ఆమెను పణంగాపెట్టి జైలులో వున్న తమ సహచరులు కొందరిని విడిపించుకోవడం, కాశ్మీరు లోయ అంతటా విధ్వంస కాండ, పాకిస్తాన్ అనుకూల ప్రదర్శనలు, టెర్రరిస్టు దాడులు, దాన్ని అణచడానికి రాష్ట్ర ప్రభుత్వాన్ని సంప్రదించకుండానే నిరంకుశుడు జగ్ మోహన్‌ను గవర్నరుగా నియమించడం, నిరసనగా ఫరూఖ్ అబ్దుల్లా రాజీనామా, అయినా చల్లారని ప్రజల ఆగ్రహావేశాలు, వివిధ పట్టణాల్లో కర్ఫ్యూలు, కాల్పుల్లో అనేకుల మరణాలతో ఒక అప్రకటిత సైనిక పాలన నెలకొని వుండడం యివన్నీ మనం రోజూ పత్రికల్లో, రేడియో, టి.వి.లలో వార్తల ద్వారా గమనిస్తూనే వున్నాము. ఒకప్పుడు కాశ్మీరు ప్రజలలో గణనీయ భాగమైనా భారతదేశంలో చేరికను సమర్థించారు. ఇప్పుడో కాశ్మీరీ ముస్లింలలో బహుశా నూటికి 95 వంతుల మంది స్వాతంత్ర్యాన్నో, లేక పాకిస్తాన్‌లో చేరికనో నిర్ద్వంద్వంగా, అదీ తీవ్ర నిర్బంధ పరిస్థితులు నెలకొనివున్నప్పటికీ, కోరుతున్నారు. మరి ఈ సమస్యకు పరిష్కారం అంటూ వున్నదా?

## కాశ్మీరు సమస్య పరిష్కారం సాధ్యమా?

మన దేశంలోని పాలక వర్గాలకు నిజమైన ఫెడరల్ స్వభావం వున్నదని చెబుతారు గాని మొదటినుంచీ యిక్కడ కేంద్రీకరణ పాలే ఎక్కువ. నానాటికీ మనది ఒక నిరంకుశ కేంద్రీకృత పాలనగా పరిణమిస్తూ వస్తున్నది. ప్రభుత్వాలేవి మారినా నిజమైన వికేంద్రీకరణ, ఫెడరల్ వ్యవస్థీకరణలు జరగడం లేదు. అమెరికా సంయుక్త రాష్ట్రాలు, స్విట్జర్లండు మొదలైన దేశాల్లోని ఫెడరల్ వ్యవస్థలతో మనల్ని పోల్చుకోనే లేము. నా ఉద్దేశ్యంలో కాశ్మీరు సమస్య అలా రగులుతూనే పోవడానికిగాని, పంజాబులో బీభత్సవాదం వెర్రితలలు వేయడానికిగాని, గూర్ఖాలలో, జార్ఖండ్ వాసుల్లో, తూర్పు భారతంలోని వివిధ గిరిజన తెగల్లో, ఒక విధంగా దేశంలోని పలు భాషా రాష్ట్రాల

ప్రజల్లో చీలిక ధోరణులు, వేర్పాటువాద తత్వాలు, అసంతృప్తి, ఆందోళనలు పెరగడానికి కాని ఈ ఫెడరల్ అంతర్భావన లోపం, వికేంద్రీకరణ లేములే ప్రధాన కారణం.

తర్వాత మనం గమనించాల్సిన మరో ముఖ్యమైన అంశం ఏమిటంటే సామ్రాజ్యవాదం ప్రధాన శత్రువుగా, దేశం పరతంత్రంగా వున్నప్పుడు దేశంలోని వివిధ భాషా, ప్రాంతీయ, మతపర వర్గాలు తమతమ సమస్యలు, ప్రయోజనాల్ని కొంతవరకు పక్కకు పెట్టి ఉమ్మడి పోరాటంలో బ్రిటిషు వ్యతిరేకత, ఐక్యత ప్రదర్శించగలిగారు. అప్పట్లో అఖిల భారత జాతీయ చైతన్యం ప్రముఖంగా, ఇతరేతర ప్రాంతీయ, భాషాపర ప్రజల ప్రత్యేక అస్తిత్వ, చైతన్యాలు ద్వితీయంగా, కేవలం ఉపజాతి చైతన్యాలుగా మాత్రమే ఉండేవి. కాని ఒకసారి దేశం స్వతంత్రమైన తర్వాత, కొన్ని సందర్భాల్లో స్వాతంత్ర్యం తప్పనిసరి అని తెలిసిపోయినప్పుడే, ఈ ఉపజాతి చైతన్యాలు మరింత ప్రాముఖ్యత సంతరించుకుని సంపూర్ణ జాతులుగా రూపొందాలనే చైతన్యాలకు దారి తీయసాగాయి. అలాంటి పరిస్థితుల్లో అధికార వికేంద్రీకరణ, ఫెడరల్ అంతర్భావనలతో ఆయా ఉపజాతి చైతన్యాలు, ఆకాంక్షలను సంతృప్తి పరచి వుంటే, దేశం ఈనాడున్నంత తీవ్రస్థాయిలో విచ్ఛిన్నకర, వేర్పాటువాద ప్రమాదాలను ఎదుర్కోవల్సివచ్చేదే కాదు.

సరే, జమ్మూ-కాశ్మీరు విషయం ఈ దృష్ట్యా చూచినా కొంత విలక్షణమైనదే. అది మొదటినుండీ ఒక అంతర్జాతీయ సమస్యయి కూచున్నదని, మనదేశంలో అభిన్న భాగమని మనమెంత గావుకేకలు వేసినా ప్రపంచంలో అధిక సంఖ్యాక దేశాలు మనతో ఏకీభవించడం లేదని మనం బాగా గ్రహించాలి. అలాగే యుద్ధం ద్వారా పాకిస్తాన్‌ను ఓడించి ఆక్రమిత కాశ్మీరును విముక్తి చేయగలమనుకోవడమూ భ్రమే అవుతుంది. 1965, 1971 యుద్ధాల్లో సైతం సాధించలేని పని నేడు కాశ్మీరులో ప్రజాభిప్రాయం మనకు బాగా వ్యతిరేకంగా వున్నప్పుడు సాధించగలమా? ఒకవేళ ఆ ధీమాతో యుద్ధానికి తలపడ్డా ప్రపంచంలోని అగ్రరాజ్యాలు, యితర దేశాలు చూస్తూ ఊరుకుంటాయా? కాశ్మీరు సమస్యపై, యితర ముఖ్య సంక్షోభ పరిస్థితుల్లో, మన తరపున వీటో ప్రయోగిస్తూ, సదా భద్రతా మండలిలో మనలను ఆదుకుంటూ వచ్చిన సోవియెట్ యూనియన్ నేడు లేదు. నేటి రష్యా ఒక మహాదరిద్రురాలి (superpauper) గా పరిణమించి అరాచక పెట్టుబడిదారీ పంథాలో పరుగులు తీస్తున్నది. ఒకప్పటి సోవియెట్ యూనియన్ విచ్ఛిన్నమై అక్కడ జాతుల మధ్య కలహాలు, యుద్ధాలు తీవ్రతరమైనాయి. నేటి రష్యా తన ఆర్థిక సంక్షోభం నుండి బయటపడడానికి అమెరికా, ఐరోపా ఆర్థిక సమాఖ్య, జపాన్ తదితర అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ రాజ్యాల మోచేతి నీళ్లకు అర్రులు చాస్తున్నది. అలాంటి దేశం నేడు కాశ్మీరు సమస్యపై మన కనుకూలంగా వీటో చేస్తుందా? చేయకపోగా, అమెరికాతో పొత్తు కలిసి మనల్నే గట్టిగా చీవాట్లు పెట్టవచ్చు కూడా. యుద్ధమే గనుక చెలరేగితే అది ఖచ్చితంగా ఐ.రా.స. జోక్యానికి, భద్రతా మండలి ఆదేశాల మేరకు ఐ.రా.స. శాంతి దళాల తరలింపుకే దారితీయగలదు. అందువల్ల నష్టం మనకేగాని, పాకిస్తాన్‌కు ఏ మాత్రం వుండదు.

పాకిస్తాన్ ప్రభుత్వంతో రహస్య మంతనాలాడి కాశ్మీరులో యిప్పుడున్న యుద్ధ విరమణ రేఖను అంతర్జాతీయ సరిహద్దుగా మార్చే ఒడంబడిక చేసుకునే వీలుంటే అది మనకు అత్యుత్తమ మార్గం కాగలదు. అప్పుడు ఉభయ దేశాలూ కలిసి ఐ.రా.స. వేదికనుండి కాశ్మీరు సమస్యను ఉపసంహరించుకోవచ్చు. అదే సమయంలో మన అధీనంలోని కాశ్మీరులో నిజమైన ప్రజాస్వామిక ఎన్నికలు జరిపించి, అధిక స్వయంప్రతిపత్తి ప్రసాదించి అక్కడ వేర్పాటువాద జ్వాలలు ప్రజ్వరిల్లకుండా జాగ్రత్త పడవచ్చేమో. కాని, దీనికి పాకిస్తాన్ సమ్మతిస్తుందా? కాశ్మీరీ తీవ్రవాద వర్గాలు, కాశ్మీరు ప్రజలు అంగీకరిస్తారా? అనుమానమే.

పోతే వివిధ రకాల జాతీయోన్మాదులు, వెర్రి దేశభక్తులు చేసే ప్రతిపాదన మరొకటి వుంది. 370వ అధికరణాన్ని రద్దు చేసి దేశంలోని ఇతర రాష్ట్రాల ప్రజలకు జమ్మూ-కాశ్మీరులో ఆస్తులు సముపార్జించుకోవడానికి వీలు కల్పించడం, యుద్ధ విరమణ రేఖ పొడవునా మాజీ సైనికుల కుటుంబాలు, యితర హిందూ ప్రజల వలసలు ఏర్పరచడం, ఈ విధంగా కాశ్మీరు లోయలో జనాభా అనుపాతాన్ని హిందువులకు అనుకూలంగా మార్చడం అవసరమనేదే ఈ ప్రతిపాదన. కాని ఈ మార్గం అవలంబిస్తే కాశ్మీరీ ముస్లింలు మొత్తంగా సాయుధ తిరుగుబాటు చేయడం, వారికి వత్తాసుగా పాకిస్తాన్ యుద్ధం ప్రకటించడం తథ్యం. యుద్ధం చెలరేగితే పైన హెచ్చరించిన పరిణామాలే జరుగుతాయి. మనమే నష్టపోతాము.

కనుక ఐ.రా.స. భద్రతా మండలి తీర్మానాలను గౌరవించి, వాటికి తలవొగ్గక తప్పదు. అయితే జమ్మూ-కాశ్మీరు అంతా ఒక ఏకఖండంగా భావిస్తూ కాక, ప్రాంతాలవారీగా ప్లెబిసైటు జరగాలని మనం పట్టుబట్టవచ్చు. దాని ప్రకారం మనకు జమ్మూ, లడఖ్‌లు దక్కిపోతాయి. పోతే కాశ్మీరు లోయ పాకిస్తాన్‌కు పోతుంది. పోతే పోనీండి. పెద్ద తలనొప్పి దిగిపోతుంది. కాశ్మీరు లోయలో మనం వేలకోట్ల రూపాయలు సైన్యానికని, అభివృద్ధి కార్యక్రమాలకని ఖర్చుపెడుతున్నాం. కాగా మనకు అక్కడనుండి వచ్చే ఆదాయం దాదాపు హుళక్కే. ఇంత ధనరాసుల్ని వృథాచేయడం, ఇన్ని వేల ప్రాణాలు కోల్పోవడం, అయినా తిట్లూ శాపనార్థాలు తినడం - ఈ పెంటంతా మనకెందుకు? దులుపుకుంటే పోలా! నా దృష్టిలో వృథా పరువు ప్రతిష్ఠలకు పాకులాడి, చివరకు ఘోర అవమానాల పాలు కావడం కంటే భావి లిఖితాన్ని చూచి, యిప్పటినుండే వివేకంగా, విజ్ఞతతో మెసులుకోవడమే మేలు. అలాగే దేశవ్యాప్తంగా రాష్ట్రాలకు, ప్రాంతాలకు మరిన్ని స్వయం పాలనాధికారాలు కట్టబెట్టడం, కేంద్రం పాత్రను రక్షణ, విదేశీ వ్యవహారాలు, సమాచార సంబంధాలు, ఫైనాన్సుల వరకే పరిమితం చేయడం ద్వారా దేశంలో యితరత్రా చెలరేగే వేర్పాటువాద, తీవ్రవాద వుద్యమాలను కూడా ఉపశమింప జేయవచ్చేమో.

★ ★ ★

# జమ్మూ-కాశ్మీరులో జనాభా మార్పులు

కాశ్మీరు అని సాధారణంగా పేర్కొనబడే జమ్మూ-కాశ్మీరు రాజ్యం భారత ఉపఖండంలో అన్నింటికంటె ఉత్తరంగా వుండే ప్రాంతం; భారతదేశ పటంలో యిది దేశానికి మకుటాయమానంగా అగుపిస్తుంది. స్వాతంత్ర్యానికి పూర్వం మహారాజా గులాబ్ సింగ్, ఆయన వారసుల పాలనలో ఏకఖండంగా వున్న ఈ రాజ్యం యిప్పుడు భారత్, పాకిస్తాన్, చైనాల పరిపాలనలో ఒక్కొక్క ముక్కగా మూడు ఖండాలై వున్నది. ఈ మూడు ఖండాలూ కలుపుకుని ఈ రాజ్యం మొత్తం విస్తీర్ణం 85,800 చదరపు మైళ్లు (2,22,236 చ.కి.మీ.); అంటే మన ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణం (2,75,068 చ.కి.మీ.) కంటే బాగా తక్కువే. అపూర్వ ప్రకృతి సౌందర్య వైభవంతో అత్యంత మనోహరంగా విలసిల్లే కాశ్మీరులోయ ఈ రాజ్యం మొత్తం వైశాల్యంలో సుమారు పదవ వంతు మాత్రమే వుంటుంది. ప్రపంచంలోనే అత్యంత సమున్నతమైన పర్వత శ్రేణుల వొడిలో యిమిడి 10 నుండి 18వేల అడుగుల ఎత్తుదాకా ఎగిసే పర్వతాల చుట్టు పరిధిలో వుండే ఈ లోయ ప్రపంచంలోనే అత్యంత విశాలమైన లోయ ప్రాంతమని చెప్పవచ్చు. ఈ కాశ్మీరు లోయ మొత్తం వైశాల్యం 8539 చదరపు మైళ్లు కాగా యిందులో 6121 చదరపు మైళ్ల (అంటే 18,853 చ.కి.మీ.) మేర 1948-49 నుండి భారతదేశ అధీనంలో వున్నది. మిగతా 2418 చ.మై. మేర, అంటే మొత్తం లోయ విస్తీర్ణంలో 28.32 శాతం వరకు, నేటికీ పాకిస్తాన్ ఆక్రమణలో వున్నది. రాష్ట్రమంతటికీ అతి చిన్న ప్రాంతమైనా అత్యధిక జన సాంద్రతగల ప్రాంతమిది. 1981 జనాభా లెక్కల ప్రకారం 31,34,904 మంది, అనగా రాష్ట్ర జనాభాలో 52.36 శాతం మంది, భారతదేశ అధీనంలోని కాశ్మీరు లోయలో నివసిస్తున్నారు. అంటే యిక్కడ జనసాంద్రత చ.కి.మీ.కు 198గా వున్నది; కాగా రాష్ట్రం మొత్తపు జనసాంద్రత చ.కి.మీ.కు 57 చొప్పున మాత్రమే వున్నదని గమనించాలి. రాకపోకలు బహు కష్టతరమై వుండే భౌగోళిక స్థితివల్ల, ఈ రాజ్యపాలకులు - హిందువులేగాని, మహమ్మదీయులేగాని - అవలంబిస్తూ వచ్చిన విదేశీయులంటే గిట్టని వైఖరి వల్ల శతాబ్దాలుగా ఈ ప్రాంతం (కాశ్మీరు లోయ) లో జనాభా సజాతీయత నిలకడగా కొనసాగుతూ వస్తున్నది. జనాభాలో అత్యధికులు (94.96శాతం) ముస్లింలే. జనాభాలో 89 శాతానికి పైగా కాశ్మీరీ మాతృభాషగా గలవారే. ఇక్కడేగాక జమ్మూ-కాశ్మీరు రాష్ట్రమంతటా కూడా ప్రజల ప్రధాన ఆధారం వ్యవసాయమే. ఈరాష్ట్రంలో ఖనిజ సంపద అంతస్థంగా మిక్కుటంగా వున్నా దాన్ని వెలికితీయడంమట్టుకు యింతవరకు బహుకొద్దే. కాశ్మీరులోయకు సంబంధించినంతవరకు పర్యటనా కలాపాలే (టూరిజం) ప్రధాన, లాభదాయక పరిశ్రమగా కనిపిస్తున్నది. జేబులో డబ్బులు

పుష్కలంగా వుంటే కొంతకాలం పాటు అక్కడి ప్రకృతి రమణీయకతను తిలకించి మురిసిపోతూ విలాసజీవనం గడపవచ్చేమోగాని, ఎవరైనా అక్కడ స్థిరపడి, సరిపడేంత జీవిక గడించుకోవాలంటే మాత్రం బహుగడ్డు పరిస్థితులే ఎదురవుతాయి. ఈ లోయను 1846లో అమృత్‌సర్ సంధి అనే లావాదేవీ ద్వారా మహారాజా గులాబ్‌సింగ్ (అప్పటి జమ్మూ రాజు) బ్రిటిషు ప్రభుత్వంవారి నుండి 75 లక్షల (నానక్‌షాహీ) రూపాయలకు కొనుక్కొన్నాడు. అంతేగాక బ్రిటిషు పాలకుల సర్వాధిపత్యాన్ని గుర్తిస్తూ వారికి ఏటా ఒక గుర్రం, మంచి నాణ్యమైన శాలువా ఉన్ని ప్రసాదించే పన్నెండు మేలు రకం మేకలు. (ఆరు మగవి, ఆరు ఆడవి), మూడు జతల కాశ్మీరు శాలువలు కానుకగా సమర్పించడానికి కూడ ఒడబడ్డాడు. ఇలా ఈ లోయను కొనుక్కొని ఆనక ఒకసారి లోయ మొత్తం తిరిగి చూచిన పిదప మాత్రం, 'అయ్యో! ఇందులో మూడోవంతు రాళ్లు (పర్వతాలు), మరో మూడో వంతు నీళ్లు, మిగతా మూడోవంతు విశేషాధికారాలుగల ముఖ్య వ్యక్తుల కైవసమై వున్నదే!' అని గొణుగుకొన్నాడట. ఈ సంగతి వెల్లడిస్తూ సుప్రసిద్ధ కాశ్మీరు గెజెట్ రచయిత వాల్టర్ ఆర్. లారెన్సు అసలు జమ్మూ-కాశ్మీరు రాజ్యాన్నంతా చూపించి అదంతా వట్టి రాళ్లు (పర్వతాలు) తప్ప మరేమీ కాదని గులాబ్‌సింగ్ వాపోయివున్నా సమంజసమేనని చమత్కరిస్తాడు. కనుక కాశ్మీరుచుట్టూ అల్లుకొనివున్న రమ్యమనోహర, ఆత్మిక సౌందర్యపర భ్రమలన్నింటినీ వదిలించుకొని చూస్తే మనకు అగుపించే కఠోర నిజస్వరూపం యిదేనని గ్రహించాలి.

ఈ రాజ్యం మొత్తం విస్తీర్ణంలో దాదాపు 84,112 చదరపు కిలోమీటర్ల మేర - జమ్మూలో బాగా పడమటి భాగం (మీర్‌పూర్ జిల్లా, పూంఛ్‌లో కొంత భాగం), కాశ్మీరులో కొంత భాగం (ముజఫరాబాద్), గిల్గిత్ ఏజెన్సీ యావత్తూ, హంజా-నాగిర్, లడఖ్ ఉత్తర భాగం (బాల్టిస్తాన్) - 1948 ఉండి పాకిస్తాన్ కబ్జాలోనే వున్నది. పోతే పాకిస్తాన్ దానివంతుకు 1963లో చైనాతో ఒక ఒప్పందం కుదుర్చుకుని తద్వారా తన అధీన భూభాగంలో బాగా ఉత్తరంవైపున్న సుమారు 2700 చదరపు మైళ్ల ప్రాంతాన్ని చైనాకు ధారపోసింది. ఇక లడఖ్‌లో 'లే'కు ఈశాన్యంగా వున్న అక్సాయ్‌చిన్ ప్రాంతం చిరకాలంగా చైనా కబ్జాలో వుంటూ వస్తూ, తుదకు 1962 భారత - చైనా సరిహద్దు యుద్ధం పర్యవసానంగా బాహాటంగా చైనా అధీనంలోకి వెళ్ళిపోయింది; దీని విస్తీర్ణం సుమారు 12,500 చదరపు మైళ్లు (32,375 చ.కి.మీ.) కనుక ఈ ప్రాంతాలన్నింటినీ మినహాయిస్తే యిక మొత్తం జమ్మూ-కాశ్మీరు రాజ్య భూభాగంలో 47.58 శాతం, అంటే సగం కంటే కాస్త తక్కువ, మాత్రమే యిప్పుడు మన దేశం అధీనంలో వున్నదని గుర్తెరగాలి.

మన అధీనంలోని జమ్మూ-కాశ్మీరు రాష్ట్రంలో 67,000 చ.కి.మీ. విస్తీర్ణంతో లడఖ్ అన్నింటికంటె అత్యంత విశాల ప్రాంతంగా వున్నది. రాష్ట్రంలో అతి తక్కువ జనసాంద్రత, చ.కి.మీ.కు కేవలం ఇద్దరు (2) వ్యక్తుల చొప్పున, గల ప్రాంతమూ యిదే. దక్షిణాన 'లే' జిల్లాలో బౌద్ధమతస్తులు ప్రధానంగా నివసిస్తుంటారు. వీరు మొత్తం లడఖ్ జనాభాలో 51శాతంగా వున్నారు. వారి తర్వాత 46 శాతంగా వున్న ముస్లింల జనాభా ప్రధానంగా ఉత్తరాన గల కార్గిల్ జిల్లాలో

కేంద్రీకృతమై వున్నది. ప్రపంచంలోనే అతి ఎత్తయిన నివాస ప్రాంతాలలో లడఖ్ ఒకటి. ఉత్తరాన కారకోరం పర్వతాలు, దక్షిణాన హిమాలయాలు ఆవరించివుండే ఈ ప్రాంతం సముద్ర మట్టానికి 11,000-17,000 అడుగుల ఎత్తున నెలకొని వుంటుంది. దీన్ని ఆవరించిన పర్వత శ్రేణుల్లోని కొన్ని సమున్నత శిఖరాలు 25,000 అడుగులు లేక అంతకు మించిన ఎత్తులకు కూడ ఎగసి వున్నాయి. నిజానికి భారతదేశమంతటిలోకీ అతి పెద్ద జిల్లా, దేశమంతటిలోకీ బౌద్ధమతస్తులు మెజారిటీగా గల ఏకైక ప్రాంతం ఈ లడఖేనని తెలుసుకోవాలి. 1934 దాకా ఈ లడఖ్ ప్రాంతం టిబెట్ సర్వాధిపత్యంలోని సామంత రాజ్యంగా వుండింది; దానివంతుకు టిబెట్‌కూడ అప్పట్లో చైనాకు సామంత రాజ్యంగా వుండేది. అప్పట్లో జమ్మూకు మాత్రమే రాజుగా వుండిన, సదా సాహసోన్ముఖుడైన గులాబ్ సింగ్ యీ లడఖ్ ప్రాంతాన్ని 1834లో టిబెటన్ల వద్ద నుండి గుంజుకొన్నాడు. అనంతరం 1846లో కాశ్మీరు లోయ, ఆ వెన్వెంటనే 1848 నాటికల్లా సరిహద్దు ప్రాంతాలు కొన్ని దక్కడంతో ఆయన వాటన్నిటినీ (జమ్మూ, కాశ్మీరు, లడఖ్ మూడు ప్రాంతాలనూ) కలగలిపి ఒకే పెద్ద రాజ్యానికి అధిపతై, తన్ను జమ్మూ-కాశ్మీరు నరేశుడుగానూ, టిబెట్ అది దేశాధిపతిగానూ వున్న శ్రీ మాన్ ఇంద్రమహేంద్ర రాజరాజేశ్వర మహారాజాధిరాజ శ్రీ గులాబ్ సింగ్‌జీగా అభివర్ణించుకుంటూ విరాజిల్లాడు. పోతే 1948 అక్టోబరులో సంభవించిన మహాసంక్షోభంమూలంగా మహారాజా హరిసింగ్ ఆదరాబాదరాగా భారతదేశంతో చేరిక దస్తావేజుపై చేవ్రాలు చేయడంతో అందుమూలంగా మనకీ లడఖ్ ప్రాంతంపై కబ్జా లభించింది. కాని నేటికీ యీ కబ్జా సైతం చైనాతో వివాదంలో వున్నదే. కనుక యిక్కడైనా మన మీ 'గడ్డి కూడ సరిగ్గా మొలవని' గడ్డు భూభాగం గురించి అంతగా విజయానంద మనస్కులం గాని, భావావేశపూరిత హృదయులంగాని కావల్సిన అవసరమేమీ లేదు.

ఈ రాష్ట్రంలో రెండవ పెద్ద ప్రాంతం జమ్మూ. ఇదే డోగ్రా పాలకుల అసలైన అధికార పీఠం. జమ్మూ పట్టణం నేటికీ ఈ రాష్ట్రపు చలికాలపు రాజధాని కూడ. డోగ్రా పాలకుడు గులాబ్ సింగ్ 1846 లో మాత్రమే కాశ్మీరును సంపాదించుకొన్నాడని మన మీ వరకే తెలుసుకొన్నాము. అవిభక్త జమ్మూ ప్రాంతం మొత్తం 12,378 చదరపు మైళ్ల (32,060 చ.కి.మీ.) విస్తీర్ణంతో, 1941లో 19,81,433 మంది జనాభాతో వుండింది. వీరిలో 61 శాతం మంది ముస్లింలు, మిగతా 39 శాతం మందిలో అత్యధిక భాగం హిందువులు, కొంత సిక్కులు (ఇంచుమించు 1.5 శాతం), అక్కడక్కడా కొంతమంది బౌద్ధులు, క్రైస్తవులు వుండేవారు. 1947 అక్టోబరునాటి మహాసంక్షోభం, తదనంతర భారత-పాకిస్తాన్ యుద్ధ పర్యవసానంగా మీర్‌పూర్ జిల్లా మొత్తంగానూ, పూంఛ్‌లో కొంత భాగం పాకిస్తాన్ కైవసమై పోయాయి. ఇక యిప్పుడు మనదేశ ఆధీనంలో 10,190 చ.మైళ్ల (26,395 చ.కి.మీ.) భూభాగం వున్నది. ఇప్పుడిక్కడే హిందువులే ఖచ్చితమైన మెజారిటీగా వున్నారు. 1981 జనాభా లెక్కల ప్రకారం యిక్కడి 27,18,113 మంది జనాభాలో 66.33 శాతం (అంటే మూడింట రెండు వంతులదాకా) హిందువులు, 7.69 శాతం మేర సిక్కులు వుండగా ముస్లింలు 29.60 శాతం మంది మాత్రమే వున్నారు.

అవిభక్త జమ్మూ-కాశ్మీరు మొత్తం జనాభా 1911లో 31,58,126 (హిందువులు-21.86శాతం, ముస్లింలు-75.94శాతం); 1921లో 33,20,518 (హిందువులు-20.23శాతం; ముస్లింలు - 76.75శాతం); 1941లో 40,21,616 (హిందువులు-20.12%; ముస్లింలు 77.11%)గా వుండినారు. 1947 మహాసంక్షోభం, తదనంతర భారత-పాకిస్తాన్ యుద్ధాల పర్యవసానంగా 1951లో యిక్కడ జనాభా సేకరణ జరగలేదు. భారత పరిపాలనలోని జమ్మూ-కాశ్మీరులో మొత్తం జనాభా 1961లో 35,60,976 (హిందువులు-28.45శాతం; ముస్లింలు-68.30శాతం); 1971లో 46,16,632 (హిందువులు 30.42శాతం; ము-65.85శాతం); 1981లో 59,87,389 (హిందువులు 32.24శాతం; ము-64.19 శాతం)గా వున్నది. మళ్లీ 'ఆజాదీ' కోసం పోరాడే కాశ్మీరీ తీవ్రవాదుల కార్యకలాపాలు, అందువల్ల రాష్ట్రంలో నెలకొన్న తీవ్రకల్లోల పరిస్థితుల మూలంగా 1991లో యిక్కడ జనాభా సేకరణ జరగలేదు. అయితే ఉజ్జాయింపు అంచనాల ప్రకారం 1991లో మనదేశ అధీనంలోని జమ్మూ-కాశ్మీరు మొత్తం జనాభా 77 లక్షలని, హిందువులు, ముస్లింల అనుపాతాలు యించుమించు 1981 సరళిలోనే వుండవచ్చునని తేలింది.

ఈ రాష్ట్ర జనాభాలో సగానికంటే కాస్త ఎక్కువగా కాశ్మీరు లోయలోనే నివసిస్తున్నారని, వారిలో ముస్లింలే అత్యధికులుగా-90 శాతంపైగా - వున్నారని యిదివరకే తెలుసుకున్నాము. మన రాజ్యాంగంలోని 370వ అధికరణం ఏ విషయంలో సరిగ్గా పనిచేసినా, చేయకున్నా కాశ్మీరు లోయలోని వివిధ మత వర్గాల జనాభా అనుపాతాల్ని స్థిరంగా కొనసాగించడంలో మట్టుకు అద్భుతంగా పనిచేసింది. పర్యవసానంగా లోయలోని ముస్లింల అనుపాతం 93-95శాతంగా, హిందువుల అనుపాతం 3-4 శాతంగా యిటీవలిదాకా స్థిరంగా కొనసాగుతూ వచ్చింది. కాని 1989 నుండి విజృంభించిన కాశ్మీరీ తీవ్రవాద గెరిల్లా పోరాటం మూలంగా యిక్కడి హిందువులు యించుమించు అందరూ కూడ ప్రాణభయంతో, దాదాపు కట్టుబట్టలతో, జమ్మూకో, ఢిల్లీకో, యితర ప్రాంతాలకో పలాయనం చిత్తగించడంతో, యిప్పుడు వారి జనాభా 1 శాతం కంటె కూడ తక్కువకు పడిపోయి వుండవచ్చని అంచనా. కాశ్మీరులోయలోని హిందువులు ప్రధానంగా కాశ్మీరీ పండిట్లే (బ్రాహ్మణులు). మనదేశ ప్రధానులైన జవహర్‌లాల్ నెహ్రూ, ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీల కుటుంబం ఈ కాశ్మీరీ పండిట్ల కులానికి చెందినదే. కాశ్మీరీ వీరి మాతృభాష. లోయలోని ముస్లింలలో కూడ 90శాతంకు పైగా కాశ్మీరీ మాతృభాషగా గలవారే. అయితే చిరకాలం నుండి (గులాబ్‌సింగ్ రోజులప్పటి నుండి కూడ) ఉర్దూయే అధికార భాషగా వుంటూ వస్తున్నది. రాష్ట్రంలో విద్యా బోధనకు ప్రధాన భాష కూడ యిదే. 1947-49 కాలపు మహా సంక్షోభంవల్లగాని, భారత-పాకిస్తాన్ యుద్ధాల వల్లగాని యిక్కడి జనాభా అనుపాతాలకు ఎలాంటి కుదుపు తగలక స్థిరంగా కొనసాగుతూ వస్తున్నా, యిప్పటి అరాచక పరిస్థితుల్లో యిక్కడి హిందు జనాభా దాదాపు మొత్తంగా వలస పోవల్సి రావడం మట్టుకు ఎంతో శోచనీయమే. భారత, పాకిస్తాన్‌ల నడుమ రావణాసుర కాష్టంలా రగులుతున్న ఘర్షణలో అసలు వివాదమంతా ముఖ్యంగా ఈ కాశ్మీరు లోయ గురించేనని మనం గ్రహించాలి.

పోతే కాశ్మీరు లోయలోని పరిస్థితికి విరుద్ధంగా జమ్మూలో మాత్రం 1948-81 కాలంలో ప్రాంతంలోనికి, వెలుపలికి జనాభా వలసలు గణనీయంగా సంభవించడం మనం గమనించగలం. ఈ ప్రాంతంలో పూంఛ్, కథువా, ఉధమ్‌పూర్, జమ్మూ, దోడా జిల్లాలు వున్నాయి. 1941లో అవిభక్త జమ్మూ ప్రాంత జనాభా 19,81,433 కాగా అందులో ముస్లింలు 61శాతం, హిందువులు, సిక్కులు, తదితరులు మిగతా 39 శాతంగా వుండినారని యింతకు మునుపే గమనించాము. అయితే యిప్పుడు భారత అధీనంలో వున్న జమ్మూ ప్రాంతం మేరకే తీసుకుని చూస్తే 1941లో ఈ భాగంలో మొత్తం 13,40,760 మంది నివసిస్తుండినట్లు, వారిలో ఇంచుమించు 50శాతం ముస్లింలుకాగా, హిందువులు, సిక్కులు, తదితరులు తతిమ్మా 50శాతంగా వుండినారని తేలుతున్నది. అయితే అదే 1961 జనాభా లెక్కల వద్దకు వచ్చేసరికి మనదేశ అధీనంలోని జమ్మూ ప్రాంతపు మొత్తం జనాభా 15,72,887 కాగా అందులో హిందువులు 58.72శాతం, సిక్కులు 2.94శాతం, అయితే, ముస్లింలు 38.05శాతంగా మాత్రమే వున్నారు. 1971 జనాభా లెక్కల ప్రకారం యిక్కడి మొత్తం జనాభా 20,75,640 మందిలో హిందువులు 62.06శాతం, సిక్కులు 3.70 శాతం, ముస్లింలు 33.80 శాతంగా వుండినారు. చివరి, అనగా 1981, జనాభా లెక్కల ప్రకారం మొత్తం జనాభా 27,18,113 కాగా అందులో హిందువులు 66.33 శాతం, సిక్కులు 3.69 శాతం, ముస్లింలు 29.60 శాతంగా వున్నారు. అంటే స్వాతంత్ర్యం వచ్చేదాకా (1947-48దాకా) ముస్లింలు మెజారిటీ ప్రాంతంగా వున్న జమ్మూలో జనాభా మార్పులు గణనీయంగా సంభవించి యిప్పుడది హిందూ మెజారిటీ ప్రాంతమయిపోవడం, ముస్లింలు మూడోవంతు కన్న తక్కువకు పడిపోవడం మనం గమనిస్తాము. జిల్లాలవారీగా చూస్తే 1981 జనాభా లెక్కల ప్రకారం పూంఛ్‌లో 71.38 శాతం మంది ముస్లింలు, 25.64శాతం హిందువులు, 2.94 శాతం సిక్కులు; దోడాలో 57.30 శాతం ముస్లింలు, 42.22 శాతం హిందువులు; ఉధంపూర్‌లో 72.20 శాతం హిందువులు, 26.23 శాతం ముస్లింలు, 1.27 శాతం సిక్కులు; కథువాలో 91.16 శాతం హిందువులు, 6.96 శాతం ముస్లింలు, 1.65 శాతం సిక్కులు; జమ్మూలో 87.37 శాతం హిందువులు, 7.64 శాతం సిక్కులు, కేవలం 4.27 శాతం ముస్లింలు వుండడం గమనిస్తాము. పూంఛ్, దోడా జిల్లాలు యిప్పటికీ ముస్లిం మెజారిటీ ప్రాంతాలుగా వున్నా అక్కడకూడ 1948 తర్వాత నుండి ముస్లింల అనుపాతం స్థిరంగా తగ్గుతూనే వచ్చిందని, యితర జిల్లాలలో కూడ అలాగే జరిగిందని గ్రహించాలి.

వీటన్నింటివల్ల మనం గ్రహించేదేమంటే ఒక పథకం ప్రకారమో లేక అనుద్దేశ్యపూర్వకంగానేనో మొత్తంమీద 1947-81కాలంలో జమ్మూ ప్రాంతంలో గణనీయమైన జనాభా వలసలు సంభవించాయి. ఈ ప్రాంతంనుండి గణనీయ సంఖ్యలో ముస్లింలు పాకిస్తాన్‌కు, యితర ప్రాంతాలకు వలస పోవడాన్ని, అలాగే ఇక్కడికి గణనీయ సంఖ్యలో హిందువులు, సిక్కులు వలసరావడానికి మన రాజ్యాంగంలోని 370వ అధికరణం ఏమాత్రం అడ్డుకాలేకపోయింది. కాగా కాశ్మీరు లోయలోమట్టుకు జనాభా అనుపాతాలు దాదాపు స్థిరంగా కొనసాగడం, కాని కాశ్మీరీ తీవ్రవాద గెరిల్లా వుద్యమం, దాని పర్యవసానాల మూలంగా అక్కడకూడ 1989 తర్వాత నుండి హిందువులు పెద్దయెత్తున బయటి

ప్రాంతాలకు వలస వెళ్లడం కూడ మనం గమనించాము. బహుశా కాశ్మీరులోయలో స్థానిక జనాభా సాంప్రదాయిక అస్తిత్వానికి, మత భద్రతకు ముప్పు లేనందువల్లే కాబోలు నేడు ఆ ప్రాంతంలో ప్రజలు సంఘటితంగా స్వయం నిర్ణయాధికారంకోసం పోరాడగల్గుతున్నారు కూడ. పోతే మన భారత ప్రభుత్వంవారు ఎన్నివేల కోట్ల రూపాయలు ధారవోసి కాశ్మీరీ ప్రజలను నయాన్నో, భయాన్నో దారిలో పెట్టజూచినా ఏమీ లాభం లేకపోతున్నది. ఇంతదాకా మనం అక్కడ ఖర్చుచేసిన అపారమొత్తాలను బట్టి చూస్తే అక్కడి భూభాగంలోని ప్రతి చదరపు గజానికి మనం 100 రూపాయలకు తక్కువ కాకుండా (కొందరైతే దీన్ని యింకా 2, 3 రెట్లు ఎక్కువ చేసి కూడ చెబుతారు!) వెచ్చించామని, కాని దానికి ప్రతిఫలం మన రొమ్ములపై ఎగదన్నే వేర్పాటువాద పోరాటమే అయిందని ఒక కఠోరమైన వ్యాఖ్య. నిజానికి ఒకవేళ 1947-48 ప్రాంతంలో కాశ్మీరులోయ పాకిస్తాన్‌కే సంక్రమించి వుంటే, బహుశా మనం పాకిస్తాన్‌కు నచ్చజెప్పి, యింతకన్నా ఎంతో తక్కువ మొత్తానికే ఆ లోయను కొనుక్కోగల్గి వుండే వాళ్లమేమో (అమెరికావాళ్లు రష్యానుండి అలాస్కాను కొనుక్కొన్నట్లు) ననే ఒక బలమైన, సహేతుకమైన అభిప్రాయం కూడ లేక పోలేదు. ఏమైనా ఈ నాలుగున్నర దశాబ్దాలకుపైగా మనం అవలంబించిన కాశ్మీరు విధానం (Kashmir policy), అక్కడ ప్రవాహంలా డబ్బులు ఖర్చుపెట్టడం, వరదలా నెత్తురు కారించడం, కార్చడం అంతా పరమ మూర్ఖత్వమే అయిందేమో, అందువల్ల మనం కాశ్మీరీల ద్వేషాన్ని, వైరాన్ని కొని తెచ్చుకోవడంతప్ప మరేమీ సాధించలేదేమోనని నేను గట్టిగా అభిప్రాయపడుతున్నాను.

★ ★ ★

# 'ఆజాదీ' కోసం కాశ్మీరీ ముస్లింల పోరాటం
## (ఒక సంగ్రహ కాలానుగత చారిత్రక వ్యాఖ్య)

జమ్మూ-కాశ్మీరు నైసర్గిక స్వరూపం, గణాంక వివరాలు, సాధారణ రాజకీయ చరిత్రలగురించి మన మింతవరకు కొంత తెలుసుకున్నాము. ఇప్పుడు ఈ రాష్ట్రపు ఇటీవలి రాజకీయ చరిత్రలో అతి ప్రధాన అంశం కాశ్మీరీ ముస్లింలు 'ఆజాదీ' కోసం చేసే పోరాటంగురించి మనమిక్కడ సంగ్రహంగా తెలుసుకుందాం.

### షేక్ అబ్దుల్లా మలిపాత్రః-

జమ్మూ-కాశ్మీర్‌లో ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో స్వేచ్ఛాయుత, నిష్పాక్షిక ప్లెబిసైటు జరిపించడంద్వారా ఆ రాజ్యం భారతయూనియన్‌లో చేరాలో లేక పాకిస్తాన్లో చేరాలో అంతిమంగా తేల్చివేయాలనే భద్రతామండలి తీర్మానాలకు భారత, పాకిస్తాన్‌లు ఉభయదేశాలూ ఆమోదం తెలిపి అందుకు కట్టుబడ్డాయని, కాని నెహ్రూ జమానాలోనే భారత ప్రభుత్వం ప్లెబిసైటు అనావశ్యకం, జమ్మూ-కాశ్మీర్ భారతదేశంలో విడదీయరాని అంతర్భాగం అనే వైఖరి వహించి తన అంతర్జాతీయ నిబద్ధతకు తిలోదకాలు యిచ్చేసిందని మనం గమనించాము. పోతే కాశ్మీర సింహంగా పేరుపొందిన షేక్ అబ్దుల్లా ఈ విషయమై గోడమీది పిల్లి వాటంగా వ్యవహరిస్తూవచ్చినా, భారతప్రభుత్వానికి పూర్తిగా జోహుకుం అనీ అనకుండా అప్పుడప్పుడూ కాశ్మీర్ స్వాతంత్రం కోసం కూడా పల్లిగ్గానే కలలు కంటూండంతో కేంద్ర ప్రభుత్వం షేక్ అబ్దుల్లానుసైతం చిరకాలంపాటు నిర్బంధించి వుంచినదనీ తెలుసుకున్నాము. తుదకు 1968లో అబ్దుల్లా విడుదలయినా వెంటనే ఆయనకు అధికార రాజకీయాల్లో ఏ స్థానం లభించలేదు. ఆయన సన్నిహిత సహచరుడు మీర్జా అఫ్జల్ బేగ్ నాయకత్వంలోని ప్లెబిసైట్ ఫ్రంట్ మట్టుకు కార్యకలాపాలు కొనసాగించుతూనే వచ్చింది. పర్యవసానంగా కాశ్మీరులో అధికారపీఠంపై షేక్ అబ్దుల్లాకున్న జనాదరణమాత్రం తగ్గకుండా కొనసాగుతూ వచ్చింది. 1971 భారత-పాకిస్తాన్ యుద్ధం, భారత సైనిక జోక్యంవల్ల బంగ్లాదేశ్ ఏర్పాటు, పాకిస్తాన్ ముక్కలుగావించబడడం, వగైరా పరిణామాలవల్ల ఉపఖండంలో భారతదేశమే తిరుగులేని ప్రధాన రాజకీయ, సైనిక శక్తిగా నిర్ధారణ అయింది. తదనంతరం 1972 జూలై 2వ తేదీనాడు భారతప్రధాని ఇందిరా గాంధీ, అప్పటి పాకిస్తాన్ ప్రధాని జుల్ఫికర్ ఆలీ భుట్టోలు చరిత్రాత్మక సిమ్లా ఒప్పందం కుదుర్చుకున్నారు. జమ్మూ-కాశ్మీరులోని యుద్ధ విరమణ రేఖను

అసలు అదుపు గీత (Line of Actual Control ) గా గుర్తించి వ్యవహరించడానికి, బలప్రయోగానికి ఏ పక్షం తలపడకుండా వుండడానికి, జమ్మూ-కాశ్మీర్ సమస్య అంతిమ పరిష్కారంకోసం శాంతియుతంగా ప్రయత్నించడానికి నిర్ణయించారు. అయినా కాశ్మీరు ప్రజల హృదయాల్లోని స్వాతంత్ర్యం, స్వయం నిర్ణయాధికారాల అభిలాషమాత్రం తగ్గలేదు. ఈ పరిస్థితుల్లో భారతప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ తన స్వప్రయోజనాల నాశించి 1975లో షేక్ అబ్దుల్లాతో ఒక ఆరు అంశాల ఒప్పందం కుదుర్చుకున్నది. జమ్మూ-కాశ్మీరు భారతదేశంలో అంతర్భాగమని, కాని దానికి ప్రత్యేక ప్రతిపత్తినిచ్చే రాజ్యాంగపు 370వ అధికరణం నిరవధికంగా కొనసాగుతుందని ఈ ఒప్పందంలో పేర్కొనబడింది. కాంగ్రెసు మద్దతుతో మళ్లీ అధికారంలోకి వచ్చిన షేక్ అబ్దుల్లా 1975 జులైలో జమ్మూ-కాశ్మీర్ జాతీయ సదస్సు (నేషనల్ కాన్ఫరెన్సు) ను పునరుద్ధరించాడు. అందువల్ల కాశ్మీరీ ప్రజల స్వయం నిర్ణయాధికార ఆశయానికి ప్రత్యేకించి ఏ తోడ్పాటూ లభించకపోయినా ముఖ్యమంత్రిగా అయిన జనాదరణగల నాయకుడు రాష్ట్ర స్వయంప్రతిపత్తిని నొక్కిచెప్పే వైఖరులు కొన్ని అవలంబించడం జరిగింది. ముఖ్యంగా 1975-77 ఆంతరంగిక ఎమర్జెన్సీ కాలంలో షేక్ అబ్దుల్లా ధైర్యంగా నిలిచి, జమ్మూ-కాశ్మీర్‌లో పౌరహక్కుల అణచివేతకు ఏ మాత్రం సమ్మతించకపోవడం గమనార్హం. అదే సమయంలో మిర్వైజ్ (ప్రధాన మతగురువు) మౌల్వీ మహమ్మద్ ఫరూఖ్ నాయకత్వంలోని ప్రజాకార్యాచరణకమిటీ (అవామీ యాక్షన్ కమిటీ) షేక్ అబ్దుల్లా లొంగుబాటుతత్వాన్ని అవినితి, బంధుప్రీతి, ఆశ్రిత పక్షపాతాలను ఎండగట్టుతూ కాశ్మీరు ప్రజలు స్వయం నిర్ణయాధికారం సాధించుకోవాలని, పాకిస్తాన్‌లో చేరాలని ప్రచారంచేస్తూ, క్రమంగా జనాదరణ పెంచుకోసాగింది. షేక్ అబ్దుల్లా, ఇందిరాగాంధీలనడుమ సయోధ్యసైతం ఎంతోకాలం నిలవలేదు. షేక్ అబ్దుల్లా నిరంకుశంగా వర్తించి నేషనల్ కాన్ఫరెన్సుకు కాంగ్రెసుకు నడుమనున్న ఎన్నికల పొత్తును భగ్నంచేసే చర్యలు చేపట్టాడనే ఆరోపణతో జమ్మూ-కాశ్మీరు రాష్ట్ర కాంగ్రెసు(ఐ) పార్టీ 1977 మార్చి 25నాడు అబ్దుల్లాకు తనమద్దతు ఉపసంహరించుకున్నది. ఆ మరునాడే అబ్దుల్లా మంత్రివర్గంలోని ఆరుగురు మంత్రులు రాజీనామా చేయడంతో అప్పటి రాష్ట్ర అసెంబ్లీలో కేవలం ముగ్గురు మద్దతుదారులుమాత్రమేగల అబ్దుల్లాకు రాజీనామా చేయకతప్పలేదు. కాని రాజీనామాతోబాటుగా రాష్ట్ర అసెంబ్లీని రద్దుచేయాలనికూడా గవర్నరు ఎల్. కె. ఝా కు సలహాయివ్వడంతో, కాశ్మీరు రాజ్యాంగ నిబంధనల ప్రకారం గవర్నర్ విధిగా ముఖ్యమంత్రి సలహాను పాటించాల్సి వుండడం వల్ల, తాము మంత్రి వర్గం ఏర్పాటు చేయగలమని అనేకమంది శాసన సభ్యుల మద్దతు చూపుతూ రాష్ట్ర కాంగ్రెసు (ఐ) అధ్యక్షుడు ముఫ్తీ మహమ్మద్ సయీద్ ముందుకు వచ్చినా ఆ ప్రతిపాదనలను తోసిరాజని యల్.కె.ఝా జమ్మూ-కాశ్మీరు అసెంబ్లీని రద్దుచేసి అక్కడ గవర్నరు పాలన విధించాడు. ఆనక కొంతకాలానికి జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో షేక్ అబ్దుల్లా నాయకత్వంలోని జాతీయ కాన్ఫరెన్సు ఘనవిజయం సాధించింది. ఎన్నికల ప్రచారం సందర్భంగా షేక్ అబ్దుల్లా కొన్నిసార్లు " కాశ్మీరుకు భారతదేశంలో స్వయంప్రతిపత్తి సునిశ్చయం గావించకపోతే మేము విడిపోవడానికికూడా సంకోచించం " అంటూ హెచ్చరికలు విసరడం గమనిస్తే

ఆయన తనలోని కాశ్మీరీ స్వాతంత్రాభిలాష చివరిదాకా కూడా పూర్తిగా అణచి వేసుకోలేక పోయాడని స్పష్టమవుతుంది.మరో ఐదేళ్ల పర్యంతం జమ్మూ - కాశ్మీరును అవిచ్ఛిన్నంగా పరిపాలించి, తాను బతికుండగానే తన కుమారుడు డాక్టర్ ఫరూఖ్ అబ్దుల్లాను జమ్మూ-కాశ్మీరు నేషనల్ కాన్ఫరెన్స్‌కు అధ్యక్షుడిగా చేయడమేగాక తనకు రాజకీయ వారసునిగా కూడా పేర్కొన్న పిదప, 77ఏళ్ళ వయస్సులో షేక్ అబ్దుల్లా 1982 సెప్టెంబర్ 8వ తేదీనాడు శ్రీనగర్‌లో కన్నుమూశాడు. ఆయన స్మృతికి గౌరవ సూచకంగా భారత ప్రభుత్వం రెండు రోజులు సంతాప దినాలు ప్రకటించడమేకాక, ఆయన అంత్యక్రియలకు రాష్ట్రపతి జైల్ సింగ్, ప్రధాని ఇందిరాగాంధి, అనేకమంది కేంద్ర మంత్రులు, యింకా పలువురు ప్రముఖులు హాజరయ్యారుకూడా. ఆనక 1982 సెప్టెంబరు 12వ తేదీనాడు డాక్టరు ఫరూక్ అబ్దుల్లా 11మంది సభ్యులుగల మంత్రివర్గం ఏర్పాటు చేశాడు. కాని పూర్తిగా రెండేళ్లు గడవకముందే కొన్ని అనూహ్య పరిణామాలు సంభవించడంవల్ల ఫరూఖ్ అబ్దుల్లా అర్ధంతరంగా గద్దె దిగవల్సివచ్చింది.

## భుట్టో ఉరితీతప్పటి నుండి బ్లూ స్టార్ ఆపరేషన్ దాకా:-

అసలు షేక్ అబ్దుల్లా బతికుండగానే జమ్మూ-కాశ్మీరు రాజకీయాల్లో కొన్ని సంచలనాత్మక పరిణామాలు సంభవించాయి. 1979 ఏప్రిల్ 4వ తేదీనాడు తెల్లవారుజాము 2 గంటలకు పాకిస్తాన్ మాజీ ప్రధాని జుల్ఫికర్ ఆలీ భుట్టోను జియా ఉల్ హక్ ఆధ్వర్యంలోని సైనిక ప్రభుత్వం నిర్దాక్షిణ్యంగా, ప్రపంచ ప్రజల, వివిధ దేశాల ప్రభుత్వాలు, ప్రముఖుల విజ్ఞప్తుల్ని ఖాతరు చేయకుండా, ఉరి తీసింది. ఈ దుర్ఘటనలపట్ల పాకిస్తాన్‌లోనేగాక, మన జమ్మూ-కాశ్మీరులోకూడా విస్తృతంగా నిరసన ప్రదర్శనలు చెలరేగాయి. ఆగ్రహావేశపూరితులైన ప్రజానీకం " జియా ముర్దాబాద్" నినాదాలతో శ్రీనగరులోనూ, యితర కాశ్మీరు పట్టణాల్లోనూ నిరసన ప్రదర్శనలు జరిపారు. పలుచోట్ల జమాతే ఇస్లామి సంస్థ ఆఫీసులపై దాడులు చేసి, కొన్నింటిని పూర్తిగా ధ్వంసం చేశారు. అక్కడక్కడ పోలీసు కాల్పులుకూడా జరిగాయి. కాశ్మీరీ ప్రజల మనస్తత్వం పాకిస్తానీ రాజకీయాలతో ఎంత సన్నిహితంగా ముడివడివుందో ఈ పరిణామాలు స్పష్టం చేస్తాయి. పోతే 1980 ఆగష్టులో జమాతే ఇస్లామి ఆధ్వర్యంలో ఆగ్రహావేశపూరితులైన ముస్లిం ప్రదర్శకులు శ్రీనగర్‌లో పలు హిందూ కుటుంబాలపై, పోలీసు స్టేషన్లపై దాడులు చేయడం, పర్యవసానంగా జరిగిన పోలీసు కాల్పుల్లో ఐదుగురు మృతిచెందడం మరొక ముఖ్యపరిణామం. అదే నెల 5వ తేదీనాడు "భారత దేశ చట్టవిరుద్ధ ఆక్రమణ నుండి, దాస్యబంధనాలనుండి కాశ్మీరును విముక్తి చేయడానికి ఇరాన్ తరహా విప్లవం" తీసుకొనిరావల్సిందిగా జమాత్-ఇ-తుల్బా (జమాతే ఇస్లామియొక్క విద్యార్థి సంఘం) పిలుపిస్తూ, ఆగష్టు 22వ తేదీన శ్రీనగర్‌లో ఈ లక్ష్యంతో ఒక అంతర్జాతీయ మహమ్మదీయ యువజన సదస్సు నిర్వహించబోతున్నట్లు ప్రకటన చేసింది. కాని రాష్ట్రప్రభుత్వం వెంటనే మేల్కొని జమాత్-ఇ-తుల్బా అధ్యక్షుడు షేక్ తజామల్ ఇస్లాంను అరెష్టుచేసి, జరగనున్న ఆ అంతర్జాతీయ సదస్సును నిషేధించింది. లోయలో నెలకొన్న ఉద్రిక్తపరిస్థితుల దృష్ట్యా

బహిరంగసభలన్నింటిని ఒక నెల రోజులపాటు నిషేధించడమేకాక మతవర్గాల నడుమ కలహాలు రేపడం శిక్షార్హ (4 సంవత్సరాల కఠిన కారాగారవాస శిక్షదాకా విధించబడగల) నేరంగా ప్రకటిస్తూ ఒక ఆర్డినెన్సు జారీచేసిందికూడా. ఆనక యీ మత వైమనస్య పరిస్థితి ఫరూఖ్ అబ్దుల్లా పాలనలో కూడా కొనసాగింది. డాక్టర్ ఫరూఖ్ అబ్దుల్లా అధికారంలోకి వచ్చిన కొన్ని నెలలకే రాష్ట్రంలోని రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ (R.S.S) ను, ముస్లిం మతతత్వవాద రాష్ట్ర ముస్లిం లీగును, అలాగే వేర్పాటువాద లిబరేషన్ ఫ్రంట్ను కూడా నిషేధిస్తూ 1983 జనవరి 22నాడు ఒక ఆర్డినెన్సు జారీచేసింది. పోతే ఆ కాలంలోనే పక్కనేవున్న పంజాబులో అకాలీల ఆందోళన ఉధృతరూపం దాల్చి, అక్కడ భింద్రన్‌వాలా మురా నాయకత్వాన తీవ్రవాద, వేర్పాటువాద, అరాచక ధోరణులు ప్రబలడం, స్వర్ణమందిరాన్ని తీవ్రవాదులు కైవసం చేసుకొనడం, ఆ రాష్ట్రమంతటా అనిశ్చిత, అరాచక, బీభత్సవాద పరిస్థితులు అలముకోవడం జరిగింది. ఈ అవాంఛనీయ పరిణామాల పర్యవసానంగా తుదకు 1983 జూన్ 1-6 తేదీల నడుమ "ఆపరేషన్ బ్లూ స్టార్" పేరిట స్వర్ణమందిరంపై సైనికచర్య సంభవించింది. ఆ చర్యలో వందలాది ప్రాణాలు కోల్పోవడం, భింద్రన్‌వాలా, యితర తీవ్రవాద ప్రముఖులు పోరాటంలో అసువులు కోల్పోవడం, అకాల్ తఖ్త్ దాదాపు పూర్తిగా ధ్వంసంకావడం, స్వర్ణమందిరం రక్తం, కన్నీళ్లతో 'అపవిత్రం' కావడం జరిగింది. ఇది దేశవ్యాప్తంగా సిక్కుల మనోభావాలను దెబ్బతీసింది. దేశవ్యాప్తంగా సిక్కుల నిరసన ప్రదర్శనలు, కొన్నిచోట్ల మత కలహాలు, రెండు మూడు కాంటన్‌మెంట్లలో సిక్కు సైనికుల తిరుగుబాట్లు కూడ సంభవించాయి. బాగా దెబ్బతిన్న సిక్కుల మనోభావాలకు ప్రతీకగా, పగబట్టిన సిక్కు తీవ్రవాదులు ప్రధాని ఆంతరంగిక భద్రతా సిబ్బందినే రహస్యంగా కూడగట్టుకున్న ఫలితంగా 1984 అక్టోబరు 31నాడు ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీని ఆమె అంగరక్షక బలగంలోని యిద్దరు సిక్కులు కాల్చిచంపడం, పర్యవసానంగా దేశం యావత్తూ అతలాకుతలం కావడంకూడ మనకు తెలిసిందే. సరే, " ఆపరేషన్ బ్లూ స్టార్" కు నిరసనగా 1983 జూన్‌లోనే జమ్మూ-కాశ్మీర్‌లో కూడ సిక్కుల ప్రదర్శనలు, శ్రీనగరులోనైతే ప్రత్యర్థి నిరంకారీ వర్గాలతో సిక్కుల వీధి పోరాటాలు, అందువల్ల ఏడుగురి మృతి కూడ సంభవించాయి. ఆనక 1983 అక్టోబరు 13వ తేదీనాడు జమాత్-ఇ-తుల్బా ప్రదర్శకులు భారత వ్యతిరేక నినాదాలు చేస్తూ మైదానంలోకి రాళ్లు గట్రా విసురుతూ అక్కడ జరుగుతున్న భారత-వెస్ట్ ఇండీస్ క్రికెట్ టెస్టు మ్యాచ్‌ను విచ్ఛిన్నం చేయడం కూడ ఒక ముఖ్య పరిణామమేనని చెప్పాలి. ఇప్పుడు కాశ్మీరీ 'ఆజాదీ' రాజకీయాల్లో ఒక ప్రముఖ నాయకునిగా వెలుగొందుతున్న షబ్బీర్ షా ఈ విచ్ఛిన్నకాండలో చురుగ్గా పాల్గొని తీవ్రవాద వర్గాల్లో బాగా పేరు తెచ్చుకొన్నాడనికూడ గమనించాలి. కాశ్మీర్‌లోని భారత వ్యతిరేకత కట్టలు తెంచుకుని పారిన ఈ ఘటన ప్రాముఖ్యాన్ని తక్కువ అంచనావేయరాదు.

## మగ్బూల్ భట్ అమరత్వం:-

ఫరూఖ్ అబ్దుల్లా అవినీతికర, నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా 1984 జనవరిలో జమ్మూ-కాశ్మీరు రాష్ట్ర కాంగ్రెసు(ఐ) పార్టీ వుద్యమం చేపట్టింది. ఆందోళన తీవ్రతరం కావడంతో 1984

జనవరి 14వ తేదీనాడు ప్రదర్శకులు, పోలీసుల నడుమ ఘర్షణల్లో 9 మంది ఇందిరా కాంగ్రెసు కార్యకర్తలు మృతిచెందారు. అదే సంవత్సరం ఫిబ్రవరి 3 వ తేదీనాడు కాశ్మీరు లిబరేషన్ ఆర్మీ అని చెప్పుకునే ఒక సంస్థకు చెందిన కొందరు సాయుధులు బర్మింగ్‌హాం, బ్రిటన్, లో అక్కడి భారత అసిస్టెంటు హైకమిషనర్ రవీంద్ర మాత్రేను అపహరించుకుపోవడం ఒక ముఖ్య ఘటన. 10లక్షల పౌండ్ల విడుపు మొత్తం యివ్వాలని, అంతేగాక మరణశిక్షకు గురై తిహార్ జైలులో నిర్బంధింపబడి 'నేడో రేపో' ఉరితీయబడనున్న జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (J.K.L.F.) అధ్యక్షుడు మగ్బూల్ భట్‌ను, మరి కొందరు కాశ్మీరీ ఖైదీలను భారతదేశపు జైళ్లనుండి విడుదలచేయాలని కూడా అపహర్తలు డిమాండు చేశారు. కాని తాము పెట్టిన గడువులోపల తమ డిమాండు తీరకపోవడంతో వారు మాత్రేను చంపివేశారు. ఆనక భారత ప్రభుత్వంకూడా ఫిబ్రవరి 11వ తేదీనాడు తిహార్ జైలులో మగ్బూల్ భట్‌ను ఉరి తీసివేసింది. జమ్మూ-కాశ్మీరు లిబరేషన్ ఫ్రంట్ అధ్యక్షుడైన మగ్బూల్ భట్‌ను మొదట ఒక పోలీసును హత్యచేసిన నేరానికి గాను 1966లో అరెస్టుచేసి, విచారణ జరిపి, ఉరిశిక్ష విధించారు. కాని ఆయన జైలునుండి తప్పుకుని 1968లో పాకిస్తాన్ పారిపోయాడు. కాని కొన్నేళ్లకు మళ్లీ భారతీయ కాశ్మీరులో ప్రవేశించి (J.K.L.F.) కార్యకలాపాలు కొనసాగిస్తూ 1976లో ఒక బ్యాంకు దోపిడీ క్రమంలో పట్టుబడ్డాడు. అప్పటినుండీ తిహార్ జైలులో మగ్గుతూ తుదకు ఆయన విడుదలకోసం జరిగిన బర్మింగ్‌హాం అపహరణ తతంగం బెడిసికొట్టడంతో 1984 ఫిబ్రవరి 11వ తేదీనాడు ఉరితీయబడ్డాడు. మగ్బూల్ భట్ అమరత్వం కాశ్మీరు ప్రజలకెంతో మనస్తాపాన్ని కలిగించడమేకాక ఏనాటికైనా స్వయంనిర్ణయాధికారం సాధించుకోవాలనే బలమైన ప్రేరణ కలిగించి అందుకుగాను వారి మనోనిశ్చయాన్ని దృఢతరంగావించింది.

## ఫరూఖ్ అబ్దుల్లా ప్రభుత్వం పతనం:-

కేంద్రంలోని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వం 1984 మార్చి 26న ఉదారమనస్కుడుగా పేరు పొందిన జమ్మూ-కాశ్మీరు గవర్నరు బి.కె. నెహ్రూను పదవినుండి తొలగించింది. ఆయనస్థానే కఠినాత్ముడని పేరుమోసిన జగ్ మోహన్‌ను గవర్నరుగా నియమించింది. అంతవరకు ముఖ్యమంత్రి, గవర్నర్ల నడుమ నెలకొనివున్న సయోధ్య వెంటనే చెడి రాష్ట్ర రాజకీయాలు అతలాకుతలం కాసాగాయి. 1984 మే 23 నాడు జమ్మూ-కాశ్మీరు నేషనల్ కాన్ఫరెన్సుచీలిపోయింది; చీలికవర్గం డాక్టర్ ఫరూఖ్ అబ్దుల్లాను అధ్యక్షపదవినుండి తొలగించి, కాన్ఫరెన్సునుండి కూడ బహిష్కరించింది. డా॥ అబ్దుల్లా సోదరి, జి.ఎం.షా భార్య అయిన శ్రీమతి ఖలేదా షాను నేషనల్ కాన్ఫరెన్సు (చీలికవర్గం) అధ్యక్షురాలిగా ప్రకటించడం జరిగింది. షేక్ అబ్దుల్లా బతికివుండగానే తన కుమారుడు ఫరూఖ్ అబ్దుల్లాను జమ్మూ-కాశ్మీరు నేషనల్ కాన్ఫరెన్సుకు అధ్యక్షునిగా (1981 ఆగస్టులో) చేసివున్న సంగతి మనం ఈ వరకే గమనించాముగదా. సరే మరో నెలపైగా గడిచిన పిదప 1984 జూలై 2వ తేదీనాడు జాతీయ కాన్ఫరెన్సుకు చెందిన 12మంది, స్వతంత్రుడు ఒకరు వెరసి 13మంది శాసన సభ్యులు ఫరూఖ్ అబ్దుల్లా ప్రభుత్వానికి తమ మద్దతు ఉపసంహరించుకున్నారు. గులాం అహమ్మద్ షా

నాయకత్వానికి మద్దతు ప్రకటించారు. ఇంకా అసెంబ్లీలోని 26గురు సభ్యుల కాంగ్రెసు(ఐ) బృందంకూడ జి.యం.షా కు మద్దతు నివ్వడంతో ఫరూఖ్ అబ్దుల్లా శాసనసభలో మెజారిటీ కోల్పోయాడు. దానితో అబ్దుల్లా మంత్రివర్గాన్ని తక్షణం రద్దుచేసి, నూతన మంత్రివర్గం ఏర్పాటుకు తనను ఆహ్వానించవల్సిందిగా గవర్నరును జి.ఎం.షా కోరాడు. కాని డాక్టర్ అబ్దుల్లా రాజీనామా చేయ నిరాకరించి అసెంబ్లీని వెంటనే సమావేశపరచి శాసనసభలోనే బలాబలాల పరీక్ష (విశ్వాస తీర్మానం ద్వారా) జరిపించవల్సిందిగా లేని పక్షంతో అసెంబ్లీనే రద్దుచేసి తిరిగి ఎన్నికలు జరిపించవల్సిందిగా గవర్నరును కోరాడు. అయితే వచ్చినప్పటినుండీకూడ అబ్దుల్లాకు పక్కలో బల్లెంలా వున్న జగ్‌మోహన్ నిరంకుశంగా అబ్దుల్లా మంత్రివర్గాన్ని బర్తరఫ్ చేసి, కొత్త ముఖ్యమంత్రిగా జి.యమ్.షా చే ప్రమాణ స్వీకారం చేయించాడు. ఈ పరిణామాల వెనుక ఇందిరా గాంధీ దుష్టహస్తం వుందని ఆరోపిస్తూ ఫరూఖ్ అబ్దుల్లా యిందుకు నిరసనగా జనాందోళన జరపవల్సిందిగా జమ్మూ-కాశ్మీరు ప్రజలకు పిలుపిచ్చాడు. కాని చెదురుగా నిరసన ప్రదర్శనలు జరగడం తప్పితే ఆయన పిలుపుకు తగు ప్రతిస్పందన లభించలేదు. తుదకు 1984 జులై 31వ తేదీనాడు జి.య.మ్.షా శాసన సభలో విశ్వాసపరీక్షలో నెగ్గి తన బలం నిరూపించుకోవడంతో అబ్దుల్లా అధ్యాయం అప్పటికి ముగిసినట్లయింది.

## జి.ఎం. షా పాలనః-

1985 అంతా జి.ఎం. షా పాలన పెద్ద అవాంతరాలు లేకుండా సాగినా, అవినీతి, నిరంకుశత్వం, యితర అధికారరోగాలు మాత్రం (ఏపార్టీ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం అన్నట్లు) బాగా ప్రబలిపోయాయి. పోతే 1986లో బాబ్రీమసీదు తాళాలు తెరిచి అక్కడ హిందూదేవుళ్ల విగ్రహాల ఆరాధనను అనుమతించాలని అయోధ్య జిల్లాకోర్టు ఫిబ్రవరి 1వ తేదీనాడు అర్ధంతర ఉత్తరువు యివ్వడంతో దేశంలో అనేకచోట్ల ఒక మోతాదుగా ముస్లింల నిరసన ప్రదర్శనలు జరగ్గా, జమ్మూ-కాశ్మీరులో మాత్రం ఎంతో హింసాయుతంగా నిరసన ప్రదర్శనలు చెలరేగాయి. రాష్ట్రమంతటా ముస్లిం మతతత్వవాదులు వీరవిహారం చేశారు. జమ్మూవంటి కొన్ని పట్టణాల్లో హిందువులతో తీవ్ర ఘర్షణలు జరిగాయి కూడ. విషమిస్తున్న శాంతి భద్రతల పరిస్థితిని అదుపులో పెట్టడానికి కాశ్మీరు లోయ అంతటానూ, యితర అనేక ప్రాంతాల్లోనూ కర్ఫ్యూ విధించక తప్పలేదు. ఈ గొడవలను అణచివేయడానికి కఠినంగా సకాలంలో తగు వ్యవహారం చేయలేదనే తీవ్ర ఆరోపణలకు షా ప్రభుత్వం గురయింది. ప్రభుత్వంవట్ల అసంతృప్తి పెచ్చరిల్లి రాష్ట్ర అసెంబ్లీలోని 26మంది కాంగ్రెసు (ఐ) శాసన సభ్యులు మార్చి 6వ తేదీనాడు ప్రభుత్వానికి తమ మద్దతు ఉపసంహరించుకోవడంతో మార్చి 7 తేదీనాడు షా ప్రభుత్వ పతనం తప్పలేదు. షా రాజీనామా చేయడం, తక్షణమే గవర్నరు జగ్‌మోహన్ శాసనసభను సజీవసమాధిలో వుంచుతూ గవర్నరు పాలన విధించడం మార్చి 7నాడు జరిగిపోయాయి. తదుపరి ఒక వారం రోజుల్లోపల శాంతి భద్రతల పరిస్థితులు మెరుగవడంతో 1986 మార్చి 13 కల్లా జమ్మూ-కాశ్మీరు అంతటా కర్ఫ్యూ ఎత్తివేశారు.

## 1987 ఎన్నికలు :-

గవర్నరు పాలన అవధి 6 నెలలకు మించి వుండరాదని కాశ్మీరు రాజ్యాంగం నిర్దేశిస్తున్నది. కనుక 1986 సెప్టెంబరు 7న అక్కడ గవర్నరు పాలన తొలగించి రాష్ట్రపతిపాలన విధించాల్సివచ్చింది. అయితే ఈ మధ్యకాలంలో ఫరూఖ్ అబ్దుల్లా నాయకత్వంలోని నేషనల్ కాన్ఫరెన్సు, రాజీవ్‌గాంధీ నాయకత్వంలోని ఇందిరా కాంగ్రెసుల నడుమ మళ్లీ సయోధ్యాప్రయత్నాలు, చర్చలు జరుగుతూ వచ్చాయి. ఫలితంగా 1986 నవంబరు 2వ తేదీనాడు మళ్లీ నేషనల్ కాన్ఫరెన్సు, కాంగ్రెసు (ఐ) ల నడుమఒక ఒప్పందం కుదిరి, తన్మూలంగా నవంబరు 7వ తేదీనాడు ఫరూఖ్ అబ్దుల్లా, కాంగ్రెసు(ఐ) మద్దతుతో, మళ్లీ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయడం జరిగింది. అధికారంలోకి వచ్చిన వెంటనే అబ్దుల్లా అంతదాకా సజీవసమాధి (suspended animation)లో వున్న శాసనసభను పూర్తిగా సమాధి (రద్దు) చేసి తిరిగి ఎన్నికలు జరిపించవల్సిందిగా గవర్నరుకు సలహా నివ్వడం, గవర్నరు జగ్‌మోహన్ ఆ సలహామేరకు అసెంబ్లీని రద్దుచేసి, 1987 మార్చిలో తిరిగి ఎన్నికలు జరుగుతాయని ప్రకటించడం జరిగాయి. 1987 మార్చి ఎన్నికల్లో ఫరూఖ్ అబ్దుల్లా నాయకత్వంలోని నేషనల్ కాన్ఫరెన్సు, కాంగ్రెసు(ఐ) లు పొత్తుపెట్టుకొని పోటీచేయగా, వివిధ కోవలకుచెందిన కాశ్మీరీ ముస్లిం తీవ్రవాదులంతా, ప్రత్యేకించి ఉడుకు నెత్తుటి యువజనులు అనేకులు, ఆ పొత్తుకు వ్యతిరేకంగా ముస్లిం ఐక్య సంఘటన (M.U.F. - ముస్లిం యునైటెడ్ ఫ్రంట్) గొడుగుకింద ఎన్నికల్లో పోటీ, ప్రచారాలు చేశారు. అయితే ఫరూఖ్ అబ్దుల్లా అధికార యంత్రాంగాన్ని బాగా దుర్వినియోగంచేసి, విశేషంగా అవినీతి, అక్రమాలకు పాల్పడుతూ, భారీఎత్తున రిగ్గింగు జరిపించడంతో, ఎన్నో ఆశలు పెట్టుకొన్న ముస్లిం యునైటెడ్ ఫ్రంట్ ఘోర పరాజయం పాలయింది. ఫరూఖ్ అబ్దుల్లా నేషనల్ కాన్ఫరెన్సుకు 38 సీట్లు, కాంగ్రెసు(ఐ)కి 24 సీట్లు లభించగా, M.U.F. కు 4 సీట్లు, భారతీయ జనతా పార్టీకి 2 సీట్లు, స్వతంత్రులకు 4 స్థానాలు మాత్రమే లభించాయి. ఆనక 1987 మార్చి 27వ తేదీనాడు ఫరూఖ్ అబ్దుల్లా ముఖ్యమంత్రిగా, 9మందితో నేషనల్ కాన్ఫరెన్సు, కాంగ్రెసు(ఐ) ల సంకీర్ణ మంత్రివర్గం ఏర్పాటయింది. జమ్మూ-కాశ్మీరులో యిటీవలి కల్లోల పరిణామాలకు బాటవేసిన కళంకిత ఘట్టం ఈ 1987 ఎన్నికలేనని, దీని అనంతరమే వివిధ తీవ్రవాద సంస్థలకు చెందిన ముస్లిం యువజనులు, చట్టబద్ధ ప్రజాస్వామిక పద్ధతుల్ని పూర్తిగా వదిలిపెట్టి, సాయుధ పోరాట మార్గానికి తరలివెళ్లారని, 1989నుండి నేటిదాకా ఆజాదీ కోసం అవిచ్ఛిన్నంగా సాగుతున్న సాయుధ తిరుగుబాటు, ప్రజాపోరాటాలకు నాందీ ప్రస్తావన ప్రధానంగా 1987 ఎన్నికల తమాషా తర్వాతినుండే జరిగిందని యిక్కడ మనం ప్రత్యేకించి గుర్తెరగాలి.

## 'ఆజాదీ' పోరాటం ఆరంభం :-

ముస్లిం యునైటెడ్ ఫ్రంటు అభ్యర్థులు 1987 ఎన్నికల్లో భారీ రిగ్గింగు పర్యవసానంగా ఘోర పరాజయం పాలవడంతో వివిధ కాశ్మీరీ ముస్లిం తీవ్రవాద సంస్థలు, యువజన బృందాలకు పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపట్ల గల భ్రమలన్నీ పటాపంచలయినాయి. దానితో 'తుపాకీ గొట్టం ద్వారానే రాజ్యాధికారం వస్తుంది' అనే భావన వారి బుర్రల్లో బాగా నాటుకుపోసాగింది. క్రమక్రమంగా

అనేకమంది యువకులు సాయుధవిప్లవసన్నాహాల కోసమని అసలు అదుపు గీత (L.A.C.) దాటి పాక్ ఆక్రమిత కాశ్మీరు (POK) వెళ్లి అక్కడ ప్రధానంగా J.K.L.F. అండదండలు,మార్గదర్శకత్వాలతో సైనిక శిక్షణ పొంద నారంభించారు. ఈ విషయమై మొదటగా చొరవ తీసుకున్న సంస్థకూడ జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటనేనని తెలుస్తున్నది. ఆ సంస్థ అధినేత అమానుల్లాఖాన్ **ఆజాద్ కాశ్మీరు** ముఖ్యపట్టణమైన ముజఫరాబాద్ కేంద్రంగా కార్యకలాపాలు నిర్వహిస్తూండడం యిందుకు ఎంతో సహాయకారి అయింది. జె.కె.ఎల్.ఎఫ్. ప్రస్తుత అధ్యక్షుడు యాసీన్ మాలిక్, మరి కొందరు ఆజాద్ కాశ్మీరు (POK)కు వెళ్లి తగు సైనిక, సైద్ధాంతిక శిక్షణపొంది 1989 ఫిబ్రవరిలో భారత అధీన కాశ్మీరుకు తిరిగివచ్చారు. వచ్చిన కొన్నిరోజులకే నల్లామార్‌రోడ్డుపై ఒక కేంద్ర రిజర్వుపోలీసుదళంపై దాడిచేసి నలుగురు జవాన్లను కాల్చిచంపారు. అంతకు పూర్వంకూడ ఏవైనా చెదురుగా హింసాఘటనలు, దాడులు జరిగివుండవచ్చుగాని విజయవంతంగా సాయుధ పోలీసులపై దాడి చేసి, వారి ప్రాణాలు తీసిన ఈ సంఘటనే కాశ్మీర్ ముస్లిం యువకుల హృదయాల్లో ఎంతో ఆత్మవిశ్వాసం, మనోస్థయిర్యం నింపి ఒక నూతన ప్రేరణను, తగు ధైర్య సాహసాలను కలగజేసింది. ఆ విధంగా 'ఆజాదీ' కోసం వారు జరిపే పోరాటానికి బహుశా యిదే ఆరంభచర్య అయిందని చెబితే అతిశయోక్తి కాదేమో. తదనంతరం 1989 వేసవికాలంలో ముస్లిం తీవ్రవాద సంస్థలు, స్వాతంత్ర్యానుకూల J.K.L.F. తదితర వర్గాల నాయకత్వంలో పెద్దయెత్తున ప్రజాప్రదర్శనలు, హర్తాళ్లు ప్రారంభమయినాయి. కాశ్మీరులోయ అంతటా "భారతీయ కుక్కలు వెళ్లిపోవాలి", "మాకు ఆజాదీ కావాలి" అనే నినాదాలు ప్రతిధ్వనించసాగాయి. గోడలపై రాతలు, పోస్టర్లు వేర్పాటువాదాన్ని, స్వాతంత్ర్యపోరాటాన్ని సమర్థిస్తూ విస్తృతంగా వెలిసాయి. పాకిస్తాన్ అనుకూల తీవ్రవాద వర్గాలు విస్తృతంగా పాకిస్తాన్ జాతీయ జెండాలు ఎగురవేయడం మొదలుపెట్టారు. నాటినుండి కాశ్మీరు లోయలో పరిస్థితి నానాటికీ మరింత క్షీణించిపోతూవస్తున్నదేగాని, భారతదేశానికి అనుకూలంగా ఏ మాత్రం మారలేదని, అప్పటినుండి కాశ్మీరీ ముస్లిం స్వాతంత్ర్యానుకూల, లేక మత ఛాందసవాద వర్గాలకు సంబంధించినంతవరకు వెనుతిరిగి చూడడమనేది లేకుండా (no looking back) పోయిందని మన మిక్కడ గమనించాలి.

## లోక్‌సభ ఎన్నికలు:-

తొమ్మిదవ లోక్‌సభకు, ఐదు రాష్ట్రాల అసెంబ్లీలకు 1989 నవంబరులో సాధారణ ఎన్నికలు జరిగాయి. అప్పుడు J.K.L.F., హిజ్బుల్ ముజాహిదీన్, యితర తీవ్రవాద కాశ్మీరీ ముస్లిం వర్గాలు జమ్మూ-కాశ్మీరు అంతటా ఎన్నికల బహిష్కరణకు పిలుపిచ్చాయి. అప్పటికే కాశ్మీరు లోయలో సాయుధ పోరాటం, ప్రజల నిరసనోద్యమం ఎంత తీవ్రస్థాయికి చేరుకున్నాయంటే అనేకచోట్ల పోలింగు దాదాపు హుళక్కే అయింది. కొన్ని పోలింగు బూతులవద్దనైతే టెర్రరిస్టులు అనేక టి.వి. సెట్లు ప్రలోభకరంగా పేర్చిపెట్టి, "సాహసించి ఓటువేసినవారు ఉచితంగా ఒక టి.వి. సెట్టు యింటికి తీసుకెళ్లవచ్చు!" అని ప్రకటనలు చేయడం, పోస్టర్లు అంటించడం జరిగాయట. అయినా

ఆ బూతుల్లో ఒక్క ఓటు పడితే ఒట్టు! సరే, లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెసు(ఐ) దేశవ్యాప్తంగా 193 సీట్లు గెలుచుకుని అతి పెద్దపార్టీగా నిలిచినా, 141 సీట్లు గెలుచుకున్న జనతాదళ్, మరికొన్ని మిత్రపక్షాల జాతీయ సంఘటనే (National Front) భారతీయ జనతాపార్టీ (88 సీట్లు), వామపక్ష పార్టీల (ఒక్క C.P.M కే 32 సీట్లు) బయటి మద్దతుతో శ్రీ విశ్వనాథ్ ప్రతాప్ సింగ్ నాయకత్వంలో నూతన ప్రభుత్వం ఏర్పాటు చేసింది. మఫ్తీ మహమ్మద్ సయీద్ (జనతాదళ్‌లోకి ఫిరాయించిన మాజీ కాశ్మీర్ కాంగ్రెసు(ఐ) నాయకుడు) కేంద్ర హోంమంత్రిగా నియమించబడ్డాడు. కాని ఇది జరిగి యింకా వారంరోజులు తిరక్కముందే 1989 డిసెంబరు 8వ తేదీనాడు మఫ్తీ మహమ్మద్ సయీద్ కూతురు డాక్టర్ రుబైయాను జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (J.K.L.F.) కు చెందిన మిలిటెంట్లు శ్రీ నగర్‌నుండి అపహరించుకు పోవడం కాశ్మీరులోనే గాక దేశవ్యాప్తంగా కూడ సంచలనం, కలవరం కలిగించింది. జైళ్లలోమగ్గుతున్న కరడుగట్టిన J.K.L.F. తీవ్రవాదులు ఐదుగుర్ని విడుదల చేస్తేనే తాము డాక్టర్ రుబైయాను విడుదల చేయగలమని ఈ అపహరణకు ప్రత్యక్షకారకుడైన J.K.L.F. అధ్యక్షుడు యాసీన్ మాలిక్ ప్రకటించాడు. దానితో కేంద్ర హోంమంత్రి బెంబేలెత్తిపోయాడు. అప్పుడు లండన్‌లో వున్న జమ్మూ-కాశ్మీరు ముఖ్యమంత్రి డాక్టర్ ఫరూఖ్ అబ్దుల్లా హుటాహుటీగా శ్రీనగర్‌కు తిరిగివచ్చాడు. డాక్టర్ రుబైయాను ఎలాగోలా విడిపించడానికి తీవ్రప్రయత్నాలు మొదలైనాయి. అయితే త్వరపడి తీవ్రవాదుల షరతులకు లొంగడం మంచిది కాదని, వివిధ వర్గాలతో సంపర్కం పెట్టుకుని తాము విశ్వప్రయత్నాలు చేస్తున్నామని, డాక్టర్ రుబైయాకు ఏ హాని కలగబోదు, పైగా పెళ్లికాని ఒక మహిళను అపహరించుకుపోవడంపై తీవ్రవాదుల పట్ల ప్రజల నిరసనలు విపరీతంగా వ్యక్తమవుతూ వారిమీద నైతిక వత్తిడి ప్రగాఢంగా వున్నదని, కనుక మనోనిబ్బరం వీడకుండా కొన్నిరోజులు వేచి చూడడమే మేలని జమ్మూ-కాశ్మీరు ప్రభుత్వం భావించి, అదే కేంద్ర ప్రభుత్వానికి విన్నవించుకున్నది కూడ. కాని మఫ్తీ మహమ్మద్ సయీద్ మాత్రం పూర్తిగా బేజారైపోయి, ప్రధానమంత్రినికూడ ప్రభావితంచేసి, రాష్ట్రప్రభుత్వ ఆక్షేపణలను ఖాతరుచేయకుండా, తక్షణం J.K.L.F. వర్గాలు కోరిన ఐదుగురు ఖైదీలను విడుదలచేసి, వారికి అప్పగించవల్సిందిగా ఆజ్ఞాపించాడు. ఆ ఐదుగురిని విడిచిపెట్టిన కొన్నిగంటలకే తీవ్రవాదులు డాక్టర్ రుబైయానుకూడ విడిచిపెట్టడంతో సమస్య అక్కడికి పరిష్కారమైనా, ఈ వ్యవహారం కాశ్మీరీ తీవ్రవాదుల ఆత్మవిశ్వాసం, ధీమాలను, మద్దతును విపరీతంగా పెంచివేసింది. అప్పటినుండి చీటికీమాటికీ ముఖ్య నాయకులను, ప్రభుత్వాధికారులను, ఆఖరుకు పర్యాటకులను కూడ, అపహరించుకుపోవడం కాశ్మీరీ తీవ్రవాదులకు మామూలయిపోయింది. ఈ డాక్టర్ రుబైయా అపహరణోదంతం కేంద్రానికీ, జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రప్రభుత్వానికీ నడుమ సంబంధాలనుకూడ పాడుచేసి అనతికాలంలో ఫరూఖ్ అబ్దుల్లా మంత్రివర్గం పతనం కావడానికికూడ దారితీసింది. ముఖ్యంగా 1989 డిసెంబరు మాసమంతటా కాశ్మీరులోయలో ప్రధానంగా J.K.L.F. యింకా కొన్ని యితర తీవ్రవాదవర్గాల పిలుపులపై ప్రజలు సమ్మెలు, హర్తాళ్లు చేయడం లేక ప్రభుత్వమే కర్ఫ్యూలు విధించడంవల్ల జనజీవనం పూర్తిగా స్తంభించిపోయింది.

## మళ్లీ రాష్ట్రపతి పాలన :-

ఈ వరస 1990 జనవరిలోకూడ అలాగే కొనసాగడతో కేంద్రప్రభుత్వం కాశ్మీరులోయలోనికి పెద్దయెత్తున అర్ధసైనిక బలగాలను దించింది. అంతేగాక రాష్ట్రముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లాను సంప్రదించకుండానే, అప్పుడు గవర్నరుగా, ముఖ్యమంత్రితో సయోధ్యగా,వున్న జనరల్ కె.వి. కృష్ణారావును తొలగించి ఆ స్థానే కరినాత్ముడు జగ్‌మోహన్‌ను తిరిగి నియమించాలనే నిర్ణయం తీసుకున్నది. 1990 జనవరి 16వ తేదీనాడు ఈ సమాచారం తన కందగానే దిగ్భ్రాంతి చెందిన ఫరూఖ్ అబ్దుల్లా, అందుకు నిరసనగా జనవరి 18వ తేదీనాడు రాజీనామా సమర్పించాడు. ఆ మరుసటి రోజే జగ్‌మోహన్ కొత్త గవర్నరుగా ప్రమాణస్వీకారం చేసి, వెంటనే రాష్ట్రంలో గవర్నరుపాలన విధించాడు. మన దేశంలోని యితర రాష్ట్రాలు అన్నింటికీ భిన్నంగా ఒక్క జమ్మూ-కాశ్మీరుకు మాత్రమే ప్రత్యేక రాజ్యాంగం వుందని, అయితే ఆ రాష్ట్ర స్వయం ప్రతిపత్తిని పదిలంగా కాపాడవల్సిన ఈ రాజ్యాంగానికి ఎప్పటికప్పుడు సవరణల తూట్లు పొడిచి వాస్తవంలో స్వయంపాలనాధికారాల్ని హుళక్కిగావించారని తెలుసుకోవాలి. కాని రాష్ట్ర రాజ్యాంగంలోని 92 (a) సెక్షను ప్రకారం ఆరునెలలదాకా గవర్నరు పాలన సాగించే ఏర్పాటు వుంది. ఆనక మాత్రమే అక్కడ రాష్ట్రపతి పాలన విధించాల్సివుంటుంది. తదనుగుణంగా 1990 జనవరి 19వ తేదీనాడు విధించిన గవర్నరు పాలన అవధి ఆరునెలలు ముగియగానే 1991 జులై 18వ తేదీనాడు అక్కడ రాష్ట్రపతి పాలన విధింపబడింది. నాటినుండి నేటిదాకా అక్కడి పరిస్థితులు ఏమాత్రం మెరుగు పడకపోగా నానాటికీ తీసికట్టుగా పరిణమిస్తుండడంతో ప్రతి ఆరునెలలకొకసారి భారత పార్లమెంటుచే రాష్ట్రపతిపాలన పొడిగిస్తూ పోవడంతప్పితే మరో గత్యంతరం (కేంద్రప్రభుత్వానికి) లేకపోతున్నది.

## సాయుధ పోరాటం తొలిదశ:-

సరే, యిక కాశ్మీరులోయలో కల్లోలం సంగతికి వస్తే అక్కడ మొదట్లో జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (J.K.L.F.) మాత్రమే ప్రధాన పోరాట శక్తిగా వుండింది. 1989-90 లలో దానికి దీటైన, గణనీయంగా బలీయమైనదని చెప్పుకోదగ్గ మరో సంస్థ ఏదీ లేకుండా వుండింది. జె.కె.ఎల్.ఎఫ్. అధ్యక్షుడు యాసీన్ మాలిక్, మరి కొందరు అనుయాయులతో కలిసి 1990 జనవరి 25న తమ చేతుల్లోని ఎ.కె. 47 రైఫిళ్లతో విచక్షణారహితంగా కాల్పులు జరిపి నలుగురు భారత వైమానిక దళ అధికారులను పొట్టన బెట్టుకున్నారు. మళ్లీ వారే ఫిబ్రవరి 2వ తేదీన ఒక పోలీసుచౌకీపై దాడిచేసి యిద్దరు సాయుధపోలీసుల్ని కాల్చివేసారు. కాని 1990 ఆగష్టు 6వ తేదీనాడు యాసీన్ మాలిక్ అరెష్టుకావడం, అనేక ఎ.కె. 47 రైఫిళ్లు తుపాకులు కూడ (ఆయనతోబాటు) జప్తుకావడంతో J.K.L.F. కు పెద్దదెబ్బే తగిలింది. యాసీన్ మాలిక్‌ను వెంటనే విమానంలో ఢిల్లీకి తరలించి తిహార్ జైల్లో నిర్బంధించారు.

కాశ్మీరులోయలో అంతకంతకూ దిగజారుతున్న శాంతి భద్రతల పరిస్థితుల దృష్ట్యా పాకిస్తాన్ త్వరంగంలో కాశ్మీరు సమస్యను ఒక అంతర్జాతీయ వివాదంగా ఫోకస్ చేయడానికి తీవ్రకృషి ముసాగింది. 1990 జనవరి 30 వతేదీనాడు పాకిస్తాన్ విదేశాంగమంత్రి సాహిబ్‌జాదా యాకూబ్‌ఖాన్ కిస్తాన్ రేడియోపై ప్రసంగిస్తూ కాశ్మీరు ఒక వివాదిత ప్రాంతమని, ఐ.రా.స. ఆధ్వర్యంలో బిసైటు జరిపించడం ద్వారా ఆ సమస్యను పరిష్కరించాలనే భద్రతా మండలి తీర్మానాలను మలుచేయాల్సివుందని ప్రకటించాడు. అయితే తాము కాశ్మీరీ తిరుగుబాటుదారులకు యుధాలుగాని, సైనిక శిక్షణగాని అందజేయడం లేదని బుకాయించాడు. అదే సమయంలో ష్లా ఒప్పందానికి కట్టుబడి కాశ్మీరు సమస్యపై తాము భారతదేశంతో ద్వైపాక్షిక చర్చలు పాలనుకుంటున్నామని, అసలు అదుపు గీతను తాము గౌరవిస్తామనికూడా ప్రకటించాడు. యితే ఈ భావ ప్రకటన నిజానికి భారతదేశ ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం చేసుకోవడమేనని రత ప్రభుత్వం ఆగ్రహం వ్యక్తం చేసింది; కాశ్మీరీ ఉగ్రవాదులకు పాకిస్తాన్ ఆయుధాలు, సైనిక ణ, వ్యూహాత్మక మద్దతు అందజేస్తున్నదని దుమ్మెత్తిపోసింది. నాటినుండి నేటిదాకా ఈ ోపణలు, ప్రత్యారోపణలు కొనసాగుతూనే వుండడం, దాదాపు ప్రతి అంతర్జాతీయ వేదికపైనా కిస్తాన్ కాశ్మీరు సమస్యను, ముఖ్యంగా అక్కడి మానవహక్కుల ఉల్లంఘనల సమస్యను, ముఖంగా లేవనెత్త జూస్తుండడం మనం గమనిస్తాము.

పోతే, 1990 ఏప్రిల్ 6వ తేదీనాడు జె.కె.ఎల్.ఎఫ్. విద్యార్థి విభాగానికి చెందిన మిలిటెంట్లు ‌గర్‌లో కాశ్మీరు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు ముషీర్-ఉల్-హక్, ఆయన కార్యదర్శి అబ్దుల్ ‌ీలను, హెచ్.ఎం.టి. కంపెనీ జనరల్ మేనేజరు హెచ్.సి. ఖేరాను అపహరించుకుపోయి, తాము ‌చించిన ముగ్గురు జె.కె.ఎల్.ఎఫ్. ఖైదీలను ఒక గడువులోపల విడుదల చేయని పక్షంలో వారిని ‌పివేస్తామని బెదిరించారు. అయితే ప్రభుత్వం ఈసారి లొంగిరాకపోవడంతో, జె.కె.ఎల్.ఎఫ్. ‌లిటెంట్లు ఆ ముగ్గురినీ 10-11 తేదీల్లో చంపివేసారు. ఈ దుర్ఘటనతో కాశ్మీరు అంతా అట్టుడికి ‌డడంతో ఏప్రిల్ 6 నుండి 21 దాకా కాశ్మీరు లోయ అంతటా నిరవధిక కర్ఫ్యూ విధించబడింది. ‌తేగాక, జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (జె.కె.ఎల్.ఎఫ్.)ను, పీపుల్సు లీగు, జమాతె ‌్లామీ (జమ్మూ అండ్ కాశ్మీరు), హిజ్బుల్ ముజాహిదీన్, ఇస్లామిక్ స్టూడెంట్సు ఆర్గనైజేషన్‌లను, ‌ో మూడు సంస్థలను నిషేధిస్తూ రాష్ట్ర ప్రభుత్వం 1990 ఏప్రిల్ 15వ తేదీనాడు ఒక ఆర్డినెన్సు ‌ చేసింది. అప్పటినుండి యీ సంస్థలపై ఆ నిషేధం అలా కొనసాగుతూనే వస్తున్నదని, పైగా ‌ంకా యితర అనేక సంస్థలపై కూడా ఎప్పటికప్పుడు నిషేధాజ్ఞలు విధించబడుతూ వస్తున్నాయని ‌నించాలి. ఇదే సంవత్సరం మే 21వ తేదీనాడు మరో దారుణ పరిణామం సంభవించింది. షేక్ ‌్దుల్లా వున్నప్పటినుండీ కూడా ఆయన లొంగుబాటు ధోరణిని నిరసిస్తూ, కాశ్మీరీ ముస్లింలకు ‌యం నిర్ణయాధికారాన్ని గట్టిగా కోరుతూ వచ్చిన మీర్‌వైజ్ మౌల్వీ మహమ్మద్ ఫరూఖ్‌ను ఆయన ‌గర్ నివాసం వద్ద, ఎవరో కొందరు గుర్తు తెలియని సాయుధులు కాల్చి చంపేశారు. ఈ అవామీ ‌న్ కమిటీ నాయకుడిని కాశ్మీరీ ఉగ్రవాదులే చంపివేశారని ప్రభుత్వ వర్గాలు ఆరోపించగా, ఈ

హత్యలతో తమకే సంబంధమూ లేదని, భారత భద్రతా బలగాలే ఈ దుశ్చర్యకు ఒడిగట్టి వుండవచ్చని దాదాపు అన్ని తీవ్రవాద సంస్థలూ ప్రత్యారోపణలు చేశాయి. అత్యంత జనాదరణ పొందిన ఈ స్వాతంత్ర్యవాది నాయకుని అంత్యక్రియల్లో వేలాది ప్రజలు పాల్గొని, కర్ఫ్యూను కూడా ధిక్కరించి పెద్ద ఊరేగింపు తీశారు. అయితే ఈ సంతాప ప్రదర్శకులపై భారత భద్రతా బలగాలు విచక్షణా రహితంగా కాల్పులు జరిపిన ఫలితంగా అక్కడికక్కడే 20 మందికి పైగా చనిపోవడం, అనంతరం గాయాలతో తీసుకుని కనీసం మరో 27 మంది మరణించడం జరిగిందని అంచనా. అయితే ఈ దారుణ మారణకాండలో మృతుల సంఖ్య 100కు తక్కువైతే వుండదని తీవ్రవాద వర్గాల కథనం. అదే రోజు (మే 22న) అసలు అదుపు గీత యిరువైపులా భారత, పాకిస్తాన్ దేశాల సైనిక బలాలు విశేషంగా మోహరించబడడం, 'మున్నెన్నడూ లేనంతగా యుద్ధానికి చేరువ' కావడం కూడా గమనార్హం. కాని అదృష్టవశాత్తూ అలాంటి ముప్పు ఏదీ సంభవించలేదు. కాశ్మీరు ప్రజల హృదయాల్ని తీవ్రంగా కలచివేసిన ఈ ఘటనల నేపథ్యంలో చెలరేగిన నిరసనల వత్తిడికి తలయొగ్గి గవర్నరు పదవికి జగ్‌మోహన్ రాజీనామా చేయక తప్పలేదు. వెంటనే (మే 25వ తేదీనాడు) ప్రధాని వి.పి. సింగ్‌కు భద్రతా సలహాదారైన, రిసెర్చి అండ్ అనాలిసిస్ వింగ్‌లో బహుకాలం పనిచేసి విశేషానుభవం గడించివున్న ఉన్నతాధికారి గిరీష్ సక్సేనాను జమ్మూ - కాశ్మీరు నూతన గవర్నరుగా నియమించారు. పోతే జగ్‌మోహన్‌ను బుజ్జగించడానికి ఆయన్ను రాజ్యసభకు (1990 మే 28న) నామినేట్ చేశారు. గిరీష్ చంద్ర సక్సేనా కళ్ళాలు చేపట్టిన అచిరకాలంలోనే 1990 జులై 5వ తేదీనాడు మొత్తం కాశ్మీరు లోయనూ, పూంఛ్, రాజౌరీ జిల్లాలలో 20 కి.మీ. వెడల్పయిన సరిహద్దు ప్రాంతాన్నీ కల్లోలిత ప్రాంతంగా ప్రకటించారు. తద్వారా తీవ్రవాదుల బెడదను సమర్థవంతంగా ఎదుర్కొనడానికి భద్రతా దళాలకు మరిన్ని అధికారాలు ప్రసాదించారు. సరే, యిదే సంవత్సరం జులై 19వ తేదీనాడు రాష్ట్రంలో రాష్ట్రపతిపాలన విధించి అప్పటినుండి యిప్పటిదాకా ప్రతి ఆరునెలలకూ దీన్ని పొడిగిస్తూ పోతున్న సంగతి మనమిదివరకే గమనించాము.

## 1991 పరిణామాలు - హిజ్బుల్ ముజాహిదీన్ విజృంభణ:-

మరుసటి సంవత్సరం (1991) మార్చి 3వ తేదీనాడు జమ్మూ - కాశ్మీరులో రాష్ట్రపతి పాలనను మరో ఆరునెలలపాటు పొడిగించారు. ఏప్రిల్ 18 నాడు దేశవ్యాప్తంగా జరుగనున్న పార్లమెంటరీ ఎన్నికల పరిధినుండి జమ్మూ-కాశ్మీరును మినహాయిస్తూ రాష్ట్రపతి ఒక ఉత్తరువు జారీ చేశారు. ఈ ఏడాది ప్రధానంగా పాకిస్తాన్ అనుకూల తీవ్రవాద వర్గాలు విజృంభించారు. మార్చి 31న ముస్లిం క్రూసేడ్ ఫోర్సుకు చెందిన కొందరు గెరిల్లాలు ఓలె లోమన్, జొహాన్ జేన్సన్‌లనే యిద్దరు స్వీడిష్ ఇంజనీర్లను అపహరించుకు వెళ్లారు; కాశ్మీరులోయలో ప్రభుత్వ బీభత్సాన్ని, భద్రతా దళాలు జరిపే అత్యాచారాల్ని గురించి దర్యాప్తు చేయడానికి ఐక్యరాజ్య సమితి, అంతర్జాతీయ క్షమాసంస్థల ఆధ్వర్యంలో నిజ నిర్ధారణ బృందాలు పంపించాలని డిమాండు చేశారు. కాశ్మీరీ తిరుగుబాటుదారులచే అపహరించబడ్డ మొట్టమొదటి విదేశీయులు వీరే. కాని మూడు నెలల పిదప జులై 5వ తేదీన ఆ ఇద్దరు ఇంజనీర్లు కస్టడీనుండి పారిపోయి వచ్చేసారు; కాగా తామే వారిని

విడిచిపెట్టినట్లు ఆనక ఆ ఉగ్రవాద సంస్థ ప్రకటించుకున్నది. 1991 జూన్ 26న జె.కె.ఎల్.ఎఫ్. గెరిల్లాలు శ్రీనగర్‌లో ఆరుగురు ఇజ్రాయిలీ పర్యాటకుల్ని అపహరించుకుపోయారు. ఈ క్రమంలో వారిలో ఒక పర్యాటకుడు తప్పించుకు పారిపోతూండగా జరిగిన ముఖాముఖీ కాల్పుల్లో ఒక గెరిల్లా, ఒక పర్యాటకుడు మరణించారు. మిగతా ఐదుగురు ఇజ్రాయేలీలు క్షేమంగా తప్పించుకున్నారు. కాని వారిలోంచి ఒకరిని - యయార్ ఇజ్జాకీ అనే అతడ్ని - మరో గెరిల్లా బృందం ఎత్తుకెళ్ళి, ఆనక ఏ హానీ చేయకుండా జులై 3 నాడు విడిచిపెట్టింది. ఈ ఏడాది జులై 26వ తేదీనాడు కాశ్మీరీ ముస్లింల సాయుధ పోరాటంలో ఒక ముఖ్యమైన మలుపు ఘటన సంభవించింది. జమ్మూ-శ్రీనగర్ రహదారిపై ప్రయాణిస్తున్న సుమారు 350 భారత సైనిక వాహనాల శ్రేణిపై పాకిస్తాన్ అనుకూల, మత ఛాందసవాద హిజ్బుల్ ముజాహిదీన్‌కు చెందిన సుమారు 26 మంది గెరిల్లాలు కాజీగుండ్ వద్ద దారికాచి మెషిన్ గన్నులు, రాకెట్లతో మెరుపుదాడి చేశారు. ఈ ఆకస్మిక దాడికి బెంబేలెత్తిన భారత సైనికులు కాసేపటికి తేరుకొని ఎదురు కాల్పులు జరుపుతూ ఎలాగోలా బయటపడ్డారుకానీ, కనీసం 100 మందైనా సైనికులు అక్కడికక్కడే మరణించి వుంటారని గెరిల్లా వర్గాల అంచనా. ఈ సాహస సంఘటన కాశ్మీరీ గెరిల్లాల ఆయుధబలం, దాడి శక్తి, ధైర్య సాహసాలు మున్నెన్నడూ లేనంత హెచ్చు స్థాయికి ఎదిగాయని సూచించడమేగాక, సైనిక పాటవానికి సంబంధించినంతవరకు కాశ్మీరీ గెరిల్లా బృందాల్లో (జె.కె.ఎల్.ఎఫ్. కంటెకూడా) హిజ్బుల్ ముజాహిదీన్ సంస్థే మిన్న అని నిరూపించింది. అయితే భారత సైనిక వర్గాలు ఈ దాడిలో కేవలం 17 మంది సైనికులు మరణించినట్లు ప్రకటించారు. ఈ సంఘటన పిదపే జులై 27వ తేదీనాడు కాశ్మీరు లోయ అంతటా (భారత) సైన్యాన్ని నియోగించడం జరిగింది. ఇదే సంవత్సరం ఆగస్టు 20వ తేదీనాడు ఇక్వాన్ - ఉల్ - ముసల్మీన్ బృందానికి చెందిన సాయుధ మిలిటెంట్లు భారత చమురు సంస్థ ఎగ్జిక్యూటివ్ డైరెక్టరు కె. దొరైస్వామిని ఎత్తుకువెళ్ళి, 55 రోజుల నిర్బంధం పిదప, ఖైదులో వున్న తమ కార్యకర్తలు ఆరుగురి విడుదలకు ప్రతిగా, ఆయన్ను విడిచిపెట్టారు. 1991 ఆగస్టు 26న భారత, పాకిస్తానీ సైనిక బలగాలు అసలు అదుపు గీత వద్ద పరస్పరం కాల్పులు జరుపుకున్నాయి. మనదేశంవైపున ఒక స్త్రీ, ఇద్దరు పిల్లలు యీ కాల్పుల్లో చిక్కి మరణించారు. పాక్ బలగాలు భారత భూభాగంలో కొంతమేరకు చొచ్చుకువచ్చాయి కూడా. కానీ భారత సైన్యం వారిని వెనక్కు నెట్టివేసింది. 1991 సెప్టెంబరు 14వ తేదీనాడు మాజీ కాశ్మీరు పర్యాటక మంత్రిణి ఖేమలతా వాక్లూను, ఆమె భర్తను యిద్దర్నీ పాకిస్తానీ అనుకూల హిజ్బుల్లా సంస్థ అపహరించుకుపోయింది. కాని భద్రతా దళాలు తీవ్రంగా గాలింపు చర్యలు జరిపి, చివరకు వారిరువుర్నీ అక్టోబరు 18వ తేదీనాడు ఆ సంస్థ నిర్బంధంనుండి విడిపించగలిగాయి. 1991 సెప్టెంబరు 10న కాశ్మీరీ ముస్లింలు అత్యంత పవిత్రంగా ఎంచి, పూజించే హజ్రత్ బాల్ మసీదులోనికి భద్రతా బలగాలు ప్రవేశించడం పట్ల నిరసనగా పాకిస్తానీ అనుకూల సంస్థలు యిచ్చిన పిలుపుకు ప్రతిస్పందనగా లక్షలాది కాశ్మీరీలు నిరవధిక సమ్మె చేశారు. లోయ అంతటా హర్తాళ్లు జరిగాయి. పర్యవసానంగా ప్రదర్శకులకు, భద్రతా దళాలకు నడుమ చెలరేగిన ఘర్షణల్లో భద్రతా దళాల విచక్షణా రహితమైన కాల్పులవల్ల కనీసం 50

మంది ప్రాణాలు కోల్పోయారు.

## ఏకతా యాత్ర :-

1992 ప్రారంభంలో భారతీయ జనతా పార్టీ తలపెట్టిన 14,000 కి.మీ. ఏకతా యాత్ర గురించి దేశమంతటా తీవ్ర చర్చలు జరుగసాగాయి. కాశ్మీరులో దేశద్రోహకర శక్తుల విజృంభణను అరికట్టి అక్కడి పరిస్థితుల్ని అదుపు చేయడంలో కేంద్ర ప్రభుత్వం ఘోరంగా విఫలమయిందని, అక్కడ జాతి వ్యతిరేక, పాకిస్తాన్ అనుకూల శక్తుల ప్రాబల్యం వల్ల పాకిస్తాన్ జెండాల విహారమేగాని జాతీయ జెండాల రెపరెపలే కనిపించడం లేదని, కనీసం స్వాతంత్ర్య దినోత్సవంనాడు లేదా రిపబ్లిక్ డే నాడైనా శ్రీనగరులోసైతం జాతీయ జెండా ఎగురవేయలేకపోతూండడం అత్యంత శోచనీయ పరిణామమని, కనుక తాము ఎన్ని అవాంతరాలైనా అధిగమించి శ్రీనగర్‌కు విజయవంతంగా పాదయాత్ర జరిపి, అక్కడి లాల్ చౌకులో రిపబ్లిక్‌డే నాడు మూడు రంగుల జండా ఎగురవేసి తీరతామని భారతీయ జనతా పార్టీ నాయకులు ప్రతిన బూనారు. అయితే ఎట్టి పరిస్థితుల్లోనూ బి.జె.పి. యాత్రను సఫలం కానివ్వబోమని జె.కె.ఎల్.ఎఫ్., తదితర కాశ్మీరీ తీవ్రవాద సంస్థలు ప్రకటించి, జమ్మూ-కాశ్మీరులో 'ఏకతా యాత్ర' సాగిస్తే భయంకర పరిణామాలను ఎదుర్కోవల్సి వుంటుందని హెచ్చరికలు చేశాయి. ఈలోగా బి.జె.పి. యాత్ర పంజాబుగుండా పయనిస్తుండగా అకాలీ తీవ్రవాదులో, ఖలిస్తాన్ బీభత్సవాదులో ఎవరో దాడిచేసి ఒకరిద్దరు ఏకతా యాత్రికుల ప్రాణాలు బలిగొన్నారు కూడా. ఆనక జమ్మూవరకు పాదయాత్ర చేసిన మురళీ మనోహర్ జోషీ, యితర భా.జ.పా. నాయకులు, కార్యకర్తలు చివరకు సైనిక, భద్రతా దళాల అధికారుల సలహాలకు చెవియొగ్గి శ్రీనగరుకు విమానంలో, పూర్తి సైనిక భద్రతతో, తరలివెళ్లారు. 1992 జనవరి 26వ తేదీనాడు శ్రీనగరు అంతటా కర్ఫ్యూ విధించి వుండగా, లాల్ చౌకు అంతటినీ సైన్యం పకడ్బందీగా పహరా కాస్తుండగా, మురళీ మనోహర్ జోషీ అక్కడ మూడు రంగుల జెండాను ఎగురవేసి, చుట్టూ వున్న 40-50 మంది ఏకతా యాత్రికుల నుద్దేశించి టూకీగా ప్రసంగించి తన ముచ్చట తీర్చుకున్నాడు. దీన్ని తమ ఘన విజయంగా భా.జ.పా. వారు చాటుకొనగా, కాదది కాశ్మీరీ ప్రజల స్వాతంత్ర్య పోరాటానికే విజయమని (అంటే ఎటూ బి.జె.పి. వాళ్లు పాదయాత్ర జరపలేక సైన్యం శరణు జొచ్చారు కనుక) జె.కె.ఎల్.ఎఫ్. సైనిక విభాగాధిపతి జావీద్ అహ్మద్ మీర్ ప్రకటించాడు. మళ్ళీ 92 ఆగస్టులో కాశ్మీరు లోయలో పెద్ద యెత్తున వేర్పాటువాద ప్రదర్శనలు చెలరేగి, వివిధ ప్రాంతాల్లో భద్రతా దళాలు జరిపిన కాల్పుల్లో 23 మందికి పైగా ప్రదర్శకులు మరణించారు. సెప్టెంబరు నెలలో పెద్ద యెత్తున వరదలు ముంచెత్తడం వల్ల కాశ్మీరులో అపార జన నష్టం, ఆస్తి నష్టం వాటిల్లాయి. కనీసం 220మందికి తక్కువ కాకుండా యీ వరదల్లో మరణించి వుంటారని ఒక అంచనా. కోట్ల రూపాయల ఆస్తులు నష్టమై, వేలాది పశువులుకూడా మృతి చెందడం సంభవించింది. 1992 డిసెంబరు 6న అయోధ్యలోని బాబ్రీ మసీదు పూర్తిగా విధ్వంసం గావించబడడంతో దేశవ్యాప్తంగా మత కలహాలు చెలరేగాయని, బొంబాయిలో మరీ పెచ్చరిల్లిన యీ కలహాల్లో వందలాది ప్రాణాలు కోల్పోయారని మనకు తెలుసు. కాని ఎందుకనోగాని ఈ మత కలహాల

ప్రభావం కాశ్మీరులో అంతగా పడినట్లు లేదు. బహుశా అప్పటికే కాశ్మీరు లోయలోని హిందువులందరినీ తరిమివేసి వుండడం దీనికి కారణమేమో. కాశ్మీరు లోయలో కొన్ని దేవాలయాలను మతోన్మాదులు విధ్వంసం లేక అపవిత్రం చేసినట్లు, జమ్మూలో కొంత కాలం ఉద్రిక్త వాతావరణం నెలకొన్నట్లు వార్తలు వచ్చాయంతే.

## పరిష్కారానికి ప్రభుత్వ ప్రయత్నాలు :-

కాశ్మీరు సమస్యకు ఒక రాజకీయ పరిష్కారం కనుగొనడానికి కేంద్ర ప్రభుత్వం 1993 ఆరంభం నుండి చురుకుగా ప్రయత్నాలు ప్రారంభించింది. కేంద్ర హోం శాఖ స్టేట్ మంత్రిగా నియమింపబడ్డ రాజేష్ పైలట్ కాశ్మీరు వ్యవహారాల్ని తన చేతుల్లో తీసుకుని, తనకు సహజమైన ఉత్సాహోద్వేగ శైలిలో కాశ్మీరు లోయకు వచ్చి ముమ్మరంగా కృషి చేయసాగాడు. తీవ్రవాదులు గనుక పాల్గొనదలిస్తే వారికి కూడా ఎన్నికల్లో స్థానం కల్పిస్తామని రాజేష్ పైలట్ ప్రకటన చేయడం అప్పటి కాశ్మీరు గవర్నరు గిరీష్ రాజ్ సక్సేనాకు ఏ మాత్రం కొరుకుడు పడలేదు. కఠిన వ్యవహర్తగా పేరుమోసిన సక్సేనా తుదకు నిష్క్రమించవల్సివచ్చింది. ఆయన స్థానంలో మెతక మనిషిగా పేరు పొందిన జనరల్ కె.వి. కృష్ణారావు 1993 ఫిబ్రవరిలో జమ్మూ-కాశ్మీరు గవర్నరుగా నియమించబడ్డాడు. జనరల్ కృష్ణారావుకు, మాజీ జమ్మూ అండ్ కాశ్మీరు ముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లాకు నడుమ మంచి స్నేహమే ఏర్పడి వుండింది. ఫలితంగా ఈ త్రిమూర్తులు కలిసి, ఏదో విధంగా శాంతి భద్రతల పరిస్థితులు మెరుగుపరిచి, ఎన్నికలు జరిపించాలని కృషి చేయసాగారు. మొదటగా, పాలనా యంత్రాంగం పూర్తిగా స్తంభించిపోకుండా ఎంతో కొంత కదిలి పని చేసేట్లు చేయడానికి, తీవ్రవాదులు పేల్చివేసిన వంతెనలు, పాడు చేసిన రోడ్లు వగైరా బాగు చేసి ప్రజలకు కనీస సౌకర్యాలు కల్పించడానికి ప్రాధాన్యం యిచ్చారు. రాజకీయ పరిష్కారానికి సంబంధించినంతవరకు రాజ్యాంగ పరిధిలోనే చర్చలకు తావుంటుందని ప్రకటించారు. కాని స్వయంనిర్ణయాధికార హక్కును వదులుకొని, భారత రాజ్యాంగ పరిధిలోనే చర్చలు జరిపి, పరిష్కారానికి రావడానికి కాశ్మీరీ తీవ్రవాదులెవరూ - జె.కె.ఎల్.ఎఫ్., హిజ్బుల్ ముజాహిదీన్, అఖిల పక్ష హుర్రియత్ (స్వాతంత్ర్య) సదస్సు, తదితర సంస్థలు, బృందాలేవీ - అంగీకరించలేదు. "కాశ్మీరుపై తమ హక్కును వదులుకోవడానికి కూడా ఇండియా సిద్ధపడే అజెండా అయితేనే మేము చర్చలకు దిగివస్తా"మని జె.కె.ఎల్.ఎఫ్. అధినేత (సైనిక విభాగాధిపతి) జావీద్ మీర్ ప్రకటించగా, "స్వాతంత్ర్యం మినహా మరే అంశాన్నీ మేము ప్రస్తావించజాలము. ఒకవేళ అలా చేసినా ప్రజలు సమ్మతించరు, ఆగ్రహావేశాలతో మమ్మల్నే హతమార్చే ప్రమాదంకూడా లేకపోలేదు," అని జైలులో వున్న జె.కె.ఎల్.ఎఫ్. అధ్యక్షుడు యాసీన్ మాలిక్ ఖండితంగా చెప్పాడు. పోతే హిజ్బుల్ ముజాహిదీన్, అల్లా టైగర్సు వంటి పాకిస్తాన్ అనుకూల సంస్థలు రంజాన్ మాసంలోనైనా 'కాల్పుల విరమణ' పాటించబోమని, గెరిల్లా సాయుధ పోరాటం కొనసాగించి తీరుతామని, మార్చి 18 కల్లా ప్రభుత్వాధికారులంతా తమ పదవులకు రాజీనామా చేయకపోతే వారిపై కఠిన చర్యలు తీసుకుంటామని మరింత పెడసరంగా ప్రకటించాయి.

1993 మార్చి 12న బొంబాయి మహానగరంలో పెద్దయెత్తున జరిగిన బాంబు పేలుళ్లు దాదాపు వేయి మందికిపైగా ప్రజల మృతికి, మరి అనేక వందలమంది తీవ్రంగా గాయపడడానికి, కోట్లాది రూపాయల ఆస్తుల విధ్వంసానికి దారితీసి దేశాన్నంతటినీ తీవ్రంగా కుదిపివేశాయి. తిరిగి మార్చి 15న కలకత్తాలో జరిగిన బాంబు పేలుళ్లలో 50 మందిదాకా ప్రాణాలు కోల్పోయారు. అతి శక్తివంతమైన పేలుడు పదార్థాలు అతి నిపుణంగా అమర్చి కలుగజేసిన ఈ పేలుళ్ల వెనుక కుఖ్యాత పాకిస్తాన్ గూఢచారి సంస్థ ఐ.ఎస్.ఐ. (ఇంటర్ సర్వీసెస్ ఇంటలిజెన్స్) దుష్ట హస్తం వుందని, వారీ పనికి పంజాబు లేక కాశ్మీరు తీవ్రవాదులను వుపయోగించుకుని వారిచే యీ భయంకర మారణ హోమం జరిపించి వుండవచ్చని ఉన్నత గూఢచారి శాఖా వర్గాలు భావించాయి. పోతే కాశ్మీరు లోయలో పరిస్థితి కూడా మార్చి నెలలో మరింత విషమించింది. సుప్రసిద్ధ శస్త్ర వైద్యుడు, మంచి మేధావి, స్వాతంత్ర్యానుకూల జె.కె.ఎల్.ఎఫ్.కు ఒక సిద్ధాంతవేత్తకూడా అయిన డాక్టర్ అబ్దుల్ అహమ్మద్ గురును ప్రత్యర్థి ఛాందసవాద హిజ్బుల్ ముజాహిదీన్‌కు చెందిన గెరిల్లాలు 1993 మార్చి 31వ తేదీనాడు శ్రీనగరులోని సౌరా మెడికల్ ఇన్స్టిట్యూట్ వద్ద అపహరించుకువెళ్లి, కొన్ని గంటల తర్వాత చంపివేశారు. ఈ విధంగా చర్చలకు పిలుపిచ్చే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు, చర్చలకు, సంప్రతింపులకు సిద్ధపడే కాశ్మీరీ సంస్థలు, వ్యక్తులందరికీ యిలాంటి ప్రతిపాదనలు, చర్యలు తామెంతమాత్రం సహించబోమని, అలాంటి వ్యక్తులను శారీరకంగా కూడా రూపుమాపివేస్తామని ముస్లిం ఛాందసవాద గెరిల్లా వర్గాలు భయంకర హెచ్చరిక చేసినట్లయింది.

## కాశ్మీరీ పోలీసుల తిరుగుబాటు :-

పులిమీద పుట్రలా 1993 ఏప్రిల్‌లో జరిగిన జమ్మూ-కాశ్మీరు రాష్ట్ర పోలీసు దళాల తిరుగుబాటు ప్రభుత్వాన్ని బాగా కుదిపివేసింది. కాశ్మీరులోని స్థానిక పోలీసులు చిరకాలంగా భయానికో, భక్తికో తీవ్రవాదులకు లోపాయికారీ మద్దతునిస్తూ వచ్చిన విషయం బహిరంగ రహస్యమే. ఈ వ్యవహారంవల్ల భారత సైన్యానికి, అర్థ సైనిక బలగాలకు ఎంతో ముప్పు వాటిల్లుతుండడంతో అడపా దడపా పోలీసు సిబ్బందిలోను, ఆఖరుకు పోలీసు అధికారుల్లోనూకూడా కొందరు అనుమానితుల్ని సైన్యం తన కస్టడీలోకి తీసుకొని తీవ్రంగా ప్రశ్నించడం, ప్రశ్నించడం పేరిట కొట్టడం, చిత్రహింసలు పెట్టడంకూడా అక్కడ మామూలయిపోయింది. యిలాంటిదే ఒక ఘటనలో ఇంటరాగేషన్ (ప్రశ్నించడం) పేరిట సైన్యం పెట్టిన చిత్ర హింసకు తమ సహచరుడు రియాజ్ అహమ్మద్ మరణించాడని, అయితే యిందుకు బాధ్యుడైన ఎస్.ఎస్.పి. రాజేంద్రన్‌పై కఠిన చర్య తీసుకోవడానికి బదులు గప్‌చుప్పుగా అతడ్ని మరెక్కడికో బదిలీ చేసేసి అంతటితో ఉన్నతాధికారులు చేతులు దులుపుకుంటున్నారని, అయితే ఈ వ్యవహారాన్ని తామింకెంతమాత్రం సహించబోము, తక్షణం తమకు న్యాయం జరిగే తీరాలనీ పట్టుబడుతూ జమ్మూ-కాశ్మీరు పోలీసులు సమ్మె చేసి, పోలీసు ప్రధాన కార్యాలయాన్ని ఆక్రమించుకుని అక్కడ తిష్టవేశారు. పైగా తుపాకులు ఝుళిపిస్తూ, పెద్ద ఊరేగింపుగా ఐ.రా.స. పరిశీలకుల కార్యాలయానికి వెళ్ళి అక్కడ ప్రదర్శన

చేశారు. ప్రభుత్వ టెర్రరిజానికి వ్యతిరేకంగా ప్రపంచ ప్రజల అభిప్రాయాల్ని సమీకరించాల్సిందిగా కోరుతూ ఒక వినతి పత్రం కూడా సమర్పించారు. "ఆకలితో చావనైనా చస్తాం, కాని కాశ్మీరును విముక్తి చేయక మానం!" అంటూ నినాదాలు కూడా చేశారు. అయితే అట్టే కాలం గడిచి ఈ తిరుగుబాటు మరీ హద్దులు మీరక మునుపే, ఏప్రిల్ 28వ తేదీ తెల్లవారు జాము 4 గంటలకు భారత సైన్యం, పారా మిలిటరీ దళాలు సంయుక్తంగా శ్రీనగరులోని తిరుగుబాటుదార్ల ఆధీనంలో వున్న పోలీసు ప్రధాన కార్యాలయాన్ని పకడ్బందీగా దిగ్బంధం చేసి, వెంటనే లొంగిపోవాల్సిందిగా తీవ్ర హెచ్చరికలు చేశారు. అదృష్టవశాత్తూ తిరుగుబాటుదారులు మొండి ప్రతిఘటనకు పూనుకోకుండా వెంటనే చేతులెత్తి లొంగిపోవడంతో ఒక మహా రక్తపాతం తప్పింది. అయితే జమ్మూ-కాశ్మీరు చరిత్రలో అపూర్వమైన ఈ సంఘటన, మరే యితర పరిణామంకంటే కూడా హెచ్చుగా, కాశ్మీరీ ప్రజల 'భారత వ్యతిరేకత'కు, వారు అనుభూతి చెందుతున్న 'పరాయీకరణ'కు అద్దం పడుతున్నది.

## విజృంభించిన సాయుధ పోరాటం :-

కొత్త గవర్నరుగా జనరల్ క్రిష్ణారావు తీసుకున్న మెతక చర్యల మూలంగా శ్రీనగర్, లాల్ చౌకులో మళ్ళీ తీవ్రవాద వర్గాలు, ఈసారి పాకిస్తాన్ అనుకూల హిజ్‌బుల్ ముజాహిదీన్ గెరిల్లాలు, తిష్టవేశారు. ప్రభుత్వ భద్రతా దళాలు ఖాళీ చేసిన బంకర్లను వీరు ఆక్రమించుకుని, ప్రభుత్వ మెతక వైఖరిని "భారతీయ కుక్కల పలాయనం"గా చిత్రిస్తూ పండుగ చేసుకున్నారు. సనాతన ధర్మ సభా భవనాన్ని తగులబెట్టి వేశారు. శ్రీనగరులోనేగాక కాశ్మీరు లోయ అంతటా తీవ్రవాదుల ప్రాబల్యం బాగా పెరిగిపోయింది. బారాముల్లా, శ్రీనగర్, అనంత్‌నాగ్ జిల్లాల్లోని కొన్ని ప్రాంతాల్లో వీరు "విముక్త ప్రాంతాలు" కూడా ఏర్పాటు చేశారు. భారత సైన్యంసైతం చొరరాని అభేద్యదుర్గాలుగా వాటిని తీర్చిదిద్దుకున్నారు. శ్రీనగర్‌కు ఉత్తరంగా 50 కిలోమీటర్ల దూరంలో వున్న సోపూరు దీనికి ఒక మంచి ఉదాహరణ. అక్కడి ప్రజలంతా ఒక్కుమ్మడిగా నిలిచి తీవ్రవాద వర్గాలకు అండదండలు అందిస్తుండగా, అక్కడ సైన్యంకూడా నిలదొక్కుకోలేక వెనుదిరిగి పోవాల్సివచ్చింది. కాని, గస్తీ తిరగడానికి వచ్చిన సరిహద్దు భద్రతా దళాలపై తీవ్రవాదులు దాడిచేసి బాంబులు విసరడం, కాల్చడం మూలంగా ఇద్దరు జవాన్లు మరణించడంతో రెచ్చిపోయిన బి.ఎస్.ఎఫ్. బలగాలు ఆ పట్టణ ప్రజలపై విరుచుకుపడి, 1993 జనవరి 6వ తేదీనాడు స్వైరవిహారం చేశారు. కనీసం 53 మంది స్త్రీలు, పురుషులు, పిల్లల్ని కాల్చి చంపేశారు. అంతేగాక సోదాల నెపంతో ఇళ్లలో చొరబడి ఆడవారిని అనేకమందిని చెరిచారని, విస్తృతంగా ఆస్తులు ధ్వంసం చేశారని, మగవారిని ఇళ్లనుండి బైటకు లాగి కాల్చి చంపారని అంతర్జాతీయ క్షమా సంస్థ (A.I.) కూడా ఆరోపించింది. ఆనక రాజేష్ పైలట్ యీ పట్టణాన్ని సందర్శించి ప్రజల ఆగ్రహావేశపూరిత, ఆవేదనాభరిత ఫిర్యాదులను స్వీకరించాడు. కాని మరికొందరు నాయకులనయితే పట్టణంలోకి చొరనీయకుండా ప్రజలు గెంటివేశారు. తదనంతరం యీ పట్టణం తీవ్రవాదులకు మరింత బలమైన కేంద్రంగా రూపొందింది. తీవ్రవాద వర్గాల్లో చీలికల్ని ఉపయోగించుకుని కాశ్మీరులో పరిస్థితులు మెరుగుపరిచి, ఎలాగైనా ఎన్నికలు జరిపించాలనే ప్రభుత్వ ప్రయత్నాలు అంతగా ఫలించలేదు. పైగా స్వాతంత్ర్యానుకూల

జె.కె.ఎల్.ఎఫ్.ను తమవైపు తిప్పుకుని, పాకిస్తాన్ అనుకూల వర్గాలను ఏకాకుల్ని చేయాలన్న ప్రయత్నాలు బెడిసికొట్టి హిజ్‌బుల్ ముజాహిదీన్, తదితర పాకిస్తాన్ అనుకూల, మత ఛాందసవాద సంస్థలు అపారంగా బలపడడానికే దారితీసాయి. ఆయుధ బలంలో, సైనిక పాటవంలో తమ ఆధిక్యాన్ని జె.కె.ఎల్.ఎఫ్. కోల్పోయింది. పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్‌లనుండి వాలంటీర్లను, కిరాయి సైనికులను తెప్పించుకుని, తమ కార్యకర్తలకు మంచి శిక్షణ యిప్పించి హిజ్‌బుల్ ముజాహిదీన్ తిరుగులేని సైనికాధిక్యతను సాధించింది. గ్రెనేడ్ రైఫిళ్ళు, విషపూరిత బుల్లెట్లు, 2 అంగుళాల మోర్టార్లు 1992 అంతానికే వారి చేతుల్లోకి వచ్చాయి. ఇక జె.కె.ఎల్.ఎఫ్. సైతం పైలట్ జరిపే రాజీ ప్రయత్నాలకు పెద్దగా ప్రతిస్పందించలేదు. అంతేగాక, ఈ ఏడాది జమ్మూలోని దోడా జిల్లాకు కూడా ముస్లిం ఛాందసవాద గెరిల్లాల కార్యకలాపాలు గణనీయంగా విస్తరించసాగాయి. జమ్మూ ముస్లింలలో మొదటినుండీ పాకిస్తాన్ అనుకూల ధోరణులే హెచ్చు. వారికి కాశ్మీరీలపట్ల సానుభూతికూడా లేదు.

కాశ్మీరులో తీవ్రవాదం విలయ తాండవంవల్ల భద్రతా దళాలు అపారంగా నష్టపోసాగాయి. కాశ్మీరీ.తీవ్రవాదులు, భద్రతా దళాల మధ్య పోరాటం ఒక చిన్న సైజు యుద్ధంగా మారిపోసాగింది. తీవ్రవాదుల దాడుల్లో గాయపడిన భద్రతా సిబ్బంది సంఖ్య 1990లో 536 కాగా, అది 1991లో 652, 1992లో 740కి పెరిగిందని, ఈ గాయాలుకూడా అంతకంతకు మందుపాతరలు లేక అతిశక్తివంతమైన బాంబుల పేలుళ్లవల్ల లేక అధునాతన తుపాకుల కాల్పులవల్ల తగులుతుండడంతో 1993లో గాయపడ్డ భద్రతా సిబ్బందికి శస్త్ర చికిత్సల అవసరం కూడా 1990కంటే రెండు రెట్లు పెరిగిపోయిందని తెలుస్తున్నది. 1993 వేసవి కాలంలో ఎంత లేదన్నా 2000 మందైనా విదేశీ కిరాయి సైనికులు, సైనిక శిక్షకులు, తీవ్రవాదులు సరిహద్దులు దాటి మన అధీనంలోని కాశ్మీరు లోయలోకి చొరబడ్డారని, వారు అత్యంత అధునాతన ఆయుధాలు, అతి శక్తివంతమైన పేలుడు పదార్థాలు ఉపయోగిస్తున్నారని విదితమైంది. పంజాబ్ టెర్రరిస్టుల కంటే కాశ్మీరు గెరిల్లాలే మరీ ప్రాణాంతకులని, వారికి సూడాన్, అల్జీరియా, లెబనాన్, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ తదితర దేశాలనుండి వచ్చిన కరడుగట్టిన తీవ్రవాదులు, కిరాయి సైనికులు తోడై పరిస్థితిని మరింత దుర్భరం చేస్తున్నారని భద్రతా దళాల ఉన్నతాధికారులే వాపోయారు. మరోవైపు భద్రతా దళాల కాల్పుల్లో మరణించే తీవ్రవాదుల సంఖ్య కూడా నానాటికీ పెరిగిపోతూనే వుంది. 1993 మే లో 163 మంది, జూన్‌లో 201 మంది, జులైలో 386 మంది తీవ్రవాదులు భద్రతా దళాల కాల్పుల్లో మరణించారని, మృతి చెందిన వారిలో హిజ్‌బుల్ ముజాహిదీన్‌కు చెందిన ఒక ప్రముఖ నాయకుడు జల్కర్ నైన్, తహరీక్-ఉల్-ముజాహిదీన్ నేత సజ్జాద్ మీర్, సోపూరు తీవ్రవాదుల నాయకుడు, ఆఫ్ఘన్ జాతీయుడు అయిన అక్బర్ ఖురేషీలవంటి ప్రముఖ నాయకులుకూడా వున్నారని తెలుస్తున్నది. భద్రతా దళాలు విజయాలు సాధించిన చోట్ల కూడా ప్రజల సానుభూతి, సహకారాలు తీవ్రవాదుల పట్లే వుండడం వల్ల ఆ విజయాలన్నీ నీరుగారిపోతున్నాయి. "ప్రజలు దూరం కావడమే మాకు ప్రధాన శత్రువు. ప్రజల సహకారం లేనిదే మేమీ యుద్ధంలో గెలవలేము," అని స్వయంగా సరిహద్దు భద్రతా దళాల అదనపు డైరెక్టరు జనరల్ పి.సి. డోగ్రాయే ఒప్పుకొన్నాడంటే కాశ్మీరు పరిస్థితులు ఎంత క్లిష్టంగా

వున్నాయో మనం తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు.

## హజరత్ బాల్ సంక్షోభం :-

విగ్రహారాధనను తీవ్రంగా వ్యతిరేకిస్తూ, విగ్రహ విధ్వంసకాండల్లో మహదానందం పొందే మహమ్మదీయులు ఒక వెంట్రుకను అత్యంత పవిత్రంగా ఎంచి, పూజిస్తారంటే అది విచిత్రం, నమ్మశక్యం కాని దనిపించవచ్చేమోగానీ కాశ్మీరీ ముస్లింలకు సంబంధించినంతవరకు యిది ముమ్మాటికీ నిజం. 'మూ-ఇ-ముఖద్దస్' (పవిత్ర కేశం) అనబడే ఈ వెంట్రుక ప్రవక్త మహమ్మదుకు చెందినదని, ఇది ఎప్పుడో ఎలాగో అరేబియానుండి భారతదేశం చేరుకుని, లాహోరులో భద్రపరచబడి వుండిందని, మొగలు చక్రవర్తి ఔరంగజేబు పాలనా కాలంలో సుమారు క్రీ.శ. 1700లో దీన్ని లాహోర్ నుండి శ్రీనగర్‌కు తీసుకొచ్చి భద్రపర్చారని, అందుకోసమే యిక్కడ భారతీయ, విదేశీయ వాస్తు శైలుల సమ్మేళనంతో తళతళలాడే పాలరాతి మసీదు ఒకటి బహు సుందరంగా నిర్మించి, అందులో ఒక చిన్న అద్దాల పెట్టెలో ఈ వెంట్రుకను నిక్షిప్తపరిచి వుంచారని, అప్పటినుండి ఈ మసీదు హజరత్ బాల్ (రుషి కేశం = ప్రవక్త వెంట్రుక) మసీదుగా ప్రసిద్ధి చెందిందని చెబుతారు. దీన్ని సంవత్సరంలో పదిసార్లు భక్తుల సందర్శనకుగాను ప్రదర్శిస్తారని, ఆయా సందర్భాల్లో వేలాది భక్తులు విచ్చేసి పవిత్ర కేశ సందర్శనతో అమందానందం చెంది వెళుతుంటారని తెలుసుకోవాలి. సిక్కులకు స్వర్ణ మందిరం ఎంత పవిత్రమైనదో, కాశ్మీరీ ముస్లింలకు ఈ హజరత్ బాల్ మసీదు ఇంచుమించు అంతే పవిత్రమైనది. సున్నీ (ముస్లింలలోని ముఖ్య తెగ) సాంప్రదాయాలకు విరుద్ధంగా ఇమాంలను (ముఖ్య గురువులను), రుషుల్ని, వివిధ చిహ్నాలను గౌరవించి, పూజించే షియా సాంప్రదాయాలు, అలాగే పర్షియానుండి దిగుమతైన సూఫీ సాంప్రదాయాల ప్రభావం కాశ్మీరులో చాలా ఎక్కువ. పవిత్ర కేశ ఆరాధన యిందుకొక నిదర్శనం. ఈ పవిత్ర కేశం అదృశ్యమైందనే పుకార్ల వల్ల 1963లో కాశ్మీరు లోయ అంతటా ఎంతో అలజడి, ఆందోళన చెలరేగి, నిరసన ప్రదర్శకులపై పోలీసు కాల్పుల్లో అనేకులు అసువులు బాయడం, ఆ నేపథ్యంలో బక్షీ గులాం అహమ్మద్ మంత్రివర్గం రాజీనామా చేయవల్సి రావడం, పర్యవసానంగా షేక్ అబ్దుల్లా తిరిగి అధికారంలోకి రావడానికి దారి క్రమంగా నిష్కంటకం కావడం జరిగాయనే విషయం అందరికీ తెలిసిందే. అలాంటి మహత్తర ప్రాముఖ్యంగల ఈ మసీదులో మొదటినుండి తీవ్రవాద వర్గాల, పాకిస్తాన్ అనుకూల శక్తుల పట్టే అధికంగా వుంటూ వస్తున్నది. వారి ఆరాలు తీయడానికి లేక తీవ్రవాదుల గురించి సోదాలు, అరెస్టులు చేయడానికని తప్పనిసరి పరిస్థితుల్లో ఎప్పుడైనా భద్రతాదళాలు ఇందులో ప్రవేశించితే, అప్పుడప్పుడల్లా కాశ్మీరు లోయలో తీవ్ర నిరసనోద్యమాలు చెలరేగి జన జీవనం స్తంభించిపోవడం మామూలే.

అలాంటి ఈ మసీదులో సుమారు 40 మంది కాశ్మీరీ ముస్లిం తీవ్రవాద గెరిల్లా (ప్రధానంగా J.K.L.F. అనుకూలురు) 1993 అక్టోబరు మాసంలో తిష్టవేసి, అనేకమంది సందర్శక తమవద్ద బందీలుగా ఆపివుంచుకొని ఒక అపూర్వ సంక్షోభం సృష్టించారు. మొదటయితే ఈ

పవిత్ర కేశం వునికే సందేహాస్పదంగా పరిణమించిందన్న పుకారు వ్యాపించి కాశ్మీరు అంతా అట్టుడికిపోయింది. క్రమంగా మసీదులో ప్రార్థనలకు, సందర్శనకు వచ్చిన 170 మందికి పైగా పౌరులు (స్త్రీలు, పిల్లలతో యుక్తంగా) తీవ్రవాదుల నిర్బంధంలో వున్నారని, తీవ్రవాదుల నెదుర్కొని వారిని విడిపించడానికి, తీవ్రవాదుల్ని తరిమివేయడానికి సైన్యం, భద్రతా దళాలు ప్రయత్నిస్తే వారి ప్రాణాలకు పెద్ద ప్రమాదమేగాక మసీదును మొత్తంగా పేల్చివేసే ముప్పుకూడా వున్నదని తీవ్రవాదుల హెచ్చరికల వల్ల లోకానికి విదితమయింది. భారత రాజ్యాంగ పరిధిలో కాశ్మీరు సమస్య పరిష్కారానికి చర్చలు జరపాలన్న కేంద్ర ప్రభుత్వ ప్రతిపాదనను తోసివేసి, స్వాతంత్ర్య సాధన కోసం సాగుతున్న కాశ్మీరీ ముస్లింల పోరాటానికి మద్దతుగా ప్రపంచ ప్రజల దృష్టిని, శ్రద్ధాసక్తులను ఆకర్షించడమే తీవ్రవాదుల ఈ చర్యలో ముఖ్యోద్దేశ్యం. అంతేగాక తమ ప్రత్యర్థులైన, ఎప్పటికప్పుడు సైనికంగా తమకంటె బలీయంగా రూపొందుతున్న పాకిస్తాన్ అనుకూల హిజ్బుల్ ముజాహిదీన్ కంటె తామే కాశ్మీరీ ముస్లింలకు అధిక సన్నిహితులమని, మరింత సమర్థులైన నాయకులమని చాటుకునేందుకు జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (J.K.L.F.) పన్నిన ఒక ఎత్తుగడగాకూడా దీన్ని అర్థం చేసుకోవచ్చు. బిత్తరపోయిన ప్రభుత్వం మొదట అఖిలపక్ష హుర్రియత్ సదస్సు నేతల ద్వారా ఈ సమస్యను పరిష్కరించ జూచి విఫలమయింది. సాధారణంగా పాకిస్తానీ అనుకూల వైఖరి అవలంబించే హుర్రియత్ నాయకులు మరింత పెడసరి ధోరణిలో, ముందు మసీదు చుట్టూ సైనికదళాల ముట్టడి ఎత్తివేస్తేనే ఏదైనా సాధ్యమని చెప్పి పట్టుబట్టారు. పైగా కర్ఫ్యూను ధిక్కరించి ఈ మసీదులో ప్రార్థనలకు తరలిరండని ప్రజలకు పిలుపు నిచ్చారు. దానితో అనేక దిక్కుల నుండి కర్ఫ్యూను లెక్క చేయకుండా వందలు, వేల సంఖ్యలో ప్రజలు తరలిరాసాగారు. అక్టోబరు 22వ తేదీనాడు యిలా తరలివస్తున్న ఒక ప్రజాబృందంపై భద్రతా దళాలు బిజ్ బిహారా వద్ద యిచ్చవచ్చినట్లు కాల్పులు జరిపి అనేకమంది ప్రాణాలు బలిగొన్నారు. కాగా సైన్యం వెంటనే మసీదులోనికి చొచ్చుకు వెళ్లి కఠిన చర్యలు తీసుకొనేట్లు చేయవల్సిందిగా భారత రాజకీయ రంగంలోని ప్రముఖులనేకులు, ముఖ్యంగా భా.జ.పా. తదితర కుడివైపు పార్టీల నాయకులు - ప్రభుత్వాన్ని వత్తిడి చేయసాగారు. చివరకు, భారత గూఢచారి వర్గాలు ఎలాగోలా J.K.L.F. ముఖ్య సేనాధిపతి (కమాండర్ ఇన్ చీఫ్) రఫీక్ ధార్‌తో రహస్య మంతనాలాడి ఒక అనధికార ఒప్పందం కుదుర్చుకున్నారు. ఆ మేరకు రఫీక్ ధార్ హజరత్ బాల్‌లోని తమ సహచరులకు ఒక లేఖ రాసియిస్తే, దాన్ని మన్నించి, మసీదులోని తీవ్రవాదులు ఆయుధాలు విసర్జించి బయటకు వచ్చి, భారత సైన్యానికి లొంగిపోయారు. దీనితో 1993 నవంబరు 16వ తేదీనాడు ఈ పెను సంక్షోభం శాంతియుతంగానే పరిష్కారమయిపోయింది. అనేక తీవ్రవాదులను అనతికాలంలోనే బెయిలుపై విడుదల చేసారని, వారిలోని యిద్దరు పాకిస్తానీలను పాక్ ఆక్రమిత కాశ్మీరు (POK) వాసులని చెప్పి సరిహద్దుల ఆవలికి పంపించివేసారని విశ్వసనీయ వర్గాల ద్వారా తెలుస్తున్నది. ఏమైనా ఈ హజరత్ బాల్ సంక్షోభం మూలంగా స్వాతంత్ర్యానుకూల J.K.L.F. సంస్థకు ప్రత్యేకించిన్నూ, కాశ్మీరీ ముస్లింల వేర్పాటు వుద్యమానికి సాధారణంగానూ ఎనలేని ఆదరణోత్సాహాలు లభించాయి.

## జెనీవా మానవ హక్కుల సదస్సు:

1994 మార్చిలో జెనీవాలో జరగనున్న ఐక్యరాజ్య సమితి మానవహక్కుల సంఘం సదస్సులో కాశ్మీరులో అత్యాచారాలు, మానవహక్కుల ఉల్లంఘనలపై భారత ప్రభుత్వాన్ని అభిశంసిస్తూ, మానవ హక్కుల సంఘం తరపున అక్కడికి ఒక నిజ నిర్ధారణ బృందం పంపించాలని డిమాండు చేస్తూ పాకిస్తాన్ ప్రతిపాదించే తీర్మానాన్ని ఎలా ఎదుర్కొని, తిప్పి కొట్టాలనే గంభీర సమస్య భారత ప్రభుత్వాన్ని 1994 ఆరంభంనుండీ బాగా వేధించసాగింది. జెనీవాలో గనుక ఈ భారత ప్రతికూల తీర్మానం పాసయితే దాని అంతర్జాతీయ పర్యవసానాలు భారతదేశానికి చాల కంటకమయ్యే ప్రమాదం వుండింది. కనుక ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు ఎంతో తెలివిగా యోచించి, పార్లమెంటులో ప్రతిపక్ష నాయకుడు, మాజీ విదేశాంగ మంత్రి, భారత జనతాపార్టీ అగ్రనాయకుడు అయిన, దౌత్యకళలో బాగా ఆరితేరి, కాశ్మీరు సమస్యపై తీవ్ర జాతీయ వాదిగా వున్న అటల్ బిహారీ వాజ్‌పేయీనే భారత ప్రతినిధి వర్గానికి నాయకునిగా చేసి, ఆయనకు సహాయకంగా కేంద్ర ఆర్థికశాఖా మంత్రి మన్మోహన్ సింగ్‌ను, విదేశాంగశాఖ సహాయ మంత్రి సల్మాన్ ఖుర్షీద్‌ను, యింకా మాజీ జమ్మూ అండ్ కాశ్మీరు ముఖ్యమంత్రి ఫరూఖ్ అబ్దుల్లాను కూడా జెనీవాకు పంపారు. అక్కడ భారత ప్రతినిధివర్గం సల్పిన తీవ్రమైన తెరవెనుక కృషివల్ల, యింకా మన విదేశాంగమంత్రి దినేష్ సింగ్ టెహరాన్‌లో ఇరాన్ నాయకులతోనూ, అప్పు డక్కడే వున్న చైనా విదేశాంగమంత్రి క్వియున్ క్విచెన్‌తోనూ మంతనాలాడి వారిని ఒప్పించడంవల్ల తుదకు ఈ ప్రమాదాన్ని సమర్థవంతంగా ఎదుర్కొనగలిగారు. ఇస్లామిక్ దేశాలుసైతం తనకు దన్ను యివ్వకపోవడం, తానెంతో ఆశపెట్టుకొని వుండిన మిత్రదేశాలు - ఇరాన్, చైనాలు- రెండూ కలిసి తీర్మానాన్ని ఉపసంహరించుకోమని వత్తిడి చేయడంతో పాకిస్తాన్ బిత్తరపోయింది. తుదకు పాకిస్తాన్ అయిష్టంగానైనా తన తీర్మానాన్ని ఉపసంహరించుకోక తప్పిందికాదు. దానితో భారతదేశం దౌత్యపరంగా ఘనవిజయం సాధించినట్లే అయింది. కానీ, అటల్ బిహారీ వాజ్‌పేయి స్పష్టంచేసినట్లు, "ఇండియా వంటి గొప్పదేశం మానవ హక్కుల సమస్యపై అందరి ఓట్లకోసం భిక్ష ఎత్తవల్సివచ్చింది. కాశ్మీరు వ్యవహారాలను మనం చక్కదిద్దుకొనకపోతే ప్రతి కొన్ని నెలలకూ ఒక జెనీవా సదస్సు చొప్పున చవిచూడవల్సివస్తుంది," అన్న సంగతి మాత్రం మనం మరువరాదు.

జెనీవా సదస్సు జరగడానికి కొంతకాలం ముందు భారతదేశం ఐరోపా ఆర్థిక సమాఖ్యకు చెందిన ముగ్గురు రాయబారుల బృందానికి కాశ్మీరు అంతటా స్వేచ్ఛగా పర్యటించి, పరిస్థితులను పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చేందుకు అనుమతి నివ్వడం, అలాగే ఏడు ఇస్లామిక్ రాయబారుల పర్యటనకూ అనుమతి నివ్వడం వంటి మెతక చర్యలు భారత దౌత్య విజయానికి దోహదం చేశాయి. అంతేగాక చైనాలో మానవ హక్కుల ఉల్లంఘన గురించి చైనాను అభిశంసించే పాశ్చాత్య దేశాల (అమెరికాతో యుక్తంగా) ప్రయత్నాలను ఖండిస్తూ చైనాకు అనుకూలంగా ఓటు చేసివుండడం, అలాగే ఇరాన్ తన బద్ధశత్రువుగా భావించే అమెరికా కాశ్మీరీ పోరాటానికి పరోక్ష మద్దతునివ్వడ ఇరాన్‌కు కంటకం కావడం లాంటి పరిణామాలు కూడా మనకు జెనీవాలో బాగా సహాయపడ్డాం

కాశ్మీరు సమస్యపై జెనీవాలో పాకిస్తాన్ ప్రతిపాదించిన తీర్మానంపై ఎన్నో ఆశలు పెట్టుకుని వున్న స్వాతంత్ర్యానుకూల, పాకిస్తాన్ అనుకూల కాశ్మీరీ తీవ్రవాద సంస్థల వారు కూడ ఈ ఎదురు దెబ్బతో ఎంతో ఖిన్నులయ్యారు. అయతుల్లా ఖొమేనీని ఆరాధ్య నాయకునిగా భావిస్తూ వచ్చిన కాశ్మీరీ ముస్లిం ఛాందసవర్గాలు ఇరాన్ వైఖరిపట్ల బిత్తరపోయారు. అయితే పదిమంది సభ్యులతో కూడిన విదేశీ రాయబారుల బృందం కాశ్మీరు సందర్శించడానికి భారత ప్రభుత్వం అనుమతించవల్సిరావడం వారికి కొంతలో కొంత ఊరట కలిగించకపోలేదు. అదే సమయంలో జె.కె.ఎల్.ఎఫ్. సైనిక శాఖాధిపతి జావీద్ మీర్‌ను ప్రభుత్వం అరెస్టు చేయడం కాశ్మీరీ తీవ్రవాద వుద్యమానికి మరో బలమైన దెబ్బ అయింది. అప్పటినుండి భారత ప్రభుత్వం జమ్మూ-కాశ్మీరులో శాంతి భద్రతల పరిస్థితులు ఏ విధంగానైనా మెరుగుపరిచి, ఎన్నికలు జరిపించి, ఆపైనే ఆ రాష్ట్రానికి కొంత స్వయం ప్రతిపత్తి యివ్వాలని సంకల్పించి జె.కె.ఎల్.ఎఫ్.ను; ఫరూఖ్ అబ్దుల్లా నాయకత్వంలోని జాతీయ కాన్ఫరెన్సును, అఖిల పక్ష హుర్రియత్‌ను చర్చలకు ఆహ్వానించసాగింది. షేక్ అబ్దుల్లా మొట్టమొదటి వజీర్-ఎ-ఆజం గా వున్నప్పటి అంటే 1953-54 నాటి స్థాయిలో కాశ్మీరుకు స్వయం ప్రతిపత్తి కల్పించినా చాలనే వైఖరితో నేషనల్ కాన్ఫరెన్సు (ఫరూఖ్ వర్గం) వుండగా, కాశ్మీరీల ఆజాదీ డిమాండును పొందుపర్చని, కేవలం భారత రాజ్యాంగ పరిధిలోనే జరిగే చర్చలకు జె.కె.ఎల్.ఎఫ్., తదితర కాశ్మీరీ స్వాతంత్ర్యానుకూల సంస్థలు ఏమాత్రం సుముఖత వ్యక్తం చేయలేదు. కాగా హుర్రియత్ నాయకులు, అలాగే పాకిస్తానీ అనుకూల గెరిల్లా సంస్థలవారు మరింత పెడసరి వైఖరి పూని అసలే చర్చలకూ సుముఖత చూపకుండా మెతకవైఖరి వారిపై దాడులకు పూనుకోసాగారు.

## మెతకవాదులపై భయంకర దాడులు :

జెనీవాలో ఘనవిజయం సాధించిన భారతప్రభుత్వం, అనేక తీవ్రవాద వర్గాల్లో వున్న చీలికలు ఉపయోగించుకుని, లేని చీలికల్ని సృష్టిస్తూ, వారిలో కాస్త మెతకపాటి వర్గాలతో చర్చలు జరపడానికి చేసే ప్రయత్నాలను వమ్ముచేయడానికిగాను పాకిస్తానీ అనుకూల తీవ్రవాద వర్గాలు భారతదేశ వాదనతో ఏకీభవించే లేక ప్రభుత్వంతో చర్చలకు సమ్మతించే కాశ్మీరీ నాయకులను తుదముట్టించాలనే కఠిన నిర్ణయానికి వచ్చారు. ఫలితంగా నేషనల్ కాన్ఫరెన్సు ప్రముఖ నాయకుడు, జమ్మూ-కాశ్మీరు మాజీ స్పీకరు వలీ మహమ్మద్ ఇట్టూను 1994 మార్చి 18 (శుక్రవారం) నాడు కొందరు గుర్తు తెలియని తీవ్రవాదులు జమ్మూ పట్టణంలోని జామా మసీదు వెలుపల దారుణంగా కాల్చి చంపారు. దీనితో భారత రాజ్యాంగ పరిధిలో కాశ్మీరు స్వయంప్రతిపత్తిని మాత్రమే కోరుతూ, ఏవో కొన్ని ముఖ్యమైన రాయితీలు లభిస్తే ఎన్నికల్లో పాల్గొనడానికి సుముఖత చూపించే ఫరూఖ్ అబ్దుల్లా నాయకత్వంలోని జమ్మూ-కాశ్మీరు నేషనల్ కాన్ఫరెన్సు నాయకులు, కార్యకర్తల గుండెల్లో రైళ్లు పరిగెత్తసాగాయి. కాశ్మీరు లోయలోనే గాక జమ్మూలో సైతం పరిస్థితులింత దారుణంగా పరిణమించడంతో - 1994 ఫిబ్రవరి 23న నడిబజారులో బాంబుపేలుడువల్ల ముగ్గురి మరణం, 40 మంది గాయపడడం, మార్చి 3వ తేదీనాడు జనంపై ఉగ్రవాదులు జరిపిన కాల్పుల్లో యిద్దరి మృతి,

ఇప్పుడు మార్చి 18న ఇట్టూ హత్యలతో- కాశ్మీరులోనే కాదు ఆఖరుకు జమ్మూలోనైనా ఎన్నికలు జరగడం సాధ్యమా అనే చిక్కు ప్రశ్న తలెత్తింది. 1989-92 సంవత్సరాల నడుమ కాలంలో తీవ్రవాదుల దాడులకు ఐదుగురు మాజీ శాసనసభ్యులు నేలకొరిగిన పిమ్మట, దాదాపు ఒక ఏడాది యిలాంటి దుర్ఘటనలేవీ లేకుండా గడిచిన అనంతరం, మళ్లీ ఒక ప్రముఖ రాజకీయ నాయకుడు హత్యగావింపబడడం రాష్ట్రంలో యిదే మొదలు. గవర్నరు యిచ్చిన ఈద్ మిలన్ విందుకు హాజరయిన పిదప పూర్తిగా వారం తిరక్కుండానే ఇట్టూ యిలా హత్యకు గురికావడం ప్రభుత్వంతో సంప్రదింపులకు, రాజీయత్నాలకు లేక సిద్ధపడే రాజకీయవాదులకు ఉగ్రవాదుల మరణాంతక హెచ్చరిక అనే భావిస్తున్నారు.

## హుర్రియత్ చొరవ :

ఇదిలావుండగా ప్రభుత్వ ప్రత్యక్ష ప్రమేయం లేకుండా తామే కాశ్మీరు సమస్యకు సంబంధించి వివిధ పక్షాలతో సంప్రదించి, ఏవైనా పరిష్కార మార్గాలు అన్వేషించాలని 1994 ఏప్రిల్ మాసంలో అఖిలపక్ష హుర్రియత్ సదస్సు నాయకులు చొరవ తీసుకున్నారు. జమ్మూ, లడఖ్‌లకు చెందిన ముస్లిమేతర ప్రతినిధులతోను, కాశ్మీరీ పండితులతోను కూడ వారు చర్చలు జరిపారు. ఇదే కాలంలో త్వరలో వియన్నాలో జరగనున్న కాశ్మీరు పీపుల్సు కాన్ఫరెన్స్‌లో పాల్గొనేందుకు పాంథర్సు పార్టీ (జమ్మూ) అధినేత భీమ్‌సింగ్‌కు, హుర్రియత్ నాయకుడు అబ్దుల్ ఘనీకి భారత ప్రభుత్వం అనుమతినివ్వగా, అదే పాకిస్తాన్ ఆక్రమిత 'అజాద్ కాశ్మీరు' ప్రతినిధులకు మాత్రం పాకిస్తాన్ ప్రభుత్వం అలాంటి అనుమతి నివ్వకపోవడం ఒకవిధంగా భారతప్రభుత్వానికి మరో అనుకూలాంశం అయింది. కాని, కాశ్మీరు సమస్య పరిష్కార కృషిలో ఫరూఖ్ పాత్రను హుర్రియత్ నాయకులు వ్యతిరేకించారు. అలాగే భారత రాజ్యాంగ పరిధిలోనే ఏదో ఒక పరిష్కారం కుదరడమనేది కల్ల అనికూడా స్పష్టంచేశారు. అయితే భారత రాజ్యాంగ పరిధిలో లేని ఏ పరిష్కారానికీ తాము సమ్మతించబోమని కేంద్ర ప్రభుత్వం స్పష్టం చేయడంతో సమస్య మళ్లీ యథాస్థితికే వచ్చినట్లయింది.

## యాసీన్ మాలిక్ విడుదల :

ఈ నేపథ్యంలో తిహార్ జైలులోని తన కొడుకు ఆరోగ్యస్థితి విషమిస్తున్నది గనుక అతన్ని వెంటనే బెయిలుపై విడుదల చేయాలని యాసీన్ మాలిక్ (J.K.L.F. అధ్యకుడు) తల్లి పెట్టుకున్న దరఖాస్తును ప్రభుత్వ వర్గాలవారు గట్టిగా వ్యతిరేకించకపోవడంతో సుప్రీంకోర్టు అతడికి బెయిలు మంజూరు చేసింది. ఫలితంగా 1994 మే 16వ తేదీనాడు యాసిన్ మాలిక్ విడుదలై విమానంలో శ్రీనగర్‌కు వచ్చాడు. అక్కడ అతడికి అఖండ స్వాగతం లభించింది. సుమారు 27హత్యలతో ప్రత్యక్ష ప్రమేయం వున్న ఈ రాటుదేలిన గెరిల్లా నాయకుడు మతఛాందసవాది మాత్రం కాడు, పైగా ప్రత్యర్థులచే హిందూ తత్వచింతనపట్ల మొగ్గుచూపేవాడనే విమర్శలకు గురయ్యాడుకూడా. ఇటీవలి పరిస్థితుల పరిణామ క్రమాన్ని బాగా గమనించి, కాస్త మెతకబడి, వీలైతే ప్రభుత్వంతో చర్చలద్వారాకు పరిష్కారాన్వేషణకు సమ్మతించాడు. విడుదలయిన వెంటనే యాసీన్ మాలిక్, గెరిల్లా వర్గాల వ

సాగుతున్న పరస్పర మారణకాండల్ని ఆపుచేయ ప్రయత్నించడం, తీవ్రవాద వర్గాల్లో చొరబడి విచక్షణారహితంగా లూటీలు, హత్యలు, మానభంగాలు గావిస్తున్న సంఘవ్యతిరేక శక్తులను ఏరిపారేయడం, పాకిస్తాన్ అనుకూల హిజ్‌బుల్ ముజాహిదీన్ సంస్థతో సయోధ్యకు ప్రయత్నం చేయడం తన తక్షణ లక్ష్యాలుగా ప్రకటించాడు. పాక్ అనుకూల హిజ్‌బుల్ ముజాహిదీన్‌తో గాని, అఖిలపక్ష హుర్రియత్‌తో గాని తాము ఏకీభవించకున్నప్పటికీ వారితో వైరాన్ని కూడ పెంచుకోదల్చుకోలేదని ఆయన స్పష్టం చేశాడు. మాలిక్ విడుదల అనంతరం శ్రీనగర్‌లో పరిస్థితులు గణనీయంగా మెరుగుపడ్డాయి. అయినదానికీ, కానిదానికీ సమ్మెలు, హర్తాళ్లు జరిపే సంస్కృతిని తీవ్రంగా వ్యతిరేకిస్తూ, దుకాణాలు, పరిశ్రమలు తిరిగి తెరవబడడానికి, జనజీవనం మళ్లీ సందడి పుంజుకోవడానికి మాలిక్ ఎంతో దోహదపడ్డాడు. అంతేగాక లాల్‌చౌకులో శిబిరం వేసుకుని నేరస్తులను వెళ్లగొట్టి, తీవ్రవాద వుద్యమాన్ని ప్రక్షాళన చేయాలని, అమాయకుల ఊచకోతలను అడ్డుకోవాలనే పరిశుద్ధ లక్ష్యంతో యాసీన్ మాలిక్ చేసిన నిరవధిక నిరాహార దీక్ష కూడా ఎంతో మంచి ఫలితా లిచ్చింది. చివరకు అఖిలపక్ష హుర్రియత్ నాయకులు కూడా దిగివచ్చి మాలిక్‌కు నచ్చజెప్పి అతని దీక్ష విరమింపజేశారు. "తుపాకీ మాత్రమే సరిపోదు; చర్చలద్వారా కూడా పరిష్కారం వెదకాలి!" అనే భావనను జనసామాన్యంలో వ్యాప్తి గావించడంలో మాలిక్ కొంతవరకు సఫలీకృతుడయ్యాడు.

## తీవ్రవాద వర్గాల పరస్పర హత్యాకాండలు :

స్వాతంత్ర్యానుకూల J.K.L.F. కు, పాకిస్తాన్ అనుకూల హిజ్‌బుల్ ముజాహిదీన్, తదితర సంస్థలకు నడుమ సౌభ్రాతృత్వం కంటె శత్రుత్వమే హెచ్చుగా పెంపొందుతూ వస్తున్నది. ఏ వర్గాని కా వర్గం తానే పై చేయి అని నిరూపించుకోవడం కోసం తీసే పరుగుల పోటీ, వేసే వెర్రితలలు కూడ దీనికి ఒకందుకు కారణమే. దక్షిణ కాశ్మీరు మీర్‌వైజ్ (ప్రధాన మత గురువు)గా పేరుపొంది, విశేష జనాదరణకు నోచుకున్న డాక్టరు ఖాజీ నిస్సార్ అహమ్మద్‌ను అనంతనాగ్ పట్టణంలో 1994 జూన్ 19వ తేదీనాడు హిజ్‌బుల్ ముజాహిదీన్ గెరిల్లాలు అపహరించుకు వెళ్లి, కొన్ని గంటల తర్వాత దారుణంగా హత్యచేసివేశారు. మరుసటి రోజు తూటాలు నిండిన ఆయన మృతదేహం లభించడంతో, ఆ పట్టణ ప్రజల కోపావేశాలకు హద్దులేకుండా పోయింది. తమ ప్రియతమ మతనాయకుని హత్యకు నిరసనగా సుమారు లక్షాముప్పైవేల మంది ప్రజలు పెద్ద ప్రదర్శన జరుపుతూ "హిజ్‌బుల్ ముజాహిదీన్ నశించాలి!" "పాకిస్తాన్ ముర్దాబాద్!" అంటూ పెద్దపెట్టున నినాదాలు చేయసాగారు. ఇది పాకిస్తాన్ అనుకూల ఉగ్రవాదులకు పెద్ద చెంపపెట్టు లాంటిదే అయినా ఈ ధోరణి అట్టే రోజులు నిలవలేదు. మరో రెండు రోజుల్లో అక్కడి ప్రజలు పాకిస్తాన్ వ్యతిరేక, హిజ్‌బుల్ ముజాహిదీన్ వ్యతిరేక నినాదాలుమాని, కేవలం "హంతకులనుపట్టుకోవాలి!" అనే మెతకపాటి నినాదాలకే పరిమితమయ్యారు. అంతేగాక డాక్టర్ నిస్సార్ సోదరి, మరి అనేకులు ప్రముఖులు తాము హిజ్‌బుల్ వ్యతిరేక నినాదాలు, వాగ్మూలాలు యిచ్చినందుకు క్షమాపణలు

చెప్పుకుంటూ పత్రికల్లో ప్రకటనలు కూడా యిచ్చుకున్నారు! అంటే పాకిస్తాన్ అనుకూల వర్గాలకు గల పలుకుబడి, సైనికశక్తి, అవంటే ప్రజల్లో వ్యాపించిన భయభక్తులు ఎంతటివో స్పష్టమవుతూనే వున్నది గదా. ఇక్కడ గమనించవల్సిన మరో ముఖ్య విషయమేమిటంటే పాకిస్తాన్ వ్యతిరేకత పెల్లుబికినప్పుడు సైతం ప్రజలు భారత అనుకూలతను ప్రదర్శించకపోవడం.

డాక్టర్ నిస్సార్ అహమ్మద్ భారతఖండంలోని అత్యంత విజ్ఞులైన ఇస్లాం మత విద్వాంసుల్లో ఒకరు. ఆయన ఒక ప్రముఖ మతగురువుల కుటుంబానికి చెందినవాడు. తన సొంత పట్టణం అనంతనాగ్ నుండే ఆయన తన రాజకీయ కార్యకలాపాలు నడుపుతూ వచ్చాడు. 1980 లలో రాజకీయాల్లో చురుగ్గా పాల్గొన్నాడు. 1987లో ముస్లిం యునైటెడ్ ఫ్రంట్(M.U.F.)ను నెలకొల్పి, స్వయంనిర్ణయాధికార ఆశయాన్ని పట్టుదలతో ప్రచారం చేస్తూ నేషనల్ కాన్ఫరెన్సును, కాంగ్రెసు తదితర పార్టీలను వ్యతిరేకిస్తూ అసెంబ్లీ ఎన్నికల్లో పాల్గొన్నాడు. 1987 ఎన్నికల్లో భారీ ఎత్తున రిగ్గింగు, యితర అక్రమాలు జరిగాయని, దీనితో విసిగివేసారి, భ్రమలు కోల్పోయిన M.U.F. యువజనుల్లో అత్యధికులు తదనంతరం తుపాకీ మార్గానికి మళ్లారని మనం ఈవరకే గమనించాము. 1989 వేసవిలో పెల్లుబికిన ఆజాదీ పోరాటం నేపథ్యంలో కాజీ నిస్సార్ అహమ్మద్‌నుకూడ 1990లో అరెస్టు చేసి జైలులో నిర్బంధించారు. ఆనక 1992లో ఆయన తన యితర సహచరులతో బాటు విడుదల అయ్యారు. అప్పటికి కాశ్మీరులోయలో తీవ్రవాదుల తుపాకీ రాజ్యమే వర్ధిల్లుతూండడం ఆయనకు నచ్చలేదు. దానితో రాజకీయాలనుండి విరమించుకున్నాడు. ఆయన ఇతర సహచరులు మట్టుకు రాజకీయాల్లో కొనసాగుతూ కుల్ జమాత్ హుర్రియత్ కాన్ఫరెన్సు (అఖిలపక్ష స్వాతంత్ర్య సదస్సు) ఏర్పాటు చేసుకున్నారు. పోతే డాక్టర్ నిస్సార్ అహ్మద్ 1994లో కాశ్మీరు పరిణామాల్లో వచ్చిన సడలింపు ధోరణులను, భారత ప్రభుత్వ శాంతియత్నాలు,J.K.L.F., హుర్రియత్, తదితర సంస్థలతో అది అవలంభించే మెతక వైఖరులను గమనించి మళ్లీ యింకోసారి క్రియాశీల రాజకీయాల్లోకి రాదల్చాడు. పాకిస్తాన్ అనుకూల హిజ్‌బుల్ ముజాహిదీన్ వర్గపు ఛాందసపోకడలు ఆయనకు అసలు గిట్టకపోవడం వల్ల వారు తన మసీదులో ప్రచార కార్యకలాపాలను జరుపుకునేందుక ఆయన అనుమతించలేదు కూడ. ఫైనాన్షియల్ టైమ్స్ మాజీ ప్రతినిధి డేవిడ్ హౌస్‌గో కుమారుడిని అతగాడి స్నేహితుడ్ని ముస్లిం ఛాందసవాద హర్కత్-ఉల్-అన్సార్ సంస్థ బందీలుగా పట్టుకున్నప్పు డాక్టర్ నిస్సార్ అహమ్మదే పూనుకొని రహస్యమంతనాలాడి, వారిని విడిపించాడు. ఈ కారణాలవ ఆయన హిజ్‌బుల్ ముజాహిదీన్ ఆగ్రహానికి గురై అసువులు కోల్పోయాడు.

అయితే ఇదేదో ఒంటరి ఘటన అనుకోరాదు. కాశ్మీరు లోయ అంతటా స్వాతంత్ర్యానుకూ కాశ్మీరీ వేర్పాటువాద వర్గాలకు (ప్రధానంగా J.K.L.F. కు), పాకిస్తాన్ అనుకూల వర్గాలకు సైత మరణాంతక పరస్పర వైరాలు పెచ్చరిల్లి 1994వ సంవత్సరం మొదటి ఆరు నెలల కాలంలోనే 20 మందికి పైగా తీవ్రవాదులు హతులయ్యారు. బారాముల్లా, కుప్వారా జిల్లాల్లో ముస్లిం ముజాహిదీన్‌కు హిజ్‌బుల్‌కు నడుమ జరిగిన ఘర్షణల్లో 29 మంది మరణించారని, శ్రీనగర్‌లో J.K.L.F. క

హిజ్‌బుల్ ముజాహిదీన్‌కు ఆధిక్యంకోసం జరిగే పోరాటంలో 55 మంది మరణించారని తెలుస్తున్నది. అంతేగాక 1994 మేలో విడుదలైన J.K.L.F. అధ్యక్షుడు యాసీన్ మాలిక్‌పై ఇప్పటికే రెండు హత్యాయత్నాలు జరిగాయని, ఆయన రెండు సందర్భాల్లోనూ వెంట్రుకవాసిలో తప్పించుకు బయటపడ్డాడనికూడ తెలుస్తున్నది. కాశ్మీరులోయ అంతటా చిన్నవీ, పెద్దవీ కలుపుకుని మొత్తం 130కి పైగా తీవ్రవాద గ్రూపులున్నాయని, జె.కె.ఎల్.ఎఫ్., హిజ్‌బుల్ ముజాహిదీన్, హర్కత్-ఉల్-అన్సార్‌ల వంటి కొన్ని తప్పితే మిగతా అత్యధిక గ్రూపులన్నీ ఏవో కొన్ని ప్రాంతాలకే పరిమితమై, తమ తమ 'జాగీర్ల' లో తమ ఆధిక్యత నిలుపుకుంటూనో, నిలుపుకోవడానికి ప్రయత్నిస్తూనో వున్నాయని తెలుస్తున్నది. వీటి కేడర్లలో తరచూ క్రమశిక్షణ లోపించి ఆస్తుల లూటీలు, ఆడపిల్లల మానభంగాలు, అపహరణలు, ప్రజలను వేధించుకు తినడం, బలవంతంగా నిధుల పోగుసేత, యింకా యితర అక్రమాలకు పాల్పడడంతో, కాశ్మీరు ప్రజలు అంతకంతకూ ఈ ఆరాచకం పట్ల, తుపాకీ పెత్తనం పట్ల విసిగెత్తిపోతున్నారని కూడ తెలుస్తున్నది. అయితే కాశ్మీరు ప్రజలు స్వాతంత్ర్యం లేక స్వయంనిర్ణయాధికారం కోసం సాగే ప్రధాన సాయుధ పోరాట స్రవంతి పట్ల వ్యతిరేకులు అయ్యారనిగాని లేక భారతదేశం పట్ల ఆదరణ, అనురాగం పెంచుకొన్నారని గాని దీనర్థం కాదు; అలా జరగలేదు కూడ.

## జమ్మూకు విస్తరించిన గెరిల్లా యుద్ధం :

1992 దాకా కాశ్మీరులోయకే ప్రధానంగా పరిమితమై వున్న గెరిల్లా పోరాటం 1993 నుండీ జమ్మూ ప్రాంతానికి కూడ విస్తరించింది. ప్రత్యేకించి జమ్మూ-కాశ్మీరులోకే అతి పెద్ద జిల్లా అయిన దోడాలో పాకిస్తాన్ అనుకూల గెరిల్లాదళాలు కేంద్రీకరించి భారత భద్రతాదళాలతో "నువ్వా?నేనా?' 'అన్నట్లు తలపడి తీవ్రపోరాటాలు చేస్తున్నాయి. ఈ జిల్లాలో ముస్లింలు, హిందువుల జనాభా నిష్పత్తి 55:45గా వుంటుంది. ఇక్కడ హిందువులపై పెద్దయెత్తున అత్యాచారాలు, మారణకాండలు జరిపి వారిని గణనీయ సంఖ్యలో యితర ప్రాంతాలకు తరిమివేయడం, మతకలహాలు సృష్టించి అరాచకత్వం వ్యాపింపజేయడం గెరిల్లా వర్గాల ప్రధాన లక్ష్యం. పంజాబులో సిక్కు బీభత్స వాదులు జరిపిన దురంతాల మాదిరిగా యిక్కడ కూడ బస్సుల్లోంచి హిందూ ప్రయాణీకుల్ని మాత్రమే దింపివేసి, దారుణంగా కాల్చిచంపే ఘటనలు జరుగుతున్నాయి. 14-15 వేల అడుగుల ఎత్తున్న అతి దుర్గమమైన పర్వత ప్రాంతాల్లో, ముస్లిం జనబాహుళ్యంగల గ్రామాల్లో రక్షణ తీసుకుంటూ, దట్టమైన అడవులు కవచంగా వాడుకుంటూ, సుమారు 1200-1500 మంది గెరిల్లాలు దాదాపు 7-8 బెటాలియన్ల భారత భద్రతా బలగాలను ముప్పు తిప్పలు పెడుతున్నారు. దారికాచి, మాటుపెట్టి భద్రతా దళాలపై దాడులు చేసే ఘటనలు దాదాపు నిత్యకృత్యమైపోతున్నాయి. భద్రతాదళాల ముట్టడులనుండి తప్పించుకుపోవడానికి గెరిల్లాలకు పీత బొరియల్లా అనేక మార్గాలున్నాయి. అటు కాశ్మీరులోని అనంతనాగ్, యితర జిల్లాలకు, యిటు హిమాచల్ ప్రదేశ్‌లోని చంబా జిల్లాకు, జమ్మూలోని కథువా, ఉధంపూరు జిల్లాలకు వీరు పర్వత మార్గాల ద్వారా తేలిగ్గా తప్పించుకు

పొగల్గుతున్నారు. కాశ్మీరులోయ కంటె ఈ ప్రాంతమే గెరిల్లా యుద్ధానికి వ్యూహాత్మకంగా ఎంతో అనుకూలమైనదని, అత్యధునాతన ఆయుధాలతో విశేష సైనిక శిక్షణ పొందిన విదేశీ కిరాయి సైనికులు, అక్రమంగా చొరబడివచ్చిన కొందరు పాకిస్తాన్ సైనికాధికారుల ప్రత్యక్ష నాయకత్వంలో లేక పర్యవేక్షణలో గెరిల్లా పోరాటం జరుపుతున్న యిక్కడి ముస్లిం ఛాందసవాద తీవ్రవాదులే మున్ముందు అతిపెద్ద బెడదగా పరిణమించవచ్చని సైనిక నిపుణులు భావిస్తున్నారు. అంతేగాక, కీలకమైన ఈ పర్వత ప్రాంతాల్లోంచి గెరిల్లా దళాలను పూర్తిగా తరిమివేయడం భారత సైన్యానికైనా దాదాపు అసాధ్యమేనని, కనుక మున్ముందు ఏదైనా పెద్ద ఎత్తున సాయుధ తిరుగుబాటో లేక భారత-పాకిస్తాన్ యుద్ధమో బద్ధలైతే అప్పు డీ ప్రాంతమే తీవ్రవాదులకు కంచుకోట కావచ్చనే భయాందోళనలు కూడ సైనిక వర్గాల్లో వ్యక్తమవుతున్నాయి.

## చరారె షరీఫ్ దహనకాండ :

1995వ సంవత్సరంలో భారత ప్రభుత్వానికి అతిపెద్ద ఎదురుదెబ్బ కాశ్మీరు లోయలోని చరారె పట్టణంలో తగిలింది. కేవలం 20,000 జనాభాగల ఈ పట్టణం ప్రఖ్యాత నంద రుషి (సూఫీ సాధువు నూరుద్దీన్ నూరాని) ప్రార్థనామందిరానికి ఆలవాలం. సూఫీ సాంప్రదాయానికిది ప్రతీక. ముస్లింలే గాక హిందువులు సైతం యిక్కడి ప్రార్థనా మందిరాన్ని సందర్శించి 'మన్నత్'లు (మొక్కులు) వేడుకొనడం కద్దు. ఇక్కడ కోరుకున్న 'మన్నత్'లు ఫలించి తీరుతాయనే గుడ్డి నమ్మకం ప్రజల్లో బాగా ప్రబలివుంది. ఏదేమైనా విశేష జనాదరణ పొందిన, బహుశా హజరత్ బాల్ తర్వాత కాశ్మీరు అంతటిలోకి అతి పవిత్రంగా ఎంచబడే ప్రార్థనా మందిరం ఈ చరారె షరీఫ్ అని చెప్పకతప్పదు. అలాంటి పవిత్ర తీర్థయాత్రా స్థలంలో 1994 డిసెంబరు నుండి తీవ్రవాదులు - ప్రత్యేకించి పాకిస్తాన్ అనుకూల హర్కత్-ఉల్-అన్సార్, హిజ్బుల్ ముజాహిదీన్ వర్గాలవారు - తిష్టవేయసాగారు. ఇక్కడి ప్రజలు కూడ వారిని విశేషంగా ఆదరించి, వారికి అవసరమైన అన్ని సౌకర్యాలు సమకూరుస్తూ వచ్చారు. ఈ సంగతి తెల్సిన భారత సైన్యం ఆగ్రహంతో ఈ పట్టణాన్ని దిగ్బంధం చేసివేసింది. ముట్టడికి తట్టుకోలేని పట్టణ ప్రజలు మెల్లమెల్లగా పట్టణాన్ని ఖాళీచేసి యితర ప్రాంతాలకు పారిపోసాగారు. 1995 మే నెల వచ్చే సరికల్లా అక్కడ సుమారు 1000-1500 మంది ప్రజలు మాత్రమే మిగిలారు. పట్టణంలోని కొన్ని ప్రాంతాల్లో హర్కత్-ఉల్-అన్సార్ తీవ్రవాదులు (అబూ జిందాల్ నాయకత్వాన), చరారె షరీఫ్ మందిరాన్ని కేంద్రం చేసుకుని హిజ్బు ముజాహిదీన్ గెరిల్లాలు (పాకిస్తానీ యోధుడు మస్తగుల్ నాయకత్వాన) తిష్టవేసి కూర్చున్నా చివరకు 1995 మే 11వ తేదీనాడు భారత సైన్యం పట్టణంలో ప్రవేశించి పెద్దయెత్తున సోదా అరెస్టులు మొదలుపెట్టింది. తీవ్ర ఘర్షణలు అంతగా లేకుండానే అబూ జిందాల్ (హర్కత్-ఉ అన్సార్ నేత) ను అరెస్టు చేయగలిగారు. ఆనక చరారె షరీఫ్ మందిరంపై కూడ ము ప్రారంభమైంది. మత ఛాందసవాద హిజ్బుల్ ముజాహిదీన్‌కు షియా సాంప్రదాయాలన్నా, స ఆశయాలన్నా గౌరవాభిమానాలేవీ లేవు. సాధువులు, రుషుల స్మారక మందిరాల పట్ల భక్తి ప్రపత్త అసలే లేవు. అంతేగాక అలాంటి మందిరాలను ఏదో నెపంపై ధ్వంసం చేయడం వ

అత్యానందకర కార్యకలాపం కూడ. కనుక సైన్యం ముట్టడిని తట్టుకొని నిలవడం యిక అసాధ్యమన్న దశలో, మస్త్‌గుల్ స్వయంగా చరారె షరీఫ్‌కు నిప్పుపెట్టాడు. ప్రధానంగా చెక్కతో నిర్మించిన ఆ మందిరం ధగధగ తగులబడుతుండగా రేగిన పెను మంటల మాటున కాల్పులు చేసుకుంటూ తప్పుకొని పారిపోవడానికి హిజ్‌బుల్ ముజాహిదీన్ గెరిల్లాలు ప్రయత్నించారు. ఆ క్రమంలో సైనికదళాలకు, మస్త్‌గుల్ నాయకత్వంలోని గెరిల్లాలకు నడుమ జరిగిన తీవ్రఘర్షణలో అనేకమంది ఉగ్రవాదులు, కొందరు సైనికులు మృతిచెందారు. కాని మస్త్‌గుల్, మరికొందరు గెరిల్లాలు మాత్రం తప్పించుకొని పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీరు (POK)కు పారిపోగల్గారు. అక్కడా, ఆనక రావల్పిండి, తదితర పాకిస్తాన్ పట్టణాల్లో, మస్త్‌గుల్‌కు సాహసపోరాట వీరునిగా బ్రహ్మాండమైన స్వాగత సత్కారాలు జరిగాయి. అయితే యిటీవల అతడు కరాచీ (సింధ్) వెళ్లినప్పుడు మాత్రం అక్కడ నెలకొనివున్న అంతర్యుద్ధంలాంటి పోరాట జ్వాలల్లో యితగాడు కొత్తగా ఏ ఆజ్యం పోస్తాడేమోనని భయపడి (పాకిస్తాన్) ప్రభుత్వ వర్గాలవారు ఆ నగరం నుండి మాత్రం యితడ్ని బయటికి గెంటి వేశారంటే అది వేరనుకోండి.

చరారె షరీఫ్ దగ్ధకాండ మస్త్ గుల్, అతని అనుయాయులే జరిపినా నింద మాత్రం ప్రధానంగా భారత ప్రభుత్వంపైనే పడింది. కాశ్మీరీ ముస్లింల మనోభావాల్ని ఎంతగానో దెబ్బతీసిన దహనకాండకు భారత సైన్యపు ఆలోచనా రహిత, దుడుకు వైఖరే కారణమని వారు ఎంతో ఆడిపోసుకుంటున్నారు. ఇది నిజంగా తమకు పెద్ద ఎదురుదెబ్బేనని ప్రధాని పి.వి. నరసింహారావు సైతం స్వయంగా అంగీకరించాల్సి వచ్చిందంటే ఈ ఘటన ప్రాముఖ్యమెంతో మనం తేలిగ్గా అర్థం చేసుకోవచ్చు. దీనితో కాశ్మీరులో శాంతి భద్రతల పరిస్థితుల్ని మెరుగుపరిచి, ఎలాగైనా సరే ఎన్నికలు జరిపించాలనే ప్రయత్నాలకు పెద్ద అడ్డంకి మరొకటి మళ్లీ ఏర్పడినట్లయింది.

## అమర్‌నాథ్ యాత్రపై తీవ్రవాదుల నిషేధాజ్ఞలు:

హిందువులకు అతి పవిత్రమైన తీర్థయాత్రాక్షేత్రాల్లో ఒకటైన అమర్‌నాథ్ గుహ కాశ్మీరులో 14,500 అడుగుల ఎత్తయిన పర్వతాల్లో వున్నది. జమ్మూలోని పహల్‌గావ్ నుంచి సుమారు 400 కిలో మీటర్లు పయనించి అక్కడికి వెళ్లాల్సివుంటుంది. దుర్గమమైన కొండదారులగుండా చాలా దూరం కాలినడకనో లేక గుర్రాలు/గాడిదలపైనో కూడ పయనించాల్సి వుంటుంది. ప్రతి ఏటా దేశం నలుమూలలనుండి వేలాది హిందూయాత్రికులు ఎముకలు కొరికే చలికి, కష్టతరమైన ప్రయాణ భారానికి ఓర్చుకుంటూ ఈ పుణ్యక్షేత్రాన్ని చేరుకుని అక్కడిగుహలో ప్రకృతి సిద్ధంగా ఏర్పడే మంచు లింగాన్ని సందర్శించి పులకించిపోతుంటారు. ఇలాంటి మహత్తర ప్రాధాన్యతగల ఈ యాత్రనే నిషేధిస్తూ 1994లోనూ, అలాగే యిటీవల 1995లోనూ కూడ తీవ్రవాద వర్గాలు హెచ్చరికలు చేశాయి. 1993-94లో హజరత్ బాల్ మసీదు చుట్టూ సైన్యం నెలకొల్పిన బంకర్లు తొలగించి, ఆ పవిత్ర మందిరాన్ని ముట్టడించివున్న సైనిక బలగాలను ఉపసంహరించుకోవాలనే డిమాండుకు 1994లో ఈ నిషేధాజ్ఞను ముఖ్యంగా ముడిపెట్టారు. కాగా 1995లో చరారె షరీఫ్ (నందరుషి)

మందిర దహన కాండకు ముడిపెట్టి ఈ నిషేధాజ్ఞను జారీ చేశారు. అయితే వీటిలో 1994 ఆగష్టులో జారీఅయిన నిషేధాజ్ఞకే కాశ్మీరీ తీవ్రవాద వర్గాలనుండి, ముస్లిం ప్రజానీకంనుండి బహుళ మద్దతు లభించివుండింది. హర్కత్-ఉల్-అన్సార్ నాయకత్వాన ఎనిమిది పాకిస్తాన్ అనుకూల, ముస్లిం ఛాందసవాద మిలిటెంటు సంస్థలు - హర్కత్-ఉల్-అన్సార్, హిజ్బుల్ ముజాహిదీన్, జమాత్ ఉల్ ముజాహిదీన్, అల్ ఉమర్ ముజాహిదీన్, హిజ్బ్ ఉల్ మోమినీన్, ముజాహిదీన్ ఉల్ హమస్, అల్లా టైగర్స్, జిహాద్ ఫోర్సులు - హజరత్ బాల్‌పై సైనిక ముట్టడిని ఉపసంహరించాలని, ధ్వంసమైన మసీదులు, ఖాంకాలు అన్నీ పునరుద్ధరించాలని, జమ్మూ ముస్లింలు ప్రార్థనలు జరుపుకోవడానికి వీలుగా అక్కడ మూతబడివున్న మసీదులు తిరిగి తెరవాలని డిమాండు చేస్తూ, ఈ డిమాండ్లు నెరవేరేదాకా అమరనాథ్‌యాత్ర జరగనీకుండా అడ్డుకొంటామంటూ నిషేధాజ్ఞలు జారీ చేశారు. దీనికి అఖిల పక్ష హుర్రియత్ కాన్ఫరెన్సుకూడ మద్దతు ప్రకటించింది. అప్పుడప్పుడే విడుదలయి, సౌరా మెడికల్ ఇన్‌స్టిట్యూట్‌లో చికిత్స పొందుతున్న యాసీన్ మాలిక్ (J.K.L.F. అధ్యక్షుడు) కూడ ఈ నిషేధాజ్ఞకు నైతిక మద్దతు తెలుపుతూ, ఈ డిమాండ్లలో హజరత్ బాల్‌పై ముట్టడి తొలగింపు డిమాండు ప్రధానమైనదని, ఆ ముట్టడి ఎత్తివేసుకున్న వెంటనే హర్కత్-ఉల్-అన్సార్ కూడ అమరనాథ్ యాత్రపై నిషేధాన్ని ఎత్తివేసుకోవాలని సలహా యిచ్చాడు. అయితే భారత సైన్యం, భద్రతాదళాల పటిష్టమైన కాపలాతో తీవ్రవాదులు పెట్టిన అడ్డంకులన్నిటినీ అధిగమిస్తూ 1994 ఆగస్టులో అమరనాథ్ యాత్ర జయప్రదంగా నిర్వహించుకోగలిగారు. కాని ఈ క్రమంలో ముస్లింల మనోభావాలు కూడ దృష్టిలో వుంచుకుని, వారిని మచ్చిక చేసుకోవడానికిగాను హజరత్ బాల్ చుట్టూ గల బంకర్లు తొలగించి భారత సైన్యం కాస్త దూరానికి తప్పుకున్నదని కూడ తెలియవస్తున్నది.

1995 ఆగష్టులోనైతే అమరనాథ్ యాత్రపై నిషేధానికి అంత విస్తృత మద్దతు లభించలేదు. అఖిలపక్ష హుర్రియత్ గాని, జె.కె.ఎల్.ఎఫ్. గాని దీనికి షరతులతో మద్దతునైనా యివ్వలేదు. అయితే పాకిస్తాన్ అనుకూల తీవ్రవాద వర్గాలు పహల్‌గావ్‌లో బాంబుపేలుళ్లు జరిపి యాత్ర మొదలయ్యేటప్ప అనేకమంది ప్రాణాలు బలిగొనడంతో అక్కడ బీభత్స పరిస్థితులు నెలకొన్నాయి. కాని సుమా 20,000 మంది భద్రతాదళ సిబ్బంది జమ్మూ-పహల్‌గావ్ దారికి అహర్నిశం కాపలా కాస్తూ, భ బందోబస్తు నడుమ యాత్రికులందరినీ జాగ్రత్తగా, మరే హాని కలగకుండా అమర్‌నాథ్ గుహకు చే మళ్లీ వెనక్కు తీసుకురావడంలో సఫలీకృతులయ్యారు. యాత్రికులు కూడ బెదిరింపుల బీభత్సాలకు జడవకుండా పెద్ద సంఖ్యలో తరలిరావడమూ ఒక విశేషమే.

## విదేశీయుల అపహరణ :

1995 జులైలో (4, 8, 9 తేదీల్లో)అల్ ఫరాన్ అనే ఒక కొత్త తీవ్రవాద సంస్థకు చె గెరిల్లాలు మొత్తం అయిదు మంది విదేశీ పర్యాటకుల్ని - ఇద్దరు బ్రిటిష్, ఒక అమెరికన్, ఒక ఒక నార్వే దేశవాసి - పహల్‌గావ్ వద్ద అపహరించుకుపోవడం, వివిధ తీవ్రవాద బృ నాయకులు నలుగురితో బాటుగా మొత్తం 21మంది ఖైదీలను విడుదల చేస్తేనే వారిని విడిచిపెడత

లేకుంటే గడువుదాటిన తర్వాత వారిని చంపేస్తామని బెదిరించడంతో కాశ్మీరులోను, దేశమంతటానే గాక అంతర్జాతీయంగా సైతం సంచలనం, భయాందోళనలు రేకెత్తాయి. అసలుకు వాళ్లు మొత్తం ఆరుగుర్ని అపహరించగా అందులో ఒక అమెరికన్ పట్టుబడ్డ కొంత కాలానికే ఎలాగోలా తప్పించుకు బయటపడ్డాడు. తర్వాత తర్వాత ఈ అల్ ఫరాన్ అనేది మత ఛాందసవాద హర్కత్ - ఉల్ - అన్సార్‌కు ఒక ముసుగుపేరో లేక దానికి చెందిన ఒక చీలిక వర్గమో కావచ్చని స్పష్టమయింది. అయితే భారత ప్రభుత్వం ఖైదీల విడుదలకు సమ్మతించక, కొందరు మధ్యవర్తుల సాయంతో ఆ సంస్థ గెరిల్లాలతో రహస్యమంతనాలు సాగిస్తూ, ఎప్పటికప్పుడు గడువు పొడిగించుకోను ప్రయత్నిస్తూ రాసాగింది. ఈ జాప్యానికి క్రుద్ధులయిన అల్ ఫరాన్ ఉగ్రవాదులు తమవద్దనున్న బందీల్లోంచి హాన్స్ క్రిస్టియన్ ఓస్ట్రో అనే నార్వే జాతీయుడ్ని దారుణంగా హత్యచేసి (అతడి తల పూర్తిగా నరికివేసారు), అతడి మృతదేహాన్ని అక్కడి పర్వతాల్లోని దట్టమైన అడవుల్లో పడవేసి వెళ్లారు. ఓస్ట్రో శవం ఆగస్టు 13వ తేదీనాడు భద్రతా దళాలకు లభించింది. పాపం ఈ నార్వేదేశస్తుడు కథాకళి నాట్యం నేర్చుకోవడానికి మన దేశం వచ్చి, కేరళలోని కథాకళి గురువుల గ్రామంలో మకాము చేసి అచిరకాలంలో ఆ నాట్యకళలో ప్రావీణ్యం సంపాదించాడు. ఆ ప్రాంతప్రజల ఆదరాభిమానాలను చూరగొని, 'నార్వేదేశ నంబూద్రి'గా పేరుపొందాడు. దురదృష్టవశాత్తూ కాశ్మీరు సందర్శనా వ్యామోహం అతడి ప్రాణాలనే బలిగొన్నది. మిగతా నలుగురు పర్యాటకులు - కీత్ మేంగన్, పాల్ వెల్స్ (బ్రిటిషు జాతీయులు), డొనాల్డ్ హచ్చింగ్స్(అమెరికన్), డర్క్ హేసర్ట్(జర్మను) - నేటికీ యింకా అల్ ఫరాన్ నిర్బంధంలోనే వున్నారు. వారి భార్యాపిల్లలు, బంధువులు, శ్రేయోభిలాషులు మన దేశం వచ్చి ఎలాగైనా వారిని విడిపించవల్సిందిగా మన ప్రభుత్వంతో ఎంతో మొరపెట్టుకున్నారు. బ్రిటన్, అమెరికా, జర్మనీ దేశాల దౌత్య ప్రతినిధులు కూడ వారి విడుదలకోసం నేటికీ కృషి చేస్తూనే వున్నారు. మరీ ఇటీవలే భారత ప్రభుత్వం బ్రిటిష్, అమెరికన్ కమాండో దళాల సహకారాన్ని కూడ అర్థించి, వారి ప్రవేశానికి అనుమతి సైతం యిచ్చింది. కాని దుర్గమమైన పర్వతప్రాంతాల్లో, అదీ బందీలకు హాని కలగకుండా, అల్ ఫరాన్ గెరిల్లాలను వెదికి పట్టుకోవడం ఇంచుమించు అసాధ్యమేనని చెప్పవచ్చు. ఏమైనా యింతవరకైతే మన భద్రతాదళాలుగాని, ఏ దేశపు కమెండోలైనా గానీ ఈ దిశగా ఏ విజయమూ సాధించలేదు.

## జమ్మూ - కాశ్మీరు విమోచన సంఘటన (J.K.L.F.)లో చీలిక:

అసలే పాకిస్తాన్ అనుకూల హిజ్‌బుల్ ముజాహిదీన్ దాడులకు దెబ్బతింటూ, సైనిక సామర్థ్యంలో దాని కంటె కిందుచేయి అవుతున్న జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన ఇటీవల - 1995 సెప్టెంబరులో - రెండు ముక్కలుగా చీలిపోయింది. 1994లో జైలునుండి విడుదలై వచ్చిన J.K.L.F. అధ్యక్షుడు యాసీన్ మాలిక్ మరెంతమాత్రం ముజఫరాబాదు (ఆజాద్ కాశ్మీరు) కేంద్రంగా పనిచేసే జె.కె.ఎల్.ఎఫ్. చైర్మన్ అమానుల్లాఖాన్ ఆజ్ఞలు, విధానాలు శిరసావహించడానికి యిచ్ఛగించకపోవడం, పర్యవసానంగా అదను చూచుకుని అమానుల్లాఖాన్‌ను తొలగిస్తున్నట్లు

ప్రకటించి సంస్థ పగ్గాలను తానే చేపట్టడం ఈ చీలికకు దారితీసింది. J.K.L.F. చీలికవర్గంగా సమీకృతులైన షబ్బీర్ సిద్ధికీ, అతని అనుయాయులు హజరత్ బాల్ (శ్రీనగరు) ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. యాసీన్ మాలిక్ నాయకత్వాన్ని సవాలు చేస్తున్నారు. మొదటినుండీ పాకిస్తాన్ అనుకూల హుర్రియత్‌కు కాస్త దూరంగానే వుంటూ వస్తున్నా, ప్రస్తుతం తన సంస్థలోనే బయటపడ్డ లుకలుకలను దృష్టిలో పెట్టుకొని కాబోలు, యాసీన్ మాలిక్ మరీ ఇటీవలే అఖిల పక్ష హుర్రియత్‌లో చేరాడు. మరి ఆజాదీ కోసం పోరాడే జె.కె.ఎల్.ఎఫ్. కు, ప్రధానంగా పాకిస్తాన్ అనుకూల సంస్థల వేదికయిన హుర్రియత్‌కు మధ్య ఈ పొత్తు ఎంత కాలం నిలుస్తుందో తెలియదుగాని, ప్రస్తుతానికి మాత్రం ఉభయ వర్గాలూ ఈ ఐక్యత పట్ల హర్షామోదాలు వ్యక్తం చేస్తున్నాయి. కాగా జె.కె.ఎల్.ఎఫ్. సంస్థాపక చైర్మన్ అమానుల్లాఖాన్ మాత్రం యాసీన్ మాలిక్‌ను తీవ్రంగా దుయ్యబడుతూ, భారత ప్రభుత్వంతో అతడు (మాలిక్) లాలూచీ పడివుండడమే ఈ విషాదకర పరిణామానికి (చీలికకు) దారితీసిందని ఆరోపించాడు.

## ఎన్నికల నిర్వహణకు విఫల యత్నాలు:

1994లో యాసీన్ మాలిక్ విడుదల, ఆనక హుర్రియత్ నాయకులతో సంప్రదింపులు ఆశించిన సత్ఫలితాలు యివ్వకపోయినా, 1995లో చరారె షరీఫ్ దహనం, విదేశీ పర్యాటకుల అపహరణ మొదలగు ఘటనలతో పరిస్థితులు 94 కంటె మరికాస్త విషమించినా, 1996 మార్చి-ఏప్రిల్‌లో జరగనున్న పార్లమెంటు ఎన్నికలను దృష్టిలో పెట్టుకుని, అంతకన్న ముందే జమ్మూ-కాశ్మీరులో ఎన్నికలు జరిపించి, ఏదో ఒక మోతాదు జనం మద్దతుతో అక్కడ 'ఎన్నికైన ప్రజాస్వామిక ప్రభుత్వం నెలకొల్పి, అదంతా తాము సాధించిన ఘనవిజయంగా ప్రచారం చేసుకుని పార్లమెంటు ఎన్నికల్లో లాభం పొందాలని పి.వి. నరసింహారావు నాయకత్వంలోని కాంగ్రెసు(ఐ) కేంద్రప్రభుత్వం పెద్ద ఎత్తే వేసింది; నేటికీ ఎలాగోలా ఆ లక్ష్యసాధనకే కృషిచేస్తున్నది. కాని ఇందుకుగాను చేసిన మొదటి భగీరథయత్నం కాస్తా, జమ్మూ-కాశ్మీరులో ఎన్నికలకు పరిస్థితులు అనువుగా లేవని ఎన్నికల కమిషన్ ఏకగ్రీవంగా ప్రకటించడంతో, పూర్తిగా బెడిసికొట్టింది. ఈ నిర్ణయానికి ఎన్నికల కమిషన్ రావడానికి కారణాలు అనేకం.

మొదటగా ఫరూఖ్ అబ్దుల్లా నాయకత్వంలోని నేషనల్ కాన్ఫరెన్స్ ఎన్నికల్లో పాల్గొనడంపై భారత ప్రభుత్వం ఎన్నో ఆశలు పెట్టుకుని వున్నది. ఇతర తీవ్రవాద వర్గాల వలె గాక నేషనల్ కాన్ఫరెన్స్ (ఫరూఖ్) వర్గం వారు భారత రాజ్యాంగ పరిధిలోనే కాశ్మీరుకు 1952-54 నాటి స్వయం ప్రతిపత్తిని తిరిగియివ్వాలని కోరుతున్నారు. కాని పి.వి. నరసింహారావు అందుకుకూడ సిద్ధపడ 1975లో కుదిరిన షేక్ అబ్దుల్లా-ఇందిరా గాంధీ ఒప్పందంవల్ల ఒనగూడే స్వయంప్రతిపత్తి మాత్రమే యిస్తానన్నాడు. దానితో నేషనల్ కాన్ఫరెన్సు కూడ చిన్నబుచ్చుకొని, ఎన్నికల్లో తా పాల్గొనలేమని నిష్కర్షగా ప్రకటించింది. విధిలేని పరిస్థితుల్లో, పదవీకాంక్షతో, 1975లో షేక్ అబ్దు ఇందిరాగాంధీతో చేసుకున్న ఒప్పందం జమ్మూ-కాశ్మీరుకు నిజానికి ఏ స్వయంప్రతిప

ప్రసాదించలేదు. అబ్దుల్లా సన్నిహిత సహచరులుసైతం అందుకు ఆయన్ని తప్పు బట్టారు. ఇతరులైతే పదవికోసం అమ్ముడుపోయిన పరమద్రోహిగా ఆయన్ను నిందించారు! ఈనాటికీ నిందిస్తున్నారు. నేటికీ శ్రీనగర్‌లోని షేక్ అబ్దుల్లా సమాధిని భారతసైన్యం కాపలా కాయవల్సి వస్తున్నదంటే, ఒకప్పుడు కాశ్మీరు సింహంగా పేరుపొందిన ఈ మహానుభావుడు తన దిగజారుడుతనం వల్ల ఎంత అపఖ్యాతి కొని తెచ్చుకున్నాడో స్పష్టమే గదా. ఆయన కొడుకు ఫరూఖ్ అబ్దుల్లాకు కూడ రుచించని ఆ ఒప్పందం నేడు ఎవరికి కావాలి? అసలే తీవ్రవాదుల ఆయుధ బలానికి, కాశ్మీరీ ప్రజల ఆగ్రహావేశాలకు భయపడి యింతదాకా లండన్‌లో తలదాచుకున్న ఫరూఖ్ అబ్దుల్లా ఈ ఖాళీ చిప్ప పట్టుకుని కాశ్మీరీ ప్రజలకు తన మొహం ఎట్లా చూపించగలడు? కనుక కనీసం 1952-54 నాటి స్వయం ప్రతిపత్తి అయినా (అంటే భారత రాజ్యాంగంలోని కొన్ని అధికరణాలు మాత్రమే జమ్మూ-కాశ్మీరుకు వర్తించడం, అక్కడి ముఖ్యమంత్రిని ప్రధాని (వజీరె ఆజమ్) అని, గవర్నరును సదర్-ఇ-రియాసత్ అని అనడం, ఎన్నికయిన వ్యక్తే గవర్నరుగా వుండడం, అతి అరుదైన సందర్భాల్లో తప్పితే రాష్ట్రపతి పాలన విధించే అవకాశం లేకపోవడం వగైరాలు, యివ్వకపోతే ఎన్నికల్లో పాల్గొనడం అసాధ్యమని ఫరూఖ్ అబ్దుల్లా స్పష్టం చేశారు. పోతే పాకిస్తాన్ అనుకూల గెరిల్లా సంస్థలు మాత్రం ఎలాంటి ఎన్నికల ప్రయత్నాలనైనా మొగ్గలోనే తుంచివేయాలని, భయ బీభత్సాలతో జమ్మూ-కాశ్మీరు నంతటినీ ముంచెత్తాలని కృతనిశ్చయంతో వుండనే వున్నారు. అంతేగాక వివిధ పాక్ అనుకూల సంస్థల బాహాట వేదికగా వుంటూవస్తున్న అఖిలపక్ష హుర్రియత్ సదస్సు, దానిలో ఇటీవలే చేరిన జె.కె.ఎల్.ఎఫ్. (మాలిక్) ప్రధానవర్గాలు కూడ మొదటినుంచే ఎన్నికల్లో పాల్గొన నిరాకరించాయి. పైగా సైనికంగా చూచినా 1994 కంటె 95లో శాంతిభద్రతల పరిస్థితులు బాగా విషమించడం, ఎన్నికల ప్రక్రియలో పాల్గొనడానికి జమ్మూ అండ్ కాశ్మీరు ప్రభుత్వోద్యోగులంతా మూకుమ్మడిగా నిరాకరించడం, అక్కడి ఉన్నతాధికారులెవరూ కనీసం ఏమాత్రం గణాంక వివరాలైనా సమర్పించ లేకపోవడంలాంటి దుర్గమమైన అడ్డంకుల నడుమ ఎంతటి ప్రజ్ఞా వంతులు, కార్యదక్షులైనా గానీ ఎన్నికలెలా నిర్వహించగల్గుతారు? పైగా శ్రీనగర్‌కు ఎన్నికల కమిషన్ వచ్చినప్పుడు అందుకు నిరసనగా హుర్రియత్ యిచ్చిన బంద్ పిలుపుతో నగరంలోనే గాక కాశ్మీరు లోయ అంతటా జనజీవనం స్తంభించి పోవడం చూస్తే అక్కడి పరిస్థితులు ఎంత విషమంగా వున్నాయో సామాన్యులకైనా తేలిగ్గా బోధపడుతుంది గదా. అంతేగాక ఎలాగైనా సరే ఎన్నికల ప్రక్రియను విచ్ఛిన్నం చేయాలనే దృఢ నిశ్చయంతో ఎన్నడూ లేనంత పెద్దయెత్తున అత్యధునాతన ఆయుధాలు, విశేష పోరాట నైపుణ్యంగల విదేశీ కిరాయి సైనికులు, గెరిల్లా వాలంటీర్లు సరిహద్దులు దాటి కాశ్మీరులోయలోను, జమ్మూ ప్రాంతంలోను చొరబడ్డారని కూడ విశ్వసనీయ నివేదికలు అందాయి. కనుకనే ప్రధాన ఎన్నికల కమిషనర్ టి.ఎన్.శేషన్ అక్కడి పరిస్థితుల్ని బాగా మదింపుచేసి, యితర యిద్దరు ఎన్నికల కమిషనర్ల ఏకీభావాన్ని కూడ సాధించి, ప్రస్తుత పరిస్థితుల్లో జమ్మూ-కాశ్మీరులో ఎన్నికల నిర్వహణ అనేది ఎంతమాత్రం కుదరని పని అని తేల్చి చెప్పేశారు.

అయితే జమ్మూ ప్రాంతంలో పట్టుగల పాంథర్సు పార్టీ (హిందూవాద, భారత అనుకూల పార్టీ) అధ్యక్షుడు భీమ్ సింగ్ ఎన్నికల కమిషన్ నిర్ణయాన్ని సవాలు చేస్తూ సుప్రీంకోర్టులో రిట్ పిటిషన్ దాఖలు చేయడం, ఏవిధంగానైనా ఎన్నికల కమిషన్ నిర్ణయాన్ని తిరగదోడించి, ఎలాగోలా (ఎంతటి రక్తపాతం నడుమైనా) ఎన్నికలు జరిపించి, రాజకీయలాభం పొందుదామని చూచే పి.వి.నరసింహారావు ప్రభుత్వం కూడ భీమ్‌సింగ్ వాదనలకు వత్తాసు పలకడంతో, ఇటీవల సుప్రీంకోర్టువారు ఎన్నికల కమిషను, కేంద్ర ప్రభుత్వవర్గాలు కలిసి చర్చలు జరిపి కాశ్మీరులో ఎన్నికల సాధ్యాసాధ్యాలగురించి మళ్లీ ఒక నిర్ణయానికి రావాలంటూ అర్ధంతర ఉత్తరువులు జారీచేశారు. ఆ విషయమై ఎన్నికల కమిషన్ యిప్పుడిప్పుడే కేంద్రప్రభుత్వంతో మంతనాలకు ఉద్యుక్తమవుతున్నది. ఏమైనా యిందువల్ల పెద్దలాభం ఏమీ ఒనగూడదనీ, రాజకీయ పరిష్కారం ఏదో ఒకటి కుదరకుండా ఎలాగోలా ఎన్నికలు జరపజూస్తే భీషణ రక్తపాతం, భారీ రిగ్గింగులు తప్పవని, అందువల్ల కాశ్మీరు సమస్య మరింత జటిలమై మనం అంతర్జాతీయంగాకూడా అభాసుపాలవుతామేగాని దేశానికి మాత్రం ఏ మేలు కలగదని నా నిశ్చితాభిప్రాయం.

## ప్రభుత్వ, ప్రైవేటు టెర్రరిజాలు - మానవ హక్కుల ఉల్లంఘనలు :

ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్య వాదులందరినీ ఎంతో కలవరపెట్టే సమస్య జమ్మూ-కాశ్మీరులో అంతకంతకు పెరిగిపోతున్న ప్రభుత్వ, ప్రైవేటు టెర్రరిజాలూ, పర్యవసానంగా సంభవిస్తున్న ఘోరమైన మానవ హక్కుల ఉల్లంఘనలూనూ.

సోపూరులో భద్రతాదళాలకు చెందిన యిద్దరు జవాన్లు మిలిటెంట్ల దాడులకు గురై మరణించడంతో ఆగ్రహోన్మత్తులైన భద్రతా దళాలవారు చట్టం, రాజ్యాంగం అన్నీ తుంగలో తొక్కి, అక్కడి ప్రజలపై (1993 జనవరి 6న) అమానుష అత్యాచారాలు జరపడం - అమాయకులైన 53 మందికి పైగా ప్రజల్ని కాల్చి చంపడమే గాక, లక్షలాది రూపాయల విలువచేసే ఆస్తులు ధ్వంసం చేయడం, అనేకమంది స్త్రీలను చెరచడం - కాశ్మీరు ప్రజలనే గాక, ప్రపంచవ్యాప్తంగా మానవతావాదుల్ని, ప్రజాస్వామ్య ప్రియుల్ని దిగ్భ్రాంతుల్ని చేసింది. అలాగే అంతకు పూర్వం మీర్వైజ్ మౌల్వీమహమ్మ( ఫరూఖ్‌ను ఎవరో దుండగులు కాల్చిచంపిన పిదప, ఆ మరుసటి రోజు (1990 మే 22న) అయ( అంత్యక్రియల ఊరేగింపుపై భద్రతాదళాలు విచక్షణ లేకుండా కాల్పులు జరిపి 20 మందికి పై( అమాయకుల్ని బలిగొనడం, అలాగే 1993 అక్టోబరులో హజరత్ బాల్ సంక్షోభమప్పుడు కర్ఫ్యూన( ధిక్కరించి ప్రార్థనలకు తరలివస్తున్న ముస్లిం ఆరాధకులపై బిజ్ బిహారావద్ద యిచ్చ వచ్చినట్లు కాల్పులు జరిపి 37 మందికి పైగా అమాయకుల్ని చంపివేయడం - యివన్నీ మచ్చుకు కొన్ని ఘటనలే. పైగా ఎన్‌కౌంటర్ల పేరిట, యుద్ధ విరమణ రేఖ (అసలు అదుపు గీత) దాటి చొరబడుతుండగా కాల్పులు జరుపుతున్నామనే నెపంతో వందలు, వేల సంఖ్యలో కాశ్మీరీ యువకుల్ని దారుణంగా కాల్చి చంపేస్తున్నారని, వారి శవాలవద్ద తర్వాత ఆయుధాలు, బాంబులు గట్రా వుంచి వారిని దుండగులుగా చిత్రిస్తున్నారనికూడ వార్తలు, ఫిర్యాదులు వస్తున్నవి. ఇప్పటిదాకా 15 వేల

మందికి పైగా మిలిటెంట్లు భద్రతాదళాల కాల్పుల్లోమరణించివుంటారని ఒక అంచనా. 1980 లలో, 1990-92లో దేశాన్ని గడగడలాడించిన పంజాబు టెర్రరిజం, దాన్ని అణచివేయడానికి ప్రభుత్వం సాగించిన తీవ్ర దమనకాండలుకూడ ఈ మారణహోమం ముందు దిగదుడుపేనంటున్నారు. కాశ్మీరులోని సాయుధ తిరుగుబాటును 'మారుమనిషి యుద్ధం' (Proxy War)గా అభివర్ణిస్తూ భారత ప్రభుత్వం ఈ దురంతాలకు పాల్పడుతున్నదనే విమర్శలు చెలరేగుతున్నాయి.

కాశ్మీరు కల్లోలాన్ని మారుమనిషి యుద్ధం (Proxy War)గా పేర్కొనడం మూలంగా భారత ప్రభుత్వానికి దౌత్య రంగంలోనూ, యథార్థ రాజకీయ రంగంలోనూ మూడు ముఖ్యప్రయోజనాలు ఒనగూడుతున్నాయిః (1) ఇప్పుడు సాగుతున్న రాజకీయ వుద్యమపు న్యాయసమ్మతత్వాన్ని (legitimacy ని) కుంగదీయడం, అది ప్రజల అభిమతాలకు, డిమాండ్లకు అనుగుణంగా జరుగుతున్న మహత్తర పోరాటంగా కాక ఏదో పాకిస్తాన్ చెప్పుచేతల్లో దారితప్పిన యువజనులు గుట్టుగా జరుపుతున్న దేశద్రోహకర యుద్ధమని చెప్పి అభాసుపాలు చేయడం; (2) అంతా సరిహద్దుల ఆవలి తోడేళ్ల వల్లనే జరుగుతున్నదని, కనుక మిలిటెంట్లకు బాహ్యవనరులు అందకుండా చేస్తే చాలు, అంతా చక్కబడుతుందని చెప్పి ప్రజలను మభ్యపెట్టడం; (3) అక్రమ చొరబాటుదారుల్ని కాల్చివేస్తున్నామనే పేరిట కాశ్మీరులో క్రమక్రమంగా జన నిర్మూలన (genocide) గావించడం - ఇప్పుడైతే భద్రతాదళాలు 1:20 నిష్పత్తిని బీరుపోకుండా కాపాడుతున్నాయి. అంటే భద్రతాదళాలకుచెందిన ఒక్క వ్యక్తి గనుక మిలిటెంట్ల చేతుల్లో మరణిస్తే అందుకు ప్రతీకారంగా కనీసం 20 మంది యువకుల్ని (అమాయకుల్ని) చంపివేయడమన్న మాట. ముమ్ముందు ఈ నిష్పత్తిలో కాశ్మీరీ యువకుల అనుపాతం మరింత పెరిగే నిజమైన ప్రమాదం కూడ వున్నది. అలాగే ప్రజాస్వామ్య రాజ్యమనే ముసుగు ధరించివుండడంవల్ల భారతప్రభుత్వం తమ దారుణ నిర్బంధాన్ని చట్టపరమైన అలంకరణలు చేసి మరీ అమలు పరుస్తున్నది. ఉదాహరణకు టాడా (టెర్రరిస్టు వ్యతిరేక చట్టం), భద్రతా వలయ చట్టం, అన్నింటికంటె దారుణమైన సైనిక బలగాల (ప్రత్యేక అధికారాల) చట్టాల ద్వారా ఈ మారణ హోమాన్ని, వేలాది యువజనుల అక్రమ నిర్బంధాలను సాగిస్తున్నదని కాశ్మీరీ పోరాటాన్ని సమర్థించేవేగాక నిష్పాక్షికమైన యితర అనేక మానవ హక్కుల సంఘాలు కూడ ఆరోపిస్తున్నాయి.

అదే సమయంలో తీవ్రవాద మిలిటెంట్లు సైతం దారుణ దమన చర్యలకు, మానవహక్కుల ఉల్లంఘనలకు పాల్పడుతున్న ఘటన లనేకంకూడ వెలుగులోకి వస్తున్నాయి. ప్రత్యర్థి వర్గాల మద్దతుదారుల్ని నిర్దాక్షిణ్యంగా చంపివేయడం, ఇచ్చవచ్చినట్లు లూటీలు, మానభంగాలు జరపడం, పత్రికలపై దాడులుచేయడం ముమ్మరం అవుతున్నాయని, ఈ రెండు రకాల బీభత్సవాదాల నడుమ నలిగిపోతున్న సామాన్య ప్రజల పరిస్థితి 'ముందు నుయ్యి, వెనుక గొయ్యి' చందంగా పరిణమించిందని అనేకమంది నిష్పాక్షిక పరిశీలకులే వెల్లడిస్తున్నారు. అంతేగాక, ఎన్నో అత్యాచారాలు జరిపి హిందూ పండిట్లను కాశ్మీరు లోయ నుండి తరిమివేయడమేగాక, ఒక పథకం ప్రకారం

జమ్మూలో హిందువుల్ని వేరుచేసి చంపుతూ బీభత్సం, మత కలహాలు సృష్టించడానికి, ముస్లిం మెజారిటీ జిల్లాలనుండి హిందువుల్ని పారదోలడానికి, సర్వత్రా అరాచక పరిస్థితులు వ్యాపింపజేయడానికి తీవ్రవాద వర్గాలు తలపడుతున్నాయికూడ. అలాగే అమాయకులైన విదేశీ పర్యాటకుల్ని, యితరుల్ని బందీలుగా పట్టుకోవడం, వారిలో కొందరిని చంపివేయడం మొదలైన మానవతా విఘాతక చర్యలకు కూడ పాల్పడుతున్నారు.

ముమ్ముందు జమ్మూ-కాశ్మీరులో పరిస్థితులు మరింతగా విషమించవచ్చని, యిప్పుడు ప్రపంచాన్నంతటినీ కలవర పరుస్తున్న బోస్నియా దురంతాలు, రువాండా-బురుండీ ఊచకోతలు మొదలైన దారుణ అత్యాచారాలు, మారణహోమాలకు ఏమాత్రం తీసిపోని విధంగా యిక్కడ యిరుపక్షాలా అణచివేతలు, నరికివేతలు సంభవించినా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదని అభిజ్ఞవర్గాలు అభిప్రాయపడుతున్నాయి.

## పాక్ ఆక్రమిత కాశ్మీరు (POK)లోని పరిస్థితులు:

మనదేశ అధీనంలోని కాశ్మీరులో యింత దారుణమైన పరిస్థితులు నెలకొని వున్నాయన్నంత మాత్రాన 'ఆజాద్ కాశ్మీరు' అనబడే పాక్ ఆక్రమిత కాశ్మీరులో అంతా చక్కగా వున్నదనైతే అర్థం కాదు. అక్కడి ప్రజలు సాయుధ తిరుగుబాటు లేక పెద్దయెత్తు నిరసనోద్యమాలు సాగించకున్నా వారుసైతం అసంతృప్తి, ఆందోళనలతో కుతకుతలాడుతూనే వున్నారు. భారత రాజ్యాంగంలోలా పాకిస్తాన్ రాజ్యాంగంలో (అజాద్) కాశ్మీరును ఆ దేశంలో అంతర్భాగంగా పేర్కొనకున్నా, సరిహద్దుల రక్షణకు పాకిస్తాన్ సైన్యాలు తిష్టవేసి వుండడం, ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వానికి తగినంత స్వయంప్రతిపత్తి లేక పోవడం, పాకిస్తాన్‌లో విలీనానికి ఒప్పుకోని కాశ్మీరీ పోరాట వాదులపై ఆంక్షలు, నిర్బంధం సాగడం వగైరా పరిణామాలు అక్కడా కలవరం కలిగిస్తూనే వున్నాయి. ఈ విషయం 1993లో (లేక 1994లో) జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన సంస్థాపక చైర్మన్ అమానుల్లాఖాన్ పిలుపుపై కాశ్మీరీ ఆజాదీ పోరాటవాలంటీర్లు అసలు అదుపు గీత (LAC) దాటి భారత అధీన కాశ్మీరులోకి మార్చ్ చేయ వుద్యమించినప్పుడు బాగా వెల్లడయింది. భారతదేశం ఈ మార్చ్‌ను శత్రుచర్యగా భావిస్తామని తీవ్ర హెచ్చరిక చేయడంతో సరిహద్దుల్లో పెద్ద ఘర్షణలు కొని తెచ్చుకోవడం యిష్టపడని పాకిస్తాన్ సైనిక దళాలు ఈ మార్చ్‌ను అడ్డుకొన్నారు. ఆ క్రమంలో ఆజాదీ కోరే కాశ్మీరీ వాలంటీర్లను అనేక చోట్ల చితకబాదారు. కొన్ని చోట్ల కాల్పులు కూడ జరిపారు. అవసరం కంటె ఎంతో ఎక్కువ మోతాదులో బలప్రయోగం చేసి నిజానికి వారి కాశ్మీరీ ద్వేషాన్ని చాటుకున్నారని ఆజాదీ వుద్యమకారుల ఆరోపణ.

అలాగే భారతదేశంలోనో లేక పాకిస్తాన్‌లోనో చేరాలి అన్నంతవరకే కాశ్మీరీల స్వయం నిర్ణయాధికార హక్కు పరిమితం కారాదని, కాశ్మీరీలకు మూడవ వికల్పం (third option) వుండాలని, అంటే అత్యధిక కాశ్మీరీలు గనుక స్వాతంత్ర్యాన్ని కోరుకుంటే వారు స్వతంత్ర్య రాజ్యంగ మనడానికి అవకాశం వుండాలనే J.K.L.F. (అమానుల్లాఖాన్) వాదం పాకిస్తాన్ పాలకులకు ఏమాత్రం రుచించడంలేదు. తామీ మూడవ వికల్పాన్ని (third option ను) ఖండిత

తిరస్కరిస్తున్నామని, అది కూడ పొందుపర్చే పక్షంలో అసలు ప్లెబిసైటునే వ్యతిరేకిస్తామని పాకిస్తానీ పాలక వర్గాలు పలుమార్లు స్పష్టం చేశాయి. మరీ ఇటీవల పాకిస్తాన్ ప్రధాని బేనజీర్ భుట్టో కూడ యిదే విధమైన ప్రకటన చేస్తూ, ఐ.రా.స. భద్రతా మండలి తీర్మానాల మేరకు భారతదేశంలో చేరాలా లేక పాకిస్తాన్‌లో చేరాలా అనే రెండు వికల్పాలకే కట్టుబడి ప్లెబిసైటు జరిపించాలనేదే తమ డిమాండని, మూడవ వికల్పానికి తాము ఎట్టి పరిస్థితుల్లోనూ సమ్మతించబోమని స్పష్టం చేసింది.

పోతే పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీరు (POK)లో మరీ యిటీవల కాశ్మీరీ స్వాతంత్ర్యానుకూల సంస్థలు, యితర కాశ్మీరీ ప్రజాసంఘాలు పాకిస్తాన్ ప్రభుత్వ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా పెద్దయెత్తున ప్రదర్శనలు, ఆందోళన జరుపుతున్నట్లు తెలియవస్తున్నది. పాకిస్తానీ సైనిక గూఢచారి విభాగం I.S.I. కి ఒక పెద్ద కేంద్రం నిర్మించే నిమిత్తం ఆజాద్ కాశ్మీరులో కొన్ని వందల ఎకరాల విశాల క్షేత్రాన్ని స్థానిక ప్రభుత్వం మంజూరు చేయడం పట్ల - అదీ కాశ్మీరీకాని ఒక పాకిస్తానీ పౌరునికి యివ్వడం పట్ల - నిరసనగా ప్రస్తుత వుద్యమం కొనసాగుతున్నదట. కాశ్మీరేతరులు భూములు, స్థిరాస్తులు సముపార్జించుకునే వీలు, హక్కు భారత ఆధీన కాశ్మీరులోనే లేనప్పుడు, ఆజాద్ కాశ్మీరులో యిలాంటి దుశ్చర్య ఏమిటని వారు నిగ్గదీస్తున్నారట. అంతేగాక ఆజాద్ కాశ్మీరు రాజ్యాంగంలో స్వాతంత్ర్యం ప్రస్తావనే లేకుండా పాకిస్తాన్‌లో చేరికను వ్యతిరేకించడం పాపమన్నట్లు రాసివుండడాన్ని కూడ వారు సవాలు చేస్తున్నారు. జమ్మూ-కాశ్మీరు లిబరేషన్ ఫ్రంట్ (J.K.L.F.) స్థానికశాఖ, జమ్మూ-కాశ్మీరు జాతీయ అవామీ పార్టీ, జమ్మూ-కాశ్మీరు జాతీయ ప్రజాస్వామ్య పక్షం, జాతీయ విద్యార్థి సమాఖ్య, యింకా కొన్ని యితర సంస్థలన్నీ కలిసికట్టుగా ఈ వుద్యమం ుడుపుతున్నాయని, రావల్‌కోట్, అబ్బాస్‌పూర్, హైచేరా, బాగ్, ముజఫరాబాద్, బింబన్, కోట్లీ ుదితర పట్టణాల్లో నిరసన ప్రదర్శనలు జరుగుతున్నాయని, ముఖ్యులైన నాయకులు - అబిద్ మజీద్, సర్దార్ సగీర్ బేడీ, అష్ఫాక్ ఖాన్, షౌఖత్ నాజిర్, అబిద్ హుసేన్ అబిద్ ప్రభృతులు కొందరు అరెస్టు చేయబడి జైళ్లలో మగ్గుతున్నారని, ప్రదర్శకులను పాకిస్తానీ భద్రతాదళాలవారు, ఆజాద్ కాశ్మీరు పోలీసులు లాఠీ చార్జీలకు, కొన్ని సందర్భాల్లో చిత్రహింసలకు కూడ, గురిచేస్తున్నారని కాశ్మీరు అంతర్జాతీయ సమాఖ్య (పాక్ ఆక్రమిత కాశ్మీరులో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకోసం పోరాడే వివిధ సంస్థల సంయుక్త వేదిక) యిటీవల లండన్ నుండి ఒక ప్రకటన చేసింది. కనుక ప్రస్తుతానికి భారత ఆధీన జమ్మూ-కాశ్మీరుకే సాయుధ తిరుగుబాటు, కల్లోల పరిస్థితులు పరిమితమై వున్నా, 'ఆజాద్ కాశ్మీరు' లో కూడ వుద్యమం అసలు లేకపోలేదని, మున్ముందు అక్కడికి కూడ ఆజాదీ పోరాటం బాగా వ్యాపింపవచ్చని తెలుసుకోవాలి.

## మత ప్రాతిపదిక-ద్విజాతి సిద్ధాంతం :

మరి యింత బాగోతం వున్నప్పుడు అసలీ కాశ్మీరు సమస్యకు పరిష్కారం ఎప్పటికైనా లభించేనా? ఎలా జరిగేను? ఎలా జరిగితే బాగుంటుంది అనే ప్రశ్నలు ప్రతి ఒక్కరినీ వేధిస్తున్నాయి. ఇందుకు సంబంధించి పరిష్కార మార్గం యిలా వుంటే బాగుంటుందని ఈవరకే

కొంత వివరంగా సూచించాము. యిప్పుడు మరి కొన్ని వివరాలకు వెళ్దాము.

మనం ఎంత లౌకికవాదులమని చంకలు గుద్దుకున్నా, భారతదేశ విభజన మతప్రాతిపదికపైనే జరిగిందని, జిన్నా ప్రతిపాదించిన ద్విజాతి సిద్ధాంతమే ఆఖరుకు నెగ్గిందని, ఈ రెండు 'జాతులు' మరిన్ని జాతులుగా చీలనైతే చీలవచ్చేమో గాని (బంగ్లాదేశ్ ఏర్పాటుతో యిప్పు డో మూడో 'జాతి' అధికారికంగా అంతర్జాతీయ గుర్తింపుతోనే ఉనికిలోకి వచ్చింది గదా), భారత ఖండమంతా ఒకే జాతి అవడం మాత్రం అసంభవమని (ఏవో అద్భుతాలు జరిగితే తప్ప) గ్రహించాలి. అందునా అభిలషణీయం వేరు, ఆచరణీయం వేరు. భారత ఉపఖండ మంతా ఒకే కుటుంబంగా వుంటే ఎంత బావుణ్ణనే ఆశ, అభిలాష నాకూ వున్నాయి. కాని నేటి కఠోర వాస్తవాలు, రేపటెల్లుండి పరిణామాల సంభావ్యతలు, సాధ్యాసాధ్యాలు పరిశీలించి చూస్తే అది ఆచరణీయం కాదన్న గ్రహింపూ వున్నది. మరి ఈ కాశ్మీరు సంక్షోభం కూడ 1947 దేశ విభజన పర్యవసానంగా తలయెత్తి, విజృంభించి, పేరుకుపోయి, మళ్లీ చెలరేగుతున్న సమస్యేనని మనం మొదటగా తెలుసుకోవాలి. ఏదో పైపైకిగా కాక లోలోపలగా అంతరాంతరాల్లో ఆ గ్రహింపు మనకు రావాలి.

ఆ గ్రహింపు వస్తే లౌకికవాద కొలమానాలు లేక గీటురాళ్లపై కాశ్మీరు సమస్యకు పరిష్కారం కుదరదని కూడ మనం తెలుసుకోగల్గుతాము. జమ్మూ-కాశ్మీరులో హిందువులున్నారు, ముస్లింలున్నారు, సిక్కులున్నారు, బౌద్ధులున్నారు, చెదురుగా కొందరు క్రైస్తవులూ వున్నారు. ముస్లింలు అధిక మెజారిటీగా, ప్రత్యేక అస్తిత్వచైతన్యంగల ఒక సముదాయంగా (లేక రెండు, మూడు - కాశ్మీరీ ముస్లింలు, జమ్మూ ముస్లింలు, ఉత్తరాది ముస్లింలు - సముదాయాలుగా) వున్నారు. వారేగాక అక్కడ అన్ని వర్గాల వారూ దేశ విభజన కాలపు స్మృతులు, వారసత్వాలు యింకా చెరిపివేసుకో లేకున్నారు. ఈ స్థితిలో యిక్కడి హిందువులు, కొద్ది సంఖ్యలో వున్న సిక్కులు, బౌద్ధులు, చెదురుగావున్న క్రైస్తవులుకూడ కలిసి ఒకే రాజ్యంలో ఐకమత్యంతో వుండగలరేమో కానీ, వారు జమ్మూ, లేక కాశ్మీరీ లేక ఉత్తరాది ప్రాంతాల ముస్లింలతో కలిసి ఒకే రాజ్యంగా మనగల్గడం మాత్రం కల్లే. ఇక్కడ నిజంగానే 'ఒకే ఒరలో రెండు కత్తులు యిమడవు'.

## అసలు వివాదం దేన్ని గురించి?

ఇప్పటికే అవిభక్త జమ్మూ-కాశ్మీరు రాష్ట్రంలో (విస్తీర్ణంలో) సగభాగానికి కొంచెం ఎక్కువగా పాకిస్తాన్, చైనాల అధీనంలో వున్న విషయం మన మీ వరకే గమనించాము. ఆ భాగంలోని గిల్గిట్ ఏజెన్సీ గురించి, హంజా - నాగీర్, బాల్టిస్తాన్‌లను గురించి - అంటే ఉత్తరాది ప్రాంతాలను గురించి భారతదేశానికి ఎన్నడూ ఆశ లేక పట్టింపు అంతగా లేవు. ఏమైనా ఆశ, పట్టింపు వుంటే అవి పాకిస్తాన్ ఆక్రమణలోని కాశ్మీరులోయ భాగాన్ని గురించి మాత్రమే. అవిభక్త జమ్మూలోని పాక్ అధీన ప్రాంతం. (మీర్‌పూర్, పూంఛ్‌లో కొంత భాగం) గురించి కూడ భారత ప్రభుత్వానికి అంత పట్టింపు వున్నట్లు అగుపించడంలేదు. పోతే పాకిస్తాన్‌కు సంబంధించినంత వరకు, వారికి లడఖ్‌పై ఎన్నడూ అంత ఆశ, పట్టింపు లేవు. కాకుంటే ముస్లిం జన బాహుళ్యం గల కార్గిల్ జిల్లా గురించి కొంత వుంటే

వుండవచ్చు. ఇక జమ్మూ విషయం వారికి పట్టివున్నా, యిప్పుడక్కడ విస్తృత ప్రాంతాల్లో హిందూ మెజారిటీయే అత్యధికంగా వున్నది కాబట్టి, వారి పట్టింపు ముస్లిం మెజారిటీ గల పూంఛ్, రాజౌరీ, దోడాలకే పరిమితమై వుంటుంది. అయినా ఒక సమగ్ర పరిష్కారం కుదిరే ప్రయత్నాల్లో భాగంగా వారీ పట్టింపునుకూడ గణనీయంగా విస్మరించగల్గుతారనే నా అభిప్రాయం. ఏమైనా చివరకి కాశ్మీరు లోయ, పూంఛ్, రాజౌరీలు మాత్రమే ఇరువురి నడుమ తీవ్ర వివాదాస్పద ప్రాంతంగా వున్నది. ఎప్పటికీ అలా వుంటుంది కూడ.

## వివిధ పరిష్కార మార్గాల్లో మొదటిది :

అందుచేత ఈ కాశ్మీరు లోయ + పూంఛ్ + రాజౌరీ ప్రాంతాన్ని ( ఈ పుస్తకంలో యిచ్చిన పటంలో గళ్లుగళ్లున్నమేర) మినహాయించి మిగతా (అవిభక్త) జమ్మూ-కాశ్మీరు రాజ్యాన్ని భారత, పాకిస్తాన్‌లు యిప్పటి తమ తమ అధీన ప్రాంతాల ప్రకారం - అంటే గిల్గిత్, హంజా-నగీర్, బాల్టిస్తాన్‌లు, LAC ఆవలి మీర్‌పూర్, పూంఛ్‌లో కొంత భాగం పాకిస్తాన్‌కు గానూ, జమ్మూ (దోడాతో యుక్తంగా), లడఖ్‌లు ఇండియాకు గానూ - పంచివేసుకోవచ్చు. వివాదస్పదమైన కాశ్మీరు లోయ + పూంఛ్ + రాజౌరీలకే ప్లెబిసైట్ పరిమితం చేయవచ్చు. పోతే ఇరువైపుల కొంతమేర జనాభా మార్పిడులు (transfer of populations) కూడ క్రమబద్ధంగా చేసుకుని భవిష్యత్తులో మతకలహాలు, తదితర ఘర్షణల సంభావ్యతను బాగా తగ్గించివేయవచ్చు. ఇది ఒక పరిష్కారం. నాకు ఆమోదయోగ్యమైన పరిష్కారం. అయితే యిది నేనేదో మరీ కొత్తగా సూచిస్తున్నట్లేమీ కాదు. సర్ ఓవెన్ డిక్సన్ (భారత-పాకిస్తాన్‌లకు ఐ.రా.స. పంపిన అధికార ప్రతినిధి) 1950 సెప్టెంబరు 15వ తేదీనాడు ఐ.రా.స. భద్రతామండలికి సమర్పించిన నివేదికలో యించుమించు యిదే విధమైన పరిష్కారం సూచించబడింది. పైగా ఈ సూచనలకు అప్పట్లో భారత ప్రభుత్వం సుముఖత వ్యక్తం చేసినా, పాకిస్తాన్ మాత్రం యావత్ జమ్మూ-కాశ్మీరు రాజ్యమూ ఒక్క యూనిట్‌గా (అంతకు మునుపు పాసైన భద్రతా మండలి తీర్మానాల ప్రకారమే) ప్లెబిసైటు జరగాలని పట్టుబట్టినట్లు ఆయన ఆ నివేదికలో పేర్కొన్నాడు కూడ.

## రెండవ పరిష్కార మార్గం :

సరే, ఇంకో పరిష్కారం భద్రతామండలి తీర్మానాలప్రకారం మొత్తం జమ్మూ-కాశ్మీరులో ప్లెబిసైటు జరిపించడం. ఏదైనా ప్రత్యేకంగా సూచించిన ఒక అంశంపై ఒక ప్రాంతపు ప్రజలు లేక దేశ ప్రజలందరినుండి ప్రత్యక్ష ఓటింగు ద్వారా ఖండితమైన పరిష్కారానికి వచ్చే ప్రక్రియను ప్లెబిసైటు అంటారు. దీనికీ రిఫరెండం (జనవాక్య సేకరణ)కూ రాసిలో, వాసిలో కొన్ని తేడాలున్నా, ప్రాథమికంగా రెంటి లక్షణాలూ ఒకటేనని తెలుసుకోవాలి. సరే మొత్తం జమ్మూ-కాశ్మీరులో ప్లెబిసైటు జరిపించితే ఫలితం ఎలా వుండవచ్చు?

మన అధీనంలోని జమ్మూ-కాశ్మీరు జనాభా 1981లో సుమారు 60లక్షలు (ముస్లింలు

38.5 లక్షలు, హిందువులు 19.4 లక్షలు, సిక్కులు 1.4 లక్షలు. తదితరులు బౌద్ధులు, క్రైస్తవులు) వుండగా, పాక్ అధీన జమ్మూ-కాశ్మీరులో ఆజాద్ కాశ్మీరు జనాభా సుమారు 18 లక్షలు, ఉత్తరాది ప్రాంతాల (గిల్గిత్, హంజా-నాగీర్, బాల్టిస్తాన్‌ల) జనాభా 5 లక్షలుగా వున్నది; అక్కడ దాదాపు అంతా ముస్లింలే. అంటే అవిభక్త జమ్మూ-కాశ్మీరు జనాభా 1981 అంచనాల ప్రకారం ఉజ్జాయింపుగా 83 లక్షలు వుంటుంది. ఇప్పుడు యించుమించు ఒక కోటిగా వుండవచ్చుంతే. అయితే మనమిక్కడ 1981 జనాభానే ప్రాతిపదికగా తీసుకుందాం. ఎలాగూ వివిధ సముదాయాల ఓటర్ల సంఖ్యలకు, వాటి జనాభాలకు మధ్య సాధారణంగా ఏకరీతి అనుపాతమే వుంటుంది కాబట్టి, వాటి వాటి మొత్తం జనాభా వివరాలనే ఓటర్ల సంఖ్యా వివరాలుగా తీసుకున్నా ఏమంత పొరపాటు జరగదు. అలాంటప్పుడు మొత్తం జమ్మూ-కాశ్మీరులో భద్రతామండలి తీర్మానాల ప్రకారమే, అంటే భారతదేశంలో చేరాలా లేక పాకిస్తాన్‌లో చేరాలా అన్న రెండు వికల్పాలకే పరిమితంచేసి, ప్లెబిసైటు జరిపితే పరిణామాలు ఎలా వుండగలవో చూద్దాం.

పోలింగ్ అన్ని ప్రాంతాల్లో సమాన తీవ్రతతో (60 శాతం గానీ, ఎంతైనా గానీ ఎక్కడైనా ఒకే శాతంగా) జరిగిందని భావిద్దాం. ఇక్కడ సౌలభ్యం కోసం ప్రతిచోటా నూటికి నూరుగా ఓట్లు పడ్డాయని అనుకుందాం. అలాంటప్పుడు ఆజాద్ కాశ్మీరు, ఉత్తరాది ప్రాంతాలలోని జనాభా యావత్తూ పాకిస్తాన్‌కే ఓటు చేస్తారు. పోనీ ఎందుకైనా మంచిదని ఒక లక్ష ఓట్లు మినహాయించినా, అక్కడ 22 లక్షల ఓట్లు పాకిస్తాన్‌కే పడతాయి. పోతే మన ఆధీనంలోని జమ్మూ-కాశ్మీరులో ముస్లింలు దాదాపు అంతా పాకిస్తాన్‌కే ఓటు చేస్తారు. పోనీ ఒక 3.5 లక్షల మందిని జాగ్రత్తకోసం మినహాయించినా, 35 లక్షల మంది ఖాయంగా పాకిస్తాన్‌కు ఓటుచేస్తారు. ఇక భారతదేశానికి ఓటు చేసేదెవరంటే హిందువులు, సిక్కులు, బౌద్ధులు, స్వల్ప సంఖ్యలో ముస్లింలు - అంతా కలిపి 21.5 + 3.5 + 1 = 26 లక్షలకు మించరు. అంటే ఈ రకం ప్లెబిసైటులో పాకిస్తాన్‌కు 57 లక్షల ఓట్లు, అంటే మూడిట రెండువంతులకు పైగా ఆధిక్యం, లభించి అదే ఘనవిజయం సాధిస్తుంది. దానితో అవిభక్త జమ్మూ-కాశ్మీరు రాజ్యం మొత్తంగా పాకిస్తాన్ పరమైపోతుంది.

## మూడవ వికల్పం (Third Option) :

ఇప్పుడిదే మొత్తం జనాభాను దృష్టిలో వుంచుకుని మూడవ వికల్పాన్ని కూడ జతపర్చి పరిస్థితి ఎలా వుండగలదో పరికిద్దాం. అంటే కాశ్మీరీ స్వాతంత్ర్యం అనే వికల్పాన్ని కూడ చేరుద్దాం. అప్పుడు ఖచ్చితంగా పాకిస్తాన్‌కు పడే ఓట్లు = ఉత్తరాది ప్రాంతాల మొత్తం ఓట్లు + జమ్మూ ముస్లింలలో 75 శాతం దాకా + ఆజాద్ కాశ్మీరు ముస్లింలలో 45 శాతం దాకా + కాశ్మీరు లోయ ముస్లింలలో 40 శాతం దాకా, అంటే 5 + 6 + 8 + 12 = 31 లక్షల దాకా వుంటాయి. కాశ్మీరీ స్వాతంత్ర్యానికి పడే ఓట్లు - ఆజాద్ కాశ్మీర్‌లో మిగతావన్నీ + కాశ్మీరులోయలో 55 శాతం దాకా + జమ్మూ ముస్లింలలో 20 శాతం దాకా అంటే 10 + 17 + 2 = 29 లక్షలదాకా ఖాయంగానైతే వుంటాయి. ఇక భారతదేశానికి కాశ్మీరు లోయలో 5 శాతం + జమ్మూ, లడఖ్‌లలోని హిందువులు,

సిక్కులు, బౌద్ధులు, తదితరులు + జమ్మూ ముస్లింలలో 5 శాతందాకా అంటే 15-20 వేలు + 21.5 లక్షలు + 20 - 25 వేలు = సుమారు 22 లక్షలదాకా వుంటాయి. అంటే అప్పటికీ మొత్తం అవిభక్త జమ్మూ-కాశ్మీరు రాష్ట్రం పాకిస్తాన్‌కే దక్కే అవకాశం వున్నా, ఏమో చెప్పలేం, భారతదేశానికైతే ఎటూ రాదుగదా అని ఎంతో కొంత శాతం హిందువులు, సిక్కులు, తదితరులు కాశ్మీరీ స్వాతంత్ర్యం పట్ల మొగ్గు చూపించినా లేక పాకిస్తాన్ పాలన మరీ నిరంకుశమని భావించి ఇంకా అధిక శాతం కాశ్మీరీ ముస్లింలు, మరికొంత మంది జమ్మూ ముస్లింలు కాశ్మీరీ స్వాతంత్ర్యం కోసం ఓటు చేసినా ఈ మొత్తం రాష్ట్రం కాశ్మీరీ స్వాతంత్ర్యవాదులకే దక్కి, స్వతంత్రదేశంగా ఏర్పడనూ వచ్చు. ఏదేమైనా అవిభక్త జమ్మూ-కాశ్మీరు రాష్ట్రం మొత్తంగా తీసుకుని ఎలాంటి ప్లెబిసైటు జరిపినా, భారతదేశం ఈ మొత్తం రాష్ట్రాన్నీ కోల్పోవడం తథ్యం. ఇక మూడవ వికల్పాన్ని ప్రవేశపెడితే పాకిస్తాన్‌కు కూడ జమ్మూ-కాశ్మీరు దక్కే అవకాశాలు తక్కువే. కనుకనే పాకిస్తాన్ పాలకవర్గాలు సదా ఈ మూడవ వికల్పాన్ని తిరస్కరిస్తూ వచ్చాయి. ఇటీవలే పాక్ ప్రధాని బేనజీర్ భుట్టో కూడ ఈ మూడవ వికల్పాన్ని, దాని ఆధారంగా ఎలాంటి ప్లెబిసైటునే గానీ ఖండితంగా తిరస్కరించింది.

## ఇతర మార్గాలు :

పోతే ఇప్పుడున్న అసలు అదుపు గీత (**LAC**) కి కొంచెం అటూ ఇటూగా, ఏవైనా చిన్నపాటి ఇచ్చి పుచ్చుకోళ్లతో సంతృప్తి పడుతూ, భారత, పాకిస్తాన్‌లు ఈ రాజ్యాన్ని పంచేసుకుని **LAC** ని లేక కొద్దిగా సవరించబడిన **LAC** ని అంతర్జాతీయ సరిహద్దుగా మార్చుకొనడం. అయితే ఇప్పటి పరిస్థితుల దృష్ట్యా ఈ రకమైన పరిష్కారం కుదిరే అవకాశాలు దాదాపు మృగ్యమే.

చివరి, అయితే చాల అవాంఛనీయమైన, పరిష్కార మార్గం భారత-పాకిస్తాన్‌ల మధ్య యుద్ధం ద్వారా 'రాజ్యం వీరభోజ్యం' అంటూ ఏదో ఒకటి అమీతుమీ తెల్చుకోవడం. కాని ఇప్పటి అంతర్జాతీయ, జాతీయ పరిస్థితుల్లో యిది యిరుపక్షాలకూ అసాధ్యమేనని, యుద్ధమంటూ చెలరేగితే భారతదేశానికే ఎక్కువ నష్టం, వెంటనే కాకున్నా కాలక్రమాన, వాటిల్లుతుందని మన మీ వరకే గమనించాము.

కనుక మన భారతదేశానికి నిజానికి రెండే రెండు వికల్పాలున్నాయి. ఒకటేమంటే మూడవ వికల్పాన్ని కూడ చేర్చి మనకైతే ఎటూ దక్కదు కాబట్టి జమ్మూ-కాశ్మీరు ఒక స్వతంత్ర రాజ్యంగా ఏర్పడి, కొనసాగేందుకు బాట వేయడం. రెండవది నేను సూచించిన విధంగా, అలాగే డిక్సన్ నివేదికలో సూచించిన దానికి కొంచెం అటూ యిటుగా, పాకిస్తాన్‌తో ద్వైపాక్షిక చర్చల ద్వారా ఒక ఒప్పందానికి వచ్చి ప్లెబిసైటును (అదీ మూడవ వికల్పం లేకుండా) కాశ్మీరు లోయ + పూంఛ్ + రాజౌరీలకే పరిమితం చేసుకొనడం లేదా పోనీ ప్రాంతాలవారీ ప్లెబిసైటు అంటే జమ్మూకు వేరుగా, లడఖ్‌కు వేరుగా, కాశ్మీరు లోయ (ఆజాద్ కాశ్మీరు యుక్తంగా)కు వేరుగా, ఉత్తరాది ప్రాంతాలకు వేరుగా ప్లెబిసైటు జరిపించి జమ్మూ, లడఖ్‌లైనా మనకు దక్కించుకోవడం. నా ఉద్దేశ్యంలో దీనికి వినా మరో మార్గం లేదు. ఎందుకంటే యిప్పటిలా మొండిగా భారత రాజ్యాంగ పరిధిలోనే పరిష్కారం

కుదరాలి, జమ్మూ-కాశ్మీరు భారతదేశంలో విడదీయరాని అంతర్భాగం అంటూ వల్లిస్తూ, బిర్రబిగుసుకు కూర్చుంటే రానురాను అక్కడ కొంపలు పూర్తిగా అంటుకుపోతాయి. నేటి కెన్నో రెట్లు భయంకరమైన, మరణాంతకమైన తిరుగుబాటు, అంతర్యుద్ధం, ఆనక ఎటూ తప్పని యుద్ధం, పిదప ఘోర పరాజయం(యుద్ధరంగంలో కాకున్నా తదనంతర పర్యవసానాల దృష్ట్యా), అందుమూలంగా దారుణ అవమానం మన పాలవుతాయి.

## కమ్యూనిస్టుల శోచనీయ విధానాలు :

పోతే మార్క్సిస్టులం, కమ్యూనిస్టులమని చెప్పుకునే వివిధ పార్లమెంటరీ పార్టీలు, పార్లమెంటేతర పక్షాలు, బృందాలు కాశ్మీరు సమస్యపై అవలంబించే వైఖరులు, విధానాలు కూడ విచిత్రంగా, విషాదకరంగా వుంటున్నాయి. భారత కమ్యూనిస్టు పార్టీ, భా.క.పా. (మార్క్సిస్టు), రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, సోషలిస్టు యూనిటీ సెంటర్ ఆఫ్ ఇండియా, తదితర పార్లమెంటరీ మార్క్సిస్టు పక్షాలయితే దాదాపు గుడ్డిగా భారత పాలకవర్గాల విస్తరణవాద, జాత్యున్మాద వైఖరిని సమర్థిస్తున్నాయి. ఇటీవల భారత పార్లమెంటు ఉభయ సభల్లో జమ్మూ-కాశ్మీరు భారతదేశంలోఅభిన్న అంతర్భాగమని ఏకగ్రీవ తీర్మానాలు చేయబడడం, అంటే అందులోని ఉభయ కమ్యూనిస్టు పార్టీలు, యితర వామపక్షాలకు చెందిన సభ్యులెవ్వరూ కూడ అసమ్మతి వ్యక్తం చేయకపోగా ఉత్సాహంగా అనుకూల ఓటింగు చేయడం, నాకెంతో మనస్తాపం కలిగించింది. ఏమైంది వీళ్ల అంతర్జాతీయతా భావన, ఎక్కడికి పోయాయి వీళ్ల ప్రపంచ శ్రామిక వర్గ సంఘీభావ, సర్వ మానవ సౌభ్రాతృత్వ సందేశాలు? పోతే, కొన్ని మార్క్సిస్టు-లెనినిస్టు వర్గాలైతే పరిస్థితుల క్లిష్టతను, వైచిత్రిని సరిగ్గా అధ్యయనం చేసి, విశ్లేషించకుండా, కేవలం విడిపోయే హక్కుతో సహా స్వయం నిర్ణయాధికార హక్కు జాతుల కుండాలని వల్లెవేయడమే తప్ప ఒకే భాష మాట్లాడే, ఒకే ప్రాంతంలో నివసిం ప్రజలు సైతం మానసికంగా, అంతశ్చేతనా పరంగా ఎంతగా, ఎలా విడిపోయివున్నారో, మతపరమై చీలికల్లో పడి పరస్పర శత్రువైఖరులెలా అవలంబిస్తున్నారో (కాశ్మీరు ముస్లింలు × కాశ్మీ హిందువులు, జమ్మూ హిందువులు × జమ్మూ ముస్లింలు) గమనించి, అర్థం చేసుకొనలేకపోతున్నా ఈ రాష్ట్రపు సాంఘిక, ఆర్థిక పరిస్థితులను గురించిన విపులమైన గణాంక వివరాలు మావద్ద లేవు గా మాకు తెలిసినంతవరకు కాశ్మీరీ ముస్లింలైనా లేక జమ్మూ హిందువులైనా ప్రధానంగా దోపిడ వర్గాలకు చెందిన వారైతే కాదు. కాశ్మీరీ ముస్లింలు అత్యధిక భాగం వ్యవసాయదారులు (వీరిలోనూ హెచ్చు భాగం చిన్న రైతులే), చిన్న దుకాణాదారులు, యితర చేతి వృత్తులవారు గాను, స్వల్ప భాగం మేర కార్మికులు, యింకో స్వల్ప భాగం స్థానిక సంపన్నులు, బూర్జువా, భూస్వాములుగాను వుండగా, అక్కడి హిందువులైనా ప్రధానంగా పెటీబూర్జువాలే. కనీసం 1947-48 తర్వాత నుండీ వారిలో (కాశ్మీరీ పండిట్లలో) దోపిడీ వర్గాలకు చెందినవారు అత్యల్పభాగమే. పోతే జమ్మూ హిందువులు అత్యధిక భాగం మేర పెటీ బూర్జువాలే (చిన్న రైతులతో బాటు); అక్కడి ముస్లింలైనా అంతే (కాకుంటే వీరిలో వ్యాపారస్తుల వర్గం కాస్త తక్కువే). కనుక యిప్పుడు కాశ్మీరులో, జమ్మూలో

చెలరేగుతున్న సంఘర్షణలను వర్గ పోరాట చట్రంలో చూడడానికి, యిమడ్చడానికి వీలు లేదు. వాటిని సాంప్రదాయిక జాతీయ పోరాట చట్రంలోనూ యిమిడ్చి చూడలేము. మతపర, సంస్కృతీపర వక్కాణింపులు గల జాతీయ లేక తెగ అస్తిత్వవాద(ethnic) సమస్యగా, పోరాటంగా దీన్ని గుర్తించి, వ్యవహరించాలి. ఇప్పుడు కాశ్మీరు లోయ అంతటానూ, జమ్మూలో పలు ప్రాంతాల్లోనూ చెలరేగుతున్న సాయుధ తిరుగుబాటు, గెరిల్లా పోరాటాలకు వివిధ జనవర్గాల మద్దతు లేక వ్యతిరేకతలు వుండవచ్చు, వున్నాయి గాని, అవి ప్రధానంగా మతపరమైన, రాజకీయపరమైన కారణాంశాలవల్ల పుట్టి, పెరిగి, విజృంభిస్తున్నవేనని మాత్రం గ్రహించాలి. అంటే ఈ పోరాటాలకు, పరిస్థితులకు అంతర్లీనంగా ఆర్థిక కారణాంశాలు లేవని మేము అంటున్నట్లు పెడర్థాలు తీయకుండా, అలాంటి ఆర్థిక కారణాంశాలన్నీ ప్రధానమైన మతపర, రాజకీయపర కారణాంశాలకు ద్వితీయమైనవిగానే (secondary గానే) వున్నాయనేది మా భావంగా గ్రహించాలి. ఇలాంటి పోరాటాల్లో వర్గ సమస్యలు అంతగా ముందుకురావని, జాతి లేక తెగ అస్తిత్వ సమస్యలు అటో యిటో తేలినప్పుడు మాత్రమే సాధారణంగా వర్గ సమస్యలు ముందుకు వస్తుంటాయని కూడ తెలుసుకోవాలి. కనుక మార్క్సిస్టులు, కమ్యూనిస్టులమని చెప్పుకునేవారు జాత్యున్మాదానికి, విస్తరణ వాద కాంక్షకు దూరంగా వుంటూ, అదే సమయంలో రొడ్డకొట్టుడు విధానాలు, స్వయం నిర్ణయాధికార సూత్ర భజనలు మాని వాస్తవిక పరిస్థితులను సునిశితంగా విశ్లేషించి, సృజనాత్మక వైఖరులు, విధానాలు అవలంబించాలని నా కోర్కె, విన్నపం.

## స్వతంత్ర కాశ్మీరైనా కంటకమే !

అలాంటప్పుడు విజ్ఞతతో మూడవ వికల్పాన్ని అమోదించి, మనకు దక్కకున్నా జమ్మూ-కాశ్మీరు స్వతంత్ర రాజ్యంగా ఏర్పడేటట్లు చూచుకుంటే అది కొంతలో కొంత మేలు కాదా అని అడగవచ్చు. అది సహజమే కూడ. అలాంటప్పుడు మనం గెలవకున్నా మన శత్రువు (పాకిస్తాన్) కూడ గెలవడు కదా. ఓడిపోతే యిద్దరమూ ఓడిపోతాము. ఎవరిదీ పై చేయి కాదు. పైగా మన అధిక జనాభా, అధిక ఆర్థిక, సైనిక, తదితర శక్తి యుక్తుల కారణంగా జమ్మూ-కాశ్మీరు రాజ్యాన్ని మనమే హెచ్చుగా ప్రభావితం చేయవచ్చేమో గదా అని అనుకోవడమూ సహజమే. కాని యిక్కడ మరో కలవరపెట్టే కోణం వుంది. అదే అగ్రరాజ్యం అమెరికా, యితర వికసిత పాశ్చాత్య దేశాల ప్రయోజనాలు, శ్రద్ధాసక్తులు; అవి కాశ్మీరులో తప్పక చేసుకునే జోక్యం. నేడు అమెరికా కాశ్మీరీ ప్రజల అస్తిత్వాన్ని గురించి మాట్లాడుతూ, వాళ్ల మనోభావాలకుకూడ విలువ నివ్వాలని వాదిస్తున్నదంటే, అదేదో కేవలం మానవతా ప్రేమ మూలంగానేనని భ్రమ పడరాదు. జమ్మూ-కాశ్మీరు స్వతంత్ర రాజ్యమైతే, దాని అభివృద్ధికి, సంక్షేమానికి దోహదం చేసే పేరిట కోట్లాది డాలర్ల పెట్టుబడులు, యితర రకాల సహాయం గుమ్మరించి, వీలైతే సైనిక పరమైన, యితరేతర వసతులు సంపాదించుకుని, ఆ రాజ్యాన్ని తమ చెప్పుచేతల్లో వుంచుకోవడానికి ఈ వికసిత పెట్టుబడిదారీ దేశాలు వెంటనే రంగప్రవేశం చేస్తాయి. ఈ పరిణామం కాలక్రమంలో భారత, పాకిస్తాన్‌లకే కాక, చైనా, ఆఫ్ఘనిస్తాన్,

కజక్స్తాన్, తజక్స్తాన్ వగైరా పూర్వపు సోవియెట్ రాజ్యాలకు కూడ పెద్ద కంటకం కాగలదు. వ్యూహాత్మకంగా ఎంతో కీలక ప్రాధాన్యం గల ఈ ప్రాంతం అధికార దురహంకార అగ్రరాజ్యమైన అమెరికా చెప్పుచేతల్లోకి లేక యితర వికసిత పెట్టుబడిదారీ దేశాల పట్టులోకి పోవడంకంటే భారత, పాకిస్తాన్‌ల నడుమ విభజింపబడి వుండడమే (ఏదో ఒక సంభావ్య పరిష్కారానికి అనుగుణంగా) మెరుగేమోనని నాకు అనిపిస్తున్నది. లేని పక్షంలో 'ఆసియాఖండపు స్విట్జర్లండు' ఐరోపాలోని స్విట్జర్లండులా తటస్థదేశంగా, శాంతికి ప్రతీకగా వుండడంకంటె తద్విరుద్ధంగా మున్ముందు వివిధ పెద్ద రాజ్యాల ఘర్షణలకు రంగంగా, ప్రపంచశాంతికి అత్యంత విఘ్నదాయక ప్రాంతంగా పరిణమించే ప్రమాదమే ఎక్కువగా వున్నది.

ఇంతవరకు ఏకరువుపెట్టిన చారిత్రక, రాజకీయ, గణాంక తదితర వివరాలన్నింటినీ నిశితంగా పరిశీలించి, యింకా వలసిన సమాచార సేకరణ కూడచేసి, మేము సూచించిన వివిధ పరిష్కార మార్గాలగురించి తీవ్రంగా యోచించిన తర్వాతే, మన ఉపఖండంలోని ప్రజలు జాత్యున్మాదానికీ, మతోన్మాదానికీ అతీతంగా, విజ్ఞతతో, హేతుబుద్ధితో, సంయమనంతో, స్వేచ్ఛా శాంతుల పట్ల శ్రద్ధాసక్తులతో ఈ కాశ్మీరు సంక్షోభానికి ఒక శాశ్వత పరిష్కారానికి బాటవేసే దిశగా సకాలంలో సరైన చర్యలు తీసుకుంటారని ఆశించడం, అలా చేయవల్సిందిగా విజ్ఞప్తి చేయడం తప్పేమీకాదనే భావిస్తాను.



# జమ్మూ - కాశ్మీరు రాజ్యం

ADMINISTRATIVE DIVISIONS

AFGHANISTAN

WEST PAKISTAN

LADAKH

HIMACHAL PRADESH

PUNJAB

KARGIL

DODA

KISHTWAR

UDHAMPUR

KATHUA

JAMMU

POONCH

STATE CAPITAL

DISTRICT HEADQUARTERS

TEHSIL HEADQUARTERS

పాక్ ఆక్రమిత కాశ్మీరు

పాక్ చే చైనాకు ధారా దత్తమయిన భూభాగం

చైనా అధీనం లోని అక్సాయ్ చిన్

హిందూస్తాన్ అధీనం లోని కాశ్మీరు లోయ + పూంఛ్ + రాజౌరీ

హిందూదేశ అధీనం లోని జమ్మూ, లడఖ్ లు.

గమనిక: ఇందులో గీసిన అంతర్జాతీయ సరిహద్దు రేఖలు, యితర హద్దు గీతలు ఉజ్జాయింపుగా మాత్రమే సరైనవి.

# వివిధ కాశ్మీరీ తీవ్రవాద సంస్థలు

నేడు జమ్మూ-కాశ్మీరులో 'ఆజాదీ' కోసమో లేక పాకిస్తాన్‌లో విలీనంకోసమో పోరాటంచేస్తున్న వివిధ తీవ్రవాద సంస్థలనుగురించి మన మిక్కడ కొంత తెలుసుకుందాం. ఇప్పుడక్కడ సాగే సాయుధ తిరుగుబాటు, గెరిల్లా పోరాటాలకు నాయకత్వం వహించే తీవ్రవాద సంస్థలు ముఖ్యంగా రెండు రకాలుః 1. కాశ్మీరీ 'ఆజాదీ'ని కోరుకునేవి. కాశ్మీరీముస్లింల పోరాటానికి పాకిస్తాన్ యిస్తున్న నైతిక, భౌతిక మద్దతుల దృష్ట్యా యివి పాకిస్తాన్‌పట్ల కృతజ్ఞత చూపినా, ఆ దేశంలో విలీనాన్నిగాక జమ్మూ-కాశ్మీర్ స్వతంత్ర రాజ్యంగా ఏర్పాటుకావాలని కాంక్షించే సంస్థలివి; 2. పాకిస్తాన్‌లో విలీనాన్ని కోరుకునేవి. ఇవి ప్రధానంగా భద్రతామండలి తీర్మానాలమేరకే, మూడవ వికల్పంలేకుండా ప్లెబిసైటు జరగాలని పట్టుబట్టుతున్నాయి. మొదటి కోవకు చెందినవి కొంత లౌకికవాద ప్రభావం గలవి. అయితే యివికూడ ప్రధానంగా ముస్లిం మత భావాలతో ప్రేరితమైనవే. రెండవ కోవకు చెందినవి సాధారణంగా ముస్లింమత ఛాందసవాద వర్గాలని చెప్పవచ్చు. వీటిల్లో ఛాందసవాదం, మతోన్మాదం వివిధ మోతాదుల్లో వున్న సంస్థలున్నాయి. సరే, మనమిప్పుడీ తీవ్రవాద సంస్థల గురించి టూకీగా తెలుసుకుందాం.

## 1. 'ఆజాదీ' అనుకూల సంస్థలు ః-

జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (Jammu & Kashmir Liberation Front - JKLF), పీపుల్సు లీగులు ప్రధానంగా ఈ కోవకుచెందినవి. వీటిలో JKLF అగ్రగణ్యమైనది. ఆ మాటకు కాశ్మీరులోయలో అన్నింటికంటె అధిక జనాదరణ పొందిన సంస్థ యిదే.

### *(అ) జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (J.K.L.F.)ః-*

పాక్ ఆక్రమిత కాశ్మీరు ముఖ్యపట్టణం ముజఫరాబాదు కేంద్రంగా కార్యకలాపాలు ప్రారంభించిన ఈ JKLF ను 1960వ దశాబ్దంలో స్థాపించారు. చిరకాలం నుండి ఈ సంస్థకు అమానుల్లా ఖాన్ చైర్మన్‌గా కొనసాగుతున్నాడు. 1966లో మగ్బూల్ భట్, యితర నాయకుల చొరవతో దీని కార్యకలాపాలు క్రమేపీ భారత అధీనంలోని కాశ్మీరు లోయలోకికూడ విస్తరించసాగాయి. మొట్టమొదటగా ఒక భారతీయ విమానాన్ని దారి మళ్లించిన (hijack చేసిన) ఘనత ఈ సంస్థ కార్యకర్తలదే. 1984లో మగ్బూల్ భట్ అమరత్వం దీని కార్యకలాపాలకు గొప్ప ప్రేరణ, పెద్ద ఊపు కలగజేసింది. 1989 వేసవికాలంనుడి కాశ్మీరులో పెద్దయెత్తున సాగుతున్న సాయుధ తిరుగుబాటు

మొదట్లో ప్రధానంగా JKLF కృషిఫలితమే. ఈ పోరాటశీల సంస్థకు సమర్థవంతంగా నాయకత్వం వహించి, దానిలో ఒక గుణాత్మక పరివర్తన తీసుకొచ్చిన ఘనత ప్రధానంగా,యిప్పుడు అమానుల్లా ఖాన్‌తోనే విభేదించి, ఆయన్నే బహిష్కరించినట్లు చెబుతున్న యాసీన్ మాలిక్‌దే. కనుక అతని చరిత్ర యిక్కడ కొంత తెలుసుకోవడం అవసరం.

యాసీన్ మాలిక్ శ్రీనగర్ నివాసి. హైస్కూలులో 8వ తరగతి చదువుతున్నప్పుడు, కేవలం 13సం॥ వయస్సులోనే, యితడు కాశ్మీరులోని పరిపాలనా వ్యవస్థకు ఎదురుతిరిగాడు. 1980 జూలై26న శ్రీనగర్, లాల్‌చౌకులో జరిగిన ఏదో చిన్న తగాదాను పురస్కరించుకొని భారత సైనికులు అక్కడి జనాన్ని అందరినీ చితకబాదడం గమనించి క్రుద్ధుడైపోయాడు. ఆగ్రహావేశాలతో మరునాడు జరిగిన నిరసన ప్రదర్శనలో తానూ పాల్గొని, పోలీసులపై రాళ్లు విసరడం, ఒక పోలీసు జీపును తగులబెట్టడం లాంటి దౌర్జన్య ఘటనల్లో పాల్గొన్నాడు. ఆనక 1985 ప్రాంతాల్లో అతడు కొందరు మిత్రులతో కలిసి తాలాపార్టీ అనే ఒక సంస్థ ఏర్పాటు చేశాడు. తదనంతరం ఒక విప్లవ సంఘం ఏర్పాటుచేసి, కొంత తీవ్రవాద సాహిత్యం ప్రచురించాడు. ఈ సందర్భంగా మాలిక్‌ను అరెస్టుచేసి, 4 నెలలపాటు డిటెన్షనులో వుంచారు. 1986లో స్థాపింపబడిన ఇస్లామిక్ స్టూడెంట్సు లీగు (I.S.L.) కు మాలిక్ ప్రధాన కార్యదర్శి అయ్యాడు. 1987లో ముస్లిం ఐక్య సంఘటన (MUF) రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేసినప్పుడు మాలిక్ తన సన్నిహిత I.S.L. మిత్రులు అష్ఫాక్ మజీద్ వానీ, షేక్ హమీద్ ప్రభృతులతో కలిసి మహమ్మద్ యూసఫ్ షా అనే MUF అభ్యర్థికి అనుకూలంగా ముమ్మరమైన ప్రచారం చేశాడు. ఈ మహమ్మద్ యూసఫ్ షాయే తర్వాత తర్వాత సయ్యద్ సలాహుద్దీన్ అనే మారుపేరుతో మత ఛాందసవాద, అతి భయంకర, నిర్దాక్షిణ్యపూరిత పాకిస్తాన్ అనుకూల పోరాట సంస్థ అయిన హిజ్‌బుల్ ముజాహిదీన్‌కు అత్యున్నత సేనాధిపతి (సుప్రీం కమాండర్) కావడం యిక్కడ ప్రత్యేకించి గమనార్హం.

అయితే భారీ రిగ్గింగు జరిగిన ఆ అక్రమ ఎన్నికల్లో అత్యధిక MUF అభ్యర్థుల్లాగే యూసఫ్ షా కూడ ఓడిపోయాడు. అనంతరం మాలిక్‌ను, అతడి ISL సహచరుల్ని అరెస్టుచేసి 8 నెలల పాటు డిటెన్షనులో వుంచారు. విడుదలయిన పిదప 1988లో మాలిక్ అసలు అదుపు గీత (L.A.C.) దాటి ఆజాద్ కాశ్మీరులోకి చొరబడ్డాడు. పాక్ ఆక్రమిత కాశ్మీరులో, JKLF చైర్మన్ అమానుల్లాఖాన్ చేసిన ఏర్పాట్ల మేరకు, మాలిక్, తన మరికొందరు సహచరులతో బాటు తగు సైనిక శిక్షణ పొంది ఆయుధాలు చేబూని 1988 జూన్‌లో మళ్లీ మిత్రులతో బాటు LAC దాటి భారత అధీన కాశ్మీరులోకి తిరిగివచ్చాడు. వచ్చిన కొంతకాలానికే, వాళ్లు మొదటగా కాశ్మీరు పోలీసుకు చెందిన ఒక డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్‌పై దాడిచేశారు. కాని ఆ దాడి విఫలమై, వారి సహచరుడే ఒకరు డి.ఐ.జి. అంగరక్షకుని కాల్పుల్లో మరణించాడు. వారిలో అధికులు పట్టుబడగా మాలిక్, మరికొందరు మట్టుకు తప్పించుకొని తిరిగి పాక్ ఆక్రమిత కాశ్మీరుకు పారిపోయారు. ఆనక మళ్లీ 1989 ఫిబ్రవరిలో మాలిక్ భారత అధీన కాశ్మీరుకు తిరిగి వచ్చాడు. రాగానే ఈసారి నల్లా మార్ రోడ్డువద్ద 1989

ఫిబ్రవరిలోనే నలుగురు CRPF పోలీసుల్ని కాల్చిచంపారు. విజయవంతమైన ఈ టెర్రరిస్టుదాడి కాశ్మీరులోయ అంతటా యువజనులకు ఎంతో ప్రేరణను, ధైర్యసాహసాల్ని కలగజేసింది. తాము సైతం ఆయుధాలు ధరించి శత్రువుతో పోరాడి నెగ్గగలమనే ఆత్మవిశ్వాసం, మనోస్థయిర్యాలను కలగజేసింది.

1989 ఫిబ్రవరిలో తిరిగివచ్చిన తర్వాత యాసీన్ మాలిక్ తనకు అతి సన్నిహితులైన అష్ఫాక్ (మజీద్ వానీ), (షేక్) హమీద్, జావీద్ అహమ్మద్ మీర్‌లతో కలిసి భారత అధీన కాశ్మీరులోయలో జమ్మూ-కాశ్మీరు విమోచన సంఘటన (JKLF) నిర్మాణం చేపట్టారు. మొదట్లో ఈ నలుగురూ ఏరియా కమాండర్లుగానూ, వారిలో అష్ఫాక్ సర్వోన్నత నాయకునిగానూ, వుండినారు. కాని 1990 మార్చిలో భద్రతా దళాలతో జరిగిన ఎదురుకాల్పుల్లో అష్ఫాక్ మరణించడంతో JKLF ను పునర్నిర్మాణం చేశారు. అప్పుడు మాలిక్ దానికి ముఖ్యసేనాధిపతి (Commander-in-Chief) అయ్యాడు. 1992లో ఈ సంస్థను మళ్లీ పునర్వ్యవస్థీకరించారు. యాసీన్ మాలిక్‌ను (భారత అధీన కాశ్మీరులోని) JKLF కు అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. 1989 డిసెంబరులో దేశాన్ని ఒక ఊపు ఊపి, కాశ్మీరీ వేర్పాటువాద వుద్యమానికి గొప్ప ప్రేరణనిచ్చిన డాక్టర్ రుబైయా (అప్పటి కేంద్రహోంమంత్రి ముఫ్తీ మహమ్మద్ సయీద్ కూతురు) అపహరణోదంతం, ఆమె విడుదలకు ప్రతిగా తమ ముఖ్య సహచరులు ఐదుగురి విడుదల సాధన, ప్రధానంగా యాసీన్ మాలిక్ ప్రత్యక్ష నాయకత్వంలోనే జరిగిందని, మొత్తంమీద యాసీన్ మాలిక్‌కు కనీసం 27 హత్యలతో ప్రత్యక్ష ప్రమేయంవుందని మన మీవరకే తెలుసుకున్నాము. 1990 ఆగష్టు 6వ తేదీనాడు అరెస్టయి, ఇంచుమించు నాలుగేళ్లు ఢిల్లీలోని తిహార్ జైలులో గడిపిన పిదప, ఆరోగ్యకారణాలపై మాలిక్ 1994 మే 16నాడు బెయిలుపై విడుదలయిన సంగతికూడ మనం తెలుసుకున్నాము. జైలులో వుండగానే యాసీన్ మాలిక్ ఆరోగ్యం బాగా క్షీణించడంతో అతడికి న్యూఢిల్లీలోని అఖిలభారత వైద్యసంస్థ (AIMS)లో ఓపెన్‌హార్ట్ సర్జరీచేసి తిరిగి ప్రాణం పోసారుకూడ. విడుదలయినపిదప అతడు శ్రీనగరు వెళ్లి, ఆ నగరం తన ప్రధానకేంద్రంగా కాశ్మీరీ తీవ్రవాద వుద్యమంలో ప్రవేశించిన అరాచకశక్తుల ఏరివేతకు,అవాంఛనీయ ధోరణుల నిర్మూలనకు గణనీయంగా కృషిసల్పాడు. ఈ క్రమంలో అతడు మత ఛాందసవాదులు, యితర శత్రువులు జరిపిన రెండు హత్యాయత్నాలనుండి వెంట్రుకవాసిలో తప్పించుకుని బయటపడ్డాడు. చివరకు మరీ యిటీవల JKLF చైర్మన్ అమానుల్లాఖాన్‌తో విభేదించి, ఆయన్నే బహిష్కరించి JKLF చీలికకు కారకుడయ్యాడు. భారత అధీన కాశ్మీరులోని JKLF మెజారిటీ వర్గానికి యిప్పటికీ సారథ్యం వహిస్తున్నాడు.

ఇప్పుడున్న తీవ్రవాద కాశ్మీరీ ముస్లిం మిలిటెంటు సంస్థలన్నింటిలోకీ ఈ JKLF అత్యంత జనాదరణ పొందినదే గాక అంతర్జాతీయంగా అత్యధిక పేరు ప్రతిష్టలు గడించుకున్న సంస్థకూడ. పైగా యిది మత ఛాందసవాదానికి సాధ్యమైనంత దూరంగా, కొంత మేర లౌకికవాద ప్రభావంలో, పనిచేస్తున్నది. పాకిస్తాన్‌లో చేరిక గురించి గాక సాధ్యమైనంతవరకు కాశ్మీరీ ఆజాదీ

సాధనకే యిది కేంద్రీకరించి పనిచేస్తున్నది. మూడవ వికల్పాన్ని గట్టిగా సమర్థిస్తూ, అందుకోసం తీవ్రంగా పోరాడే అతిపెద్ద పోరాట సంస్థయిదే.

## 2. పీపుల్సు లీగ్సు జైలు పక్షి షబ్బీర్ షా :-

భద్రతా మండలి తీర్మానాలకు అనుగుణంగా ప్లెబిసైటు జరిపించాలని పట్టుబట్టుతూనే, అదే సమయంలో మూడవ వికల్పానికి కూడ సిద్ధపడిన సంస్థ పీపుల్సు లీగు. JKLF కున్నంత ప్రజాదరణ, అంతగా కాశ్మీరీ స్వాతంత్ర్యాభిలాష ఈ సంస్థకు లేకున్నా, దీని అధ్యక్షుడు షబ్బీర్ షా విశిష్టవ్యక్తిత్వం వల్ల, అంతరాత్మ ఖైదీగా పేరుపొందుతూ ఆయన గడిపిన సుదీర్ఘ కారావాసంమూలంగా యిది యిటీవల గణనీయ ప్రాముఖ్యం సంతరించుకున్నది. ఒక విధంగా ఈ సంస్థ చరిత్ర షబ్బీర్ షా జీవిత చరిత్రతో ముడివడివున్నదంటే అతిశయోక్తి కాదు.

జైలు పక్షిగా పిలవబడే షబ్బీర్ అహమ్మద్ షా 1954 జూన్ 14వ తేదీనాడు అనంతనాగ్, కడీపారాలో ఒక మధ్యతరగతి విద్యావంతుల కుటుంబంలో జన్మించాడు. షబ్బీర్‌తండ్రి గులాం మహమ్మద్ షాకు శ్రీనగర్ సెంట్రల్ మార్కెటులో-ఒక చిన్న దుకాణం వుండేది. కనుక తన కనిష్ఠపుత్రుడు షబ్బీర్ షాను ఆయన తన వెంట శ్రీనగర్ తీసుకెళ్ళి అక్కడే ప్రాథమిక విద్య చెప్పించాడు. 1962లో తండ్రితోబాటు అనంతనాగ్ తిరిగివచ్చి అక్కడే మునిసిపల్ హైయ్యర్ సెకండరీ స్కూలులో A స్థాయి పరీక్షలదాకా చదివాడు. కేవలం 14 ఏళ్ల వయస్సులో షబ్బీర్ షా "కాశ్మీరులో భారత సామ్రాజ్యవాదా"నికి వ్యతిరేకంగా ఒక నిరసన ప్రదర్శనకు నాయకత్వం వహించాడు. పర్యసానంగా అతడ్ని అరెస్టుచేసి మూడునెలలపాటు పోలీసు లాకప్పులోవుంచి తీవ్రంగా హింసించారు. అనంతరం షబ్బీర్‌షా కొందరు సహచరులతో కలిసి ఒక యువజన లీగు స్థాపించాడు. దానితో మళ్లీ అరెస్టు, మళ్లీ చిత్రహింసల పాలయి శ్రీనగర్ జైలులో 8 నెలలు డిటెన్షనులో వుండాల్సివచ్చింది. విడుదలయిన తర్వాత ఆయన మళ్లీ యువజన లీగును పునరుద్ధరించాడు. చదువు మానేసాడు. 1971 జులైలో పాకిస్తాన్ అనుకూల కార్యకర్త అని చెప్పి 7 నెలలు పోలీసు లాకప్పులో నిర్బంధించబడ్డాడు. 1972లో జమ్మూలో హిందూ మతోన్మాదానికి వ్యతిరేకంగా నిరసన ప్రదర్శనలు జరపడంతో మరోసారి 11 నెలలు శ్రీనగర్ జైలులో D.I.R. కింద మగ్గవల్సివచ్చింది. ఈ 71-73 కాలంలోనే బంగ్లాదేశ్ అవతరణ, సిమ్లా ఒప్పందం, పర్యవసానంగా యుద్ధ విరమణ రేఖను అసలు అదుపు గీత (Line of Actual Control) గా మార్చడం వగైరా ముఖ్య పరిణామాలు ఎన్నో సంభవించాయి. షేక్ అబ్దుల్లా వంటి రాటుదేలిన కాశ్మీర్ నాయకులనే నిస్పృహ పరిచిన యీ పరిణామాలు షబ్బీర్ షా మనోనిశ్చయాన్నిమట్టుకు భగ్నం చేయలేకపోయాయి. బాహ్య రాజ్యాలు, శక్తులు కాశ్మీరీ ప్రజలపై రుద్దిన ఒప్పందాలు, చట్టాలు, ఆక్రమణలు చెల్లనేరవని, కాశ్మీరీ ప్రజలకు స్వయంనిర్ణయాధికారం కావాలని కోరుతూ షబ్బీర్ షా అనంతనాగ్‌లో ఒక ప్రదర్శనలో ప్రసంగించాడు. పర్యవసానంగా 1973 మేలో అరెస్టు చేయబడి మూడునెలలు అక్రమ పోలీసు కస్టడీలో చిత్రహింసలు, 9 నెలలు శ్రీనగర్‌జైలులో డిటెన్షన్ అనుభవించాడు. జైలులో

అల్‌ఫతా గ్రూపుకు చెందిన నజీర్ అహమ్మద్ వానీ, యూత్ లీగుకు చెందిన అబ్దుల్ మజీద్ పఠాన్, విద్యార్థి ఇస్లామిక్ సంస్థ (Students Islamic organisration) నేత అల్తాఫ్ ఖాన్ (అజమ్ ఇంకిలాబీ), గులాం ఖాదిర్ హగ్రూ తదితరులతో పరిచయం కలిగి, ఉమ్మడి ఆశయసాధనకు సన్నిహిత స్నేహంగా పరిణమించింది. షబ్బీర్ యింకా జైలులోనే ఉండగానే అతడికంటె ముందు విడుదలయిన నజీర్ అహమ్మద్ వానీ, ఎస్. హమీద్, ఫజల్ హక్ ఖురేషీ, అబ్దుల్‌మజీద్ పఠాన్ తదితరులు 1974 అక్టోబరు 31న జమ్మూ-కాశ్మీరు ప్రజాలీగు - "పీపుల్సులీగు" - ఏర్పాటు చేశారు. 1975లో షేక్‌అబ్దుల్లా, ఇందిరాగాంధీలు కుదుర్చుకున్న 'కాశ్మీర్ ఒప్పందాన్ని' నిరసిస్తూ పీపుల్సు లీగు రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శనలు నిర్వహించింది. షబ్బీర్ షా విడుదలయినపిదప పీపుల్సు లీగులో చురుకుగా పనిచేయసాగాడు.

అయితే అట్టేకాలం గడవకమునుపే షబ్బీర్ మళ్లీ జైలుపాలు కావల్సివచ్చింది. ఈసారి షేక్‌అబ్దుల్లా, తన సతీమణితో కలసి స్వయంగా జైలుకువచ్చి, షబ్బీర్‌ను తన ఉద్యమం విరమించుకోవల్సిందిగా నచ్చజెప్ప జూచాడుకాని షబ్బీర్ ససేమిరా అన్నాడు. రెండున్నర ఏళ్ల కారావాసం పిదప 1978లో విడుదలయిన షబ్బీర్ షా అజ్ఞాతవాసానికి వెళ్లి రహస్యకార్యకాలాపాలు నిర్వహించసాగాడు. కాని కాశ్మీరు సమస్యపై ఒక అంతర్జాతీయ సదస్సు ఏర్పాటుకు చురుగ్గా సన్నాహాలు చేస్తుండగా 1980లో అరెష్టయ్యాడు. 1981 చివర మళ్లీ విడుదలయి, కొద్దికాలంలోనే 1982 ఆరంభంలో "క్విట్ కాశ్మీర్" (కాశ్మీరు వదలివెళ్లండి) వుద్యమం ప్రారంభించాడు.దానితో వెంటనే అరెష్టుకాబడినా, ఈసారి పెద్దయెత్తున నిరసన ప్రదర్శనలు చెలరేగి లోయలో జనజీవనం 5 రోజులపాటు పూర్తిగా స్తంభించి పోవడంవల్ల అతడిని కొద్దిరోజుల్లోనే విడుదల చేయకతప్పలేదు. అయితే అచిరకాలంలో మళ్లీ అరెస్టుచేసి, మూడున్నర నెలలపాటు పోలీసు కష్టడీలో చిత్రహింసలు పెట్టి, చివరకు తలకు పెద్దదెబ్బ తగిలి పడిపోయిన షబ్బీర్‌షాను అపస్మారకస్థితిలో శ్రీనగర్ జైలుకు తరలించారు. మరో ఏడాది తర్వాత 1983లో అతడ్ని మళ్లీ విడుదల చేశారు. వెంటనే షబ్బీర్ ఉద్యమంలోకి లంఘించి, పీపుల్సు లీగు కార్యకలాపాలు ఉధృతం చేయసాగాడు. 1983 అక్టోబరులో శ్రీనగరులో జరిగే భారత - వెస్టిండీస్ క్రికెట్ టెస్టు మ్యాచ్‌ను భగ్నం చేయడంలో ప్రముఖ పాత్ర వహించాడు. చివరకు 1984లో పోలీసులు షబ్బీరును అరెష్టుచేసి మళ్లీ తీవ్ర హింసలు పెట్టడంతో అతడి కిడ్నీ ఒకటి బాగా దెబ్బ తినింది. రెండున్నర నెలలు పోలీసు కష్టడీ దరిమిల సుమారు 4 సంవత్సరాల పాటు సుదీర్ఘ కారావాసం గడిపి (విచారణ లేకుండా) చివరికి 1988 ఏప్రిల్ 26నాడు మేజిస్ట్రేటు కోర్టులో హాజరుపర్చబడి, విడుదలయ్యాడు. పోలీసులు మళ్లీవెంటనే అతడ్ని అరెస్టుచేయ యత్నించారుగాని పెద్ద సంఖ్యలో తరలివచ్చిన షా మిత్రులు, మద్దతుదారులు అతడ్ని తప్పించి తీసుకెళ్లారు. 1988 ఏప్రిల్ 26నుండి మళ్లీ 1989 ఆగష్టుదాకా షబ్బీర్ షా అండర్‌గ్రౌండ్ కార్యకలాపాలు చురుగ్గా సాగించాడు. ఈ కాలంలో అతడు అప్పుడప్పుడే పెల్లుబుకుతున్న కాశ్మీరీ స్వాతంత్ర్యోద్యమానికి ఎంతో దోహదం చేశాడు. 1989 ఏప్రిల్ 4వతేదీనాడు పోలీసులు షబ్బీర్ తండ్రి గులాం మహమ్మద్ షాను అరెస్టుచేసి కొడుకు ఆచూకీ తెలపవల్సిందిగా చిత్రహింసలు పెట్టి

చంపేశారు. పాపం, తండ్రి అంత్యక్రియలకు సైతం షబ్బీర్ హాజరుకాలేకపోయాడు. తుదకు 1989 ఆగష్టు 28నాడు పోలీసులు షబ్బీర్‌ను మళ్లీ అరెష్టుచేయగలిగారు. అతడి అరెష్టుకు నిరసనగా కాశ్మీరు లోయ అంతటా నిరసన ప్రదర్శనలు చెలరేగాయి. షబ్బీర్ అరెష్టు కాశ్మీరు లోయలో ఆజాదీ కోసం సాయుధ తిరుగుబాటు ప్రారంభం దాదాపు ఒకే సమయంలో జరగడం గమనార్హం. షబ్బీర్ షా ఈ సారి సుమారు 5 ఏళ్ల నిరవధిక డిటెన్షన్ పిదప 1994 చివరన విడుదలయ్యాడు. భారత ప్రభుత్వం యాసీన్ మాలిక్, షబ్బీర్‌లవంటి తీవ్రవాదుల్లోని మెతకవాదుల్ని ఎంపిక చేసి చర్చలు జరిపి, ప్రధానంగా కాశ్మీరీ ఆజాదీని కాంక్షించేవారినికూడ ఎన్నికల ప్రక్రియలోకి దించడంద్వారా పాకిస్తాన్ అనుకూల వర్గాలను వేరు చేసి, భారత రాజ్యాంగ పరిధిలో కాశ్మీరు సమస్యకు ఒక పరిష్కారం కోసం ప్రయత్నం చేస్తున్నది. కాని కాశ్మీరు స్వాతంత్ర్యం ప్రసక్తి లేని చర్చలు నిష్ఫలమని షబ్బీర్ షా స్పష్టంచేశాడు. అదే సమయంలో, పాకిస్తాన్ తమకు మిత్రుడేగాని యజమాని మాత్రం కాదని, కాశ్మీర్ సమస్యపై జరిగే భావి సంప్రదింపులు వేటిలోనైనా కాశ్మీరీ స్వాతంత్ర్యవాదులకు సైతం ప్రముఖ పాత్ర కల్పించవల్సివుంటుందని కూడ స్పష్టంచేశాడు. అయితే తాము అధికారంలోకి వస్తే జమ్మూ-కాశ్మీరులో నిజామె ముస్తఫా (ప్రవక్త వ్యవస్థ) నే ప్రభుత్వమతంగా చేస్తామని ప్రకటించడంతో, తన ముస్లిం మతతత్వాన్నికూడ బయటపెట్టుకున్నాడు. చరారె షరీఫ్ దహనకాండ సందర్భంగా కాబోలు 1995 మే 12నాడు షబ్బీర్ షాను భారత భద్రతాదళాలు తిరిగి అరెష్టుచేసి, కుఖ్యాత హరి నివాస్ ఇంటరాగేషన్ సెంటరులో కొన్ని రోజులపాటు నిర్బంధించినట్లుకూడ తెలుస్తున్నది.

ఈ పీపుల్సు లీగుకు అల్ జిహాద్ అనే మిలిటెంటు సంస్థ అనుబంధంగా వున్నట్లు తెలుస్తున్నది. ఈ అల్ జిహాద్ మిలిటెంట్లు మరింతగా పాకిస్తాన్ అనుకూలురుగాను,ముస్లిం మతతత్వవాదులుగానూ వున్నట్లు ొపిస్తున్నది. JKLF కున్నంత రాష్ట్రవ్యాప్త నిర్మాణం, కేడరు, సైనిక స్తోమత, జనాదరణ దీనికి లేకున్నా, సుమారు 20 ఏళ్లుగా జైళ్లలో మగ్గి అభిమానులచే "కాశ్మీరపు నెల్సన్‌మండేలా"గా అభివర్ణించబడుతూ, అంతర్జాతీయ క్షమాసంస్థ (Amnesty International) చే అంతరాత్మ ఖైదీగా గుర్తింపునొందిన 'జైలు పక్షి' షబ్బీర్‌షా విశిష్ట వ్యక్తిత్వం ాలంగా ఈ పీపుల్సు లీగుకూడ జమ్మూ-కాశ్మీరులో గణనీయమైన పలుకుబడి గడించిందని మనించాలి.

## బి. పాకిస్తాన్ అనుకూల సంస్థలు :-

### 1. హిజ్‌బుల్ ముజాహిదీన్ :-

'సంఖ్యాబలంలో JKLF తర్వాత అతి పెద్ద తీవ్రవాద సంస్థ యీ ధర్మయోధుల ృక్షమే' కాని, సైనికశక్తిలో మట్టుకు యిది JKLF నుకూడ మించి పోయి, అన్ని మిలిటెంటు ంస్థలలోకీ అగ్రగామిగా వుంటూవస్తున్నది. ప్రధానంగా భద్రతా దళాలపై దాడులు జరుపుతూ ందలాది సైనికులు, పోలీసులను బలిగొంటున్నది. కాశ్మీరులోయలో ఈ పక్షానికి కనీసం 4000

మంది సాయుధ యోధులున్నారని, వారిలో విదేశీయులు (పాకిస్తానీలు, ఆఫ్ఘన్లు, తదితరులు) సుమారు 1500 మందిదాకా వున్నారని తెలుస్తున్నది. జమ్మూ-కాశ్మీర్ పాకిస్తాన్‌తో చేరాలని, అక్కడ ఇస్లామిక్ శాసనం అమలుచేయాలని యీ మత ఛాందసవాద సంస్థ కోరుతున్నది. అందాలకు, వగలకు పెట్టింది పేరైన కాశ్మీరీ మగువల సోయగాలను - నల్లపరదాల్లో (బుర్ఖాల్లో) విధిగా దాచివుంచాలని, పాశ్చాత్య సంస్కృతిని పూర్తిగా విసర్జించాలని యిప్పటినుండే హుకుంలు జారీచేస్తూ స్వేచ్ఛాప్రియులైన కాశ్మీరీ యువజనుల్లో కలవరం, ఖంగారు కలిగిస్తున్నది. ఇరాన్ తరహా విప్లవం కోసం కృషిచేస్తూ అయతుల్లా ఖొమేనీని ఆరాధ్యపురుషునిగా భావించి ప్రచారం చేసే సంస్థ యిది. JKLF తో ఆధిపత్యం కోసం మరణాంతక దాడులకు దిగుతూ, ఎంత లేదన్నా శ్రీనగర్‌లోనే 60 మందిదాకా JKLF కార్యకర్తల్ని యిప్పటికే బలిగొన్నది. ఈ సంస్థకు సుప్రీం కమాండరు అయిన సయ్యద్ సలాహుద్దీన్ ఒకప్పుడు కాశ్మీరు అసెంబ్లీ ఎన్నికల్లో MUF అభ్యర్థిగా నిలబడి, ఓడిపోయాడని, అప్పట్లో యాసీన్ మాలిక్ ప్రభృతులు అతని కోసం ముమ్మరంగా ప్రచారం చేసివున్నారని మన మిారకే గమనించాము. పాకిస్తాన్‌కు చెందిన సైనిక గూఢచారి శాఖ I.S.I. తో సన్నిహిత సంబంధాలు కలిగి, దాని ద్వారా పెద్దయెత్తున ఆయుధాలు, ధనసహాయం, కిరాయిసైనికులు, సైనిక శిక్షణ పొందుతున్న సంస్థ యిది. అయితే విదేశీ పర్యాటకుల అపహరణలను మాత్రం ఈ సంస్థ "ఇస్లాం వ్యతిరేక చర్యలు" గా నిరసిస్తున్నది.

### 2. అల్ బర్క్ :-

విద్యుత్ / మెరుపు వీరులు అనే అర్థంవచ్చే పేరుగల ఈ సంస్థలో సుమారు వెయ్యిమంది ఆరితేరిన పోరాటవీరులు వున్నారు. ఇప్పుడు హుర్రియత్ కాన్ఫరెన్సుకు ఒక నాయకునిగావున్న అబ్దుల్ ఘనీ లోనే నాయకత్వంలోని పీపుల్సు లీగుకు సైనిక విభాగంగా యిది స్థాపించబడింది. కాశ్మీరు లోయలోని కుప్వారా, బారాముల్లాల లోనూ, శ్రీనగర్‌లో కొన్నిచోట్ల వీరు బలంగా వున్నారు. 1992 అక్టోబరు - నవంబరులో అబ్దుల్ ఘనీ లోనే టెహరాన్ సందర్శించినప్పుడు, అక్కడ పాకిస్తాన్‌కు చెందిన ISI అధికారులతో రహస్యచర్చలు జరిపి ఈ సంస్థకు కావల్సినంతగా ఆయుధాలు, సైనికశిక్షణ, విదేశీసైనికుల సాయం సంపాదించాడని తెలుస్తున్నది. ఇదికూడ పాకిస్తాన్‌లో పూర్తి విలీనాన్ని కోరే సంస్థే.

### 3. హర్కత్-ఉల్- అన్సార్ :-

అనంతనాగ్, దోడాలు ప్రధాన కేంద్రాలుగా పోరాటంచేస్తున్న యీ సంస్థ నిజానికి ఒక పాకిస్తానీ సంస్థేనన్నా పొరపాటు కాకపోవచ్చు. పాకిస్తాన్‌లోని జమాతె ఉలేమా ఇ-ఇస్లాం ప్రధాన కార్యదర్శి మౌలానా ఫజల్-ఉర్-రహమాన్ యీ హర్కత్-ఉల్-అన్సార్ (ప్రవక్త మిత్రుల వుద్యమం) కు సైద్ధాంతిక గురువు లాంటివాడని తెలుస్తున్నది. ఈయన ఇటీవల 1995 జూలై - ఆగష్టులో కొన్ని రోజులపాటు మనదేశంలో పర్యటించాడుకూడ. సుమారు 1000-1500 మంది సాయుధ సభ్యులుగల ఈ తీవ్రవాద సంస్థలో 75 శాతానికి పైగా విదేశీయులే వున్నారని,

కాశ్మీరును 'ఇస్లామిక్ పాకిస్తాన్' లో చేర్చాలనే ఆశయసాధనకే వీరు పోరాటం చేస్తున్నారని తెలుస్తున్నది. ఇటీవల జమ్మూలో గెరిల్లా పోరాట విజృంభణకు వీరుకూడ ముఖ్య కారకులేనని అంటున్నారు. ఐదుగురు విదేశీ పర్యాటకుల్ని అపహరించి వారిలో ఒకరిని చంపివేసి, మిగతా నలుగురిని నేటికీ (6నెలలపైగా దాటినా) బందీలుగా వుంచుకున్న అల్ ఫరాన్ నిజానికి యీ హర్కత్-ఉల్-అన్సారుకు సంబంధించినదేనని అంటున్నారు 1994, 1995 ఆగష్టు మాసాల్లో అమరనాథ్ యాత్రలపై నిషేధాజ్ఞలు విధించిన సంస్థల్లో ప్రముఖమైనది యిదే.

### 4. హర్కత్-ఉల్-జిహాద్-ఇ-ఇస్లామీః-

1992 దాకా స్వతంత్ర అస్తిత్వం గల యీ సంస్థ. ఇది 1993 లో హిజ్బుల్ ముజాహిదీన్‌లో విలీనమైనట్లు తెలుస్తున్నది.

### 5. అల్ ఉమర్ ముజాహిదీన్ః-

హుర్రియత్ అధ్యక్షుడు మీర్‌వైజ్ ఉమర్ ఫారూఖ్‌ను సమర్థించే కౌమీ ఆక్షన్ కమిటీకి మద్దతుగా వుండే ఈ మిలిటెంటు గెరిల్లా సంస్థలో సుమారు 600 మంది సభ్యులు వున్నట్లు తెలుస్తున్నది. పాకిస్తాన్ అనుకూల ఆశయాలుగల యీ సంస్థ కార్యకలాపాలు ప్రధానంగా శ్రీనగర్‌కే పరిమితమైవున్నాయి. కాని ఇటీవలే దీని కార్యకలాపాలు కుప్వారా, బారాముల్లాలకు కూడ విస్తరించినట్లు తెలుస్తున్నది. దీని అత్యంత బలీయమైన ఉత్తర కాశ్మీరు డివిజన్‌కు ఇక్రం-ఉల్-హక్ కమాండరుగా వున్నాడు. ఈ సంస్థ హిజ్బుల్లా, హిజ్బుల్ ముజాహిదీన్, తహరీక్-ఉల్-ముజాహిదీన్‌లతో స్నేహసంబంధాలు కలిగివున్నది.

### 6. తహరీక్-ఇ-జిహాద్-ఇ-ఇస్లామీః-

ముజఫర్ అహమ్మద్ షా ప్రధాన సైనిక సలహాదారుగా, I.S.I. తో సన్నిహిత సంబంధాలు గల సంస్థ. ఇది 1992లో హిజ్బుల్ ముజాహిదీన్‌లో విలీనమైనట్లు తెలుస్తున్నది.

### 7. లష్కర్-ఇ-తాయిబాః-

సుమారు 300మంది సమర్థులైన గెరిల్లాలుగల యీ దళం దాదాపు పూర్తిగా విదేశీయులతో (పాకిస్తానీలు, ఆఫ్ఘన్లతో) కూడుకున్నదే. కుప్వారా, బారాముల్లా, బడ్గావ్‌లు ప్రధాన స్థావరాలుగా పాకిస్తాన్ కుచెందిన I.S.I.తో సన్నిహిత సంబంధాలు ఏర్పరుచుకొని పోరాటంచేస్తున్న మిలిటెంటు సంస్థ.

### 8. ముస్లిం ముజాహిదీన్ః-

సుమారు వెయ్యిమంది సభ్యులుగల ఈ పాకిస్తానీ అనుకూల సంస్థ బారాముల్లా, అనంత నాగ్‌లకు పరిమితమై పనిచేస్తున్నది. అబ్దుల్ మజీద్ ధార్ దీనికి చెందిన ఒక ప్రముఖ

నాయకుడు. ప్రపంచ మహమ్మదీయ సంఘీభావంపై నొక్కిచెప్పే ఈ సంస్థకూడ అమర్‌నాధ్ యాత్రపై నిషేధాజ్ఞలు విధించివున్నది. .

### 9. ముస్లిం జాన్‌బాజ్ ఫోర్సు:-

శ్రీనగర్‌లో కొన్ని చోట్ల, దోడా, పూంఛ్,రాజౌరీలలో అక్కడక్కడా కార్యకలాపాలు సాగించే సుమారు 300మంది ప్రాణత్యాగశీల సాహసయోధులు గల ఈ సాయుధ సంఘటన ప్రస్తుతం షబ్బీర్ షాను బలపరుస్తున్నది. ముస్లిం తీవ్రవాద వర్గాలు, కాశ్మీరీ స్వాతంత్ర్యానుకూల వర్గాల నడుమ పరస్పర కలహాలను నిరసిస్తూ, సకల సంస్థలూ స్వయంనిర్ణయాధికారంకోసం సమైక్యంగా పోరాడాలని పిలుపిస్తున్నది.

### 10. అల్లా టైగర్సు :-

చురుకైన కార్యకర్తలు అనేకులు కలిగి, భద్రతాదళాలతో తలపడి భీకర పోరాటాలు జరిపే ఈ పాకిస్తాన్ అనుకూల మిలిటెంటు సంస్థకూడ అమర్‌నాధ్ యాత్రలపై నిషేధాజ్ఞలు జారీచేసిన ముస్లిం ఛాందసవాద సంస్థల్లో ఒకటి.

### 11. హిజ్బుల్ మోమిన్:-

ఇస్లామిక్ విప్లవాన్ని కాంక్షించే ఒక పాకిస్తానీ అనుకూల తీవ్రవాద సంస్థ. ఈ విశ్వాసుల పక్షా,నికి బషీర్-ఉజ్-జమాన్ సిద్ధికీ ప్రధాన ప్రచారకుడు. ఈ సంస్థకు హర్కత్-ఉల్-అన్సారుతో సన్నిహిత సంబంధాలున్నాయి.

### 12. జమాత్-ఉల్-ముజాహిదీన్:-

అమరనాథ్‌యాత్రను నిషేధించిన సంస్థల్లో యీ'మతయోధుల సంఘం' కూడ ఒకటి. ఇస్లామిక్ సంస్కృతిని నిక్కచ్చిగా అమలుపరచాలని కృషిచేసే సంస్థ యిది. ఇంకా ముజాహిదీన్-ఉల్-హమాస్, మహజె ఇస్లామీ, తదితర అనేక తీవ్రవాద సంస్థలుకూడ వున్నాయి. మొత్తంమీద 130 దాకా వేర్వేరు చిన్న, పెద్ద తీవ్రవాద ఇస్లామిక్ మిలిటెంటు సంస్థలు జమ్మూ-కాశ్మీరులో తమ కార్యకలాపాలు సాగిస్తున్నట్లు భారత గూఢచారి వర్గాల అంచానా.

## సి. అఖిల పక్ష హుర్రియత్ కాన్ఫరెన్సు:-

కాశ్మీరీ స్వయం నిర్ణయాధికారం కోసం పోరాడే సంస్థలన్నిటికీ ఒక గొడుగులాంటిఁ యిది. ఇది ఒక బాహాట వేదిక మాత్రమే. సుమారు 32 రాజకీయ, మత-సాంఘిక, సమరశీల (మిలిటెంటు) సంస్థలకు నిజమైన ప్రతినిధినని చెప్పుకుంటుంది. తీవ్రవాదులపై దారుణ మారణహోమాలు జరిగినప్పుడు, యితర ముఖ్య రాజకీయపరిణామాలు, సంక్షోభాలు సంభవించినప్పుడు, బంద్‌లు,హర్తాళ్లు జరపవల్సిందిగా కాశ్మీరు ప్రజలకు పిలుపు లిస్తూ భారత వ్యతిరేకతను పెద్దయెత్తున ప్రదర్శిస్తూంటుంది. ప్రజాకర్ఫ్యూలకు పిలుపివ్వడం ఈ సంస్థ ప్రత్యేకత.

గత సంవత్సరం చివర ప్రధాన ఎన్నికల కమిషనర్ టి.ఎన్.శేషన్ శ్రీనగర్ సందర్శించినప్పుడుకూడ ఈ హుర్రియత్ యిచ్చిన హర్తాళ్ పిలుపుతో శ్రీనగర్ అంతా పూర్తిగా స్తంభించి పోయింది. హజరత్‌బాల్ సంక్షోభమప్పుడు భద్రతాదళాలకు, భారతప్రభుత్వ ప్రతినిధులకు ఒకవైపు, మసీదుని ఆక్రమించుకున్న మిలిటెంట్లకు మరోవైపు నచ్చజెప్పడానికి ప్రయత్నిస్తూ, ఇరువురి నడుమ వారధిలా పనిచేసినా, ప్రధానంగా మిలిటెంట్లనే వెనకేసుకొచ్చింది. ఆ సంక్షోభమప్పుడు ఈ సంస్థ పిలుపుపై కాశ్మీరులోయ అంతటా హర్తాళ్లతో జనజీవనం స్తంభించిపోయింది. అమరనాథ్‌యాత్రపై హర్కత్-ఉల్-అన్సార్, తదితర సంస్థల నిషేధాజ్ఞల్ని ఈ హుర్రియత్ నాయకులు 1994లో నైతే సమర్థించారుగాని 1995లో సమర్థించలేదు.

మీర్‌వైజ్ (ప్రధాన మతగురువు) ఉమర్ ఫరూఖ్ అధ్యక్షుడుగాగల ఈ వేదిక సంస్థలో జమాతె ఇస్లామీ నాయకులు సయ్యద్ ఆలీషా జిలానీ,జి.యమ్. భట్‌లు,ముస్లిం కాన్ఫరెన్సుకు చెందిన అబ్దుల్ ఘనీ లోనే, ఇత్తెహాదుల్ ముస్లిమీన్‌కు చెందిన మౌలానా మహమ్మద్ అబ్బాస్ అన్సారీ, పీపుల్సు లీగుకు చెందిన S. హమీద్, పీపుల్సు కాన్ఫరెన్సుకు చెందిన ప్రొఫెసర్ హాఫీజుల్లా మఖ్దూమీ, యింకా ప్రొఫెసర్ అబ్దుల్ ఘనీ భట్, ఇటీవలే JKLF లో చీలిక తర్వాత చేరిన యాసీన్ మాలిక్ వంటి ప్రముఖులనేకులున్నారు. ఇది ప్రధానంగా పాకిస్తాన్ అనుకూల, మత ఛాందసవాద భావాలుగల వేదిక సంస్థ. మరి దీనితో JKLF (మాలిక్ వర్గం) సహజీవనం ఎంతకాలం కొనసాగుతుందో చూడాల్సివుంది. పైగా పాకిస్తాన్‌నుండి, అరబ్‌దేశాలనుండి , ఇతర విదేశాలనుండి దీనికి పుష్కలంగా ధనసహాయం లభిస్తున్నది. మరి యీ నిధులను దుర్వినియోగం చేసి హుర్రియత్ నాయకులు విలాసజీవితాలు గడుపుతున్నారనే నిందారోపణలుకూడ నానాటికీ అధికంగా వ్యాపిస్తున్నాయి. 1995లో కాశ్మీరు సమస్య పరిష్కారానికి భారత ప్రభుత్వం కొంత చొరవ తీసుకున్న సందర్భంగా ఈ హుర్రియత్ నాయకులు కొందరిని ఢిల్లీకి పిలిపించుకుని చర్చలు జరిపారు కాని భారత రాజ్యాంగ పరిధిలోనే సమస్యా పరిష్కారానికి గాని, ఎన్నికల నిర్వహణకుగాని వీరు అనుకూలంగా లేరు. ఏమైనా కాశ్మీరులోయలో అత్యధిక ప్రజానీకం మద్దతును, ఆదరణాభిమానాలను చూరగొన్న బాహాట వేదిక మాత్రం యిప్పటివరకు యిదే ననడంలో సందేహంలేదు.

### *డి. తిరుగుబాటు ప్రతీఘాతక (Counter-insurgency) బృందాలు:-*

మొదట్లో ముస్లిం ఛాందసవాద మిలిటెంట్లు గానో, కాశ్మీర్ ఆజాదీ అనుకూల పోరాటవీరులుగానో ప్రారంభించి, క్రమక్రమంగా గెరిల్లా వర్గాల పరస్పర కలహాలు, అత్యాచారాలకు నిస్పృహచెందో లేక భద్రతా దళాల బీభత్సానికి తాళుకునో లేక మరే కారణాలుగానో భద్రతా దళాలకు ఇన్‌ఫార్మర్లుగా, సహాయకులుగా పనిచేస్తున్న బృందాలుకూడ కొన్ని కాశ్మీరులో వున్నట్లు తెలుస్తున్నది. కాని వాటిలో నేడు మనకు ప్రధానంగా బయటకు కనిపించేది ఖోకా పారే నాయకత్వంలోని **ఇక్వానె ముస్లిమీన్** సంస్థే. దీనికి తగినంత స్వతంత్ర అస్తిత్వం కూడ వుంది. మొదట ముస్లిం మతతత్వ మిలిటెంట్లుగా ISI సహాయ, సహకారాలతో భద్రతా దళాలలో తలపడిన వీరు క్రమంగా,

గెరిల్లావర్గాలలో పరస్పర, అంతర్గత కలహాల పర్యవసానంగా, ఆ భద్రతా దళాలతోనే చేతులు కలపసాగారు. ఇప్పుడు బాహాటంగా భద్రతాదళాలనుండి సహాయసహకారాలు పొందుతూ కొన్ని ప్రాంతాల్లో నైతే హిజ్‌బుల్ ముజాహిదీన్‌తో పోటాపోటీగా తలపడుతున్నారు. సోనావరి, కంగన్‌లనుండి హిజ్‌బుల్ దళాలను వెళ్లగొట్టి ఆ ప్రాంతాలలో బలీయమైన శక్తిగా రూపొందారని తెలుస్తున్నది. ప్రత్యర్థి వర్గాల నాయకులు, కార్యకర్తలపై హఠాత్తుగా గెరిల్లా దాడులు జరిపి మట్టుబెట్టడం వీరి ప్రత్యేకత.

### ఇ. *పాకిస్తానీ సైనిక గూఢచారి సంస్థ* – *I.S.I.* :-

జమ్మూ-కాశ్మీరులో పాకిస్తాన్ మారుమనిషి యుద్ధం (**Proxy War**) నడుపుతున్నదని, దాన్ని ప్రధానంగా ఆ దేశపు ఇంటర్ సర్వీసెస్ ఇంటెలిజెన్సు (సైనిక గూఢచారిశాఖ - **ISI**) ఆర్గనైజు చేస్తున్నదని భారత ప్రభుత్వ ఆరోపణ. మరి అమెరికా, తదితర పాశ్చాత్యదేశాల గూఢచారివర్గాలుకూడ దీనితో ఏకీభవిస్తున్నాయి. అమెరికన్ కాంగ్రెసు ఏర్పాటుచేసిన హౌస్ రిపబ్లికన్ రిసెర్చి కమిటీ యొక్క బీభత్సవాదం, సాంప్రదాయేతర యుద్ధపద్ధతుల పరిశోధనా కర్తవ్యబృందం (Task Force) సమర్పించిన నివేదికలు కాశ్మీరులో ISI నిర్వహిస్తున్న ప్రమాదకర బీభత్సవాద కార్యకలాపాలను బట్టబయలు చేస్తున్నాయి. మొదటగా ఆఫ్ఘనిస్తాన్‌లో సోవియెట్ దురాక్రమణను ఎదిరించే నెపంతో ఈ ISI, మర్కజ్ దావత్-ఉల్-అర్షద్ (MDA) అనే ప్రపంచవ్యాప్త మహ్మదీయ కార్యకలాపాల కేంద్రం ఒకటి ఏర్పాటుచేసిందట. ఈ కేంద్రపు ఆధ్యాత్మిక నేత మౌల్వీ జకీ ప్రపంచంలో ఎక్కడేగాని, "కాఫిర్ల చేతులనుండి అల్లా భూముల్ని విముక్తం గావించడానికి" పోరాడవల్సిందిగా ప్రపంచ ముస్లింలందరికీ పిలుపిచ్చాడు. అరబ్ దేశాల్లోని ఇక్వాన్-ఉల్-ముస్లిమీన్ సభ్యులే - వీరు అల్జీరియా సూడాన్, ఈజిప్టు తదితర దేశాలనుండి వచ్చిన రాటుదేలిన యోధుల - ఈ **MDA** లో కమాండర్లుగా, శిక్షకులుగా నియమించబడ్డారు. వీరిచే శిక్షణ పొందిన అనేకమంది గెరిల్లాలు ఆఫ్ఘన్ అంతర్యుద్ధంలో, సోవియెట్ వ్యతిరేక యుద్ధంలో పాల్గొని మంచి పోరాటానుభవాలు గడించారు. 1992 తొలిభాగంలో యీ "ఆఫ్ఘన్లు" (అంటే ఆఫ్ఘనిస్తాన్‌లో పోరాడిన గెరిల్లాల) లో కొంతమందిని పాక్ ఆక్రమిత కాశ్మీరులోని నూతన శిబిరాలకు తరలించారు. 1993 నాటికి 1000 మందికిపైగా ఆఫ్ఘన్లు ఈ MDA ఆధ్వర్యంలో ఆజాద్ కాశ్మీరులో కేంద్రీకరింపబడ్డారు. 1993నుంచి యీ ఆఫ్ఘన్లను దళాలుగా విభజించి, ఒకదాని పిమ్మట ఒకటిగా మెల్లమెల్లగా భారత అధీనంలో కాశ్మీరులోనికి చొరబెట్ట నారంభించారు. కాశ్మీరీ గెరిల్లాలకు పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీరులో శిక్షణ నివ్వడం, అత్యాధునాతన ఆయుధాలు, మందుగుండు సామగ్రి సరఫరా చేయడం, యింకా అవసరమైన సాధనసంపత్తి సమకూర్చడం వంటి పనులన్నీ ఈ MDA ఆధ్వర్యంలో జరుగుతున్నాయి. 107 మి.మీ. రాకెట్లు, 60 మి.మీ. మోర్టార్లు, 40 మి.మీ. స్వయంచలిత గ్రెనేడ్ లాంచర్లు (రష్యా, చైనా మోడల్సు), 57 మి.మీ. హెలికాప్టర్ రాకెట్ పాడ్లు, టాంకు విధ్వంసక క్షిపణులు (రష్యా చైనా మోడల్సు), యింకా ఎన్నో అత్యాధునాతన ఆయుధాలు వీరు కాశ్మీరీ గెరిల్లాలకు సరఫరా చేస్తున్నారు.

మొదట్లో పునాది పని చేసిరావడానికి, అంటే మిలిటెంటు దళాల నిర్మాణం, ప్రాథమిక సైనికశిక్షణ అందజేయడం వగైరా పనులకు, యీ ఆఫ్ఘన్లను కాశ్మీరులోకి పంపేవారు. మీరు ముందు పోరాటం ప్రారంభించండి; మీ సాయుధ తిరుగుబాటు ఉన్నత స్థాయికి చేరుకోగానే పాకిస్తాన్ సైనిక జోక్యంకూడ చేసుకుంటుందని వీరు మిలిటెంటు వర్గాలకు ధీమాయిచ్చి వస్తుండేవారు. కాని రానురాను, 1993 తర్వాత, కాశ్మీరులోనే శాశ్వతంగా పాదుకుపోయి, పోరాడే 'ఆఫ్ఘన్ల'ను, కేవలం డబ్బుకోసం పోరాటంచేసే కిరాయి సైనికులను (mercenaries) కూడ MDA పంపసాగింది. కాశ్మీరీ మిలిటెంటు సంస్థలన్నింటిలోకీ అత్యధికంగా ISI సహాయాన్ని పొందిన, పొందుతున్న సంస్థ హిజ్‌బుల్ ముజాహిదీనే. నేడు జమ్మూ-కాశ్మీరు అంతటిలోకీ సైనిక పాటవంలో అగ్రగణ్యమైన, అతిభీకరమైన పోరాట సంస్థ కూడ యిదే. ఇంకా అల్ జిహాద్, అల్ బర్క్, అల్ ఉమర్ ముజాహిదీన్, ఆపరేషన్ బాలాకోటే, అల్లా టైగర్సు, హిజ్బుల్లావంటి సంస్థలుకూడ ISI ద్వారా తగు సహాయ సహకారాలు పొందుతున్నాయి. ఇక్వాన్-ఉల్-ముస్లిమీన్ (ఖోకా పారే) బృందంకూడ మొదట్లో ISI సహాయం పొందినదేగాని, అదిప్పుడు తిరుగుబాటు ప్రతీఘాతక (conter-insurgency) గ్రూపుగా మారి భారత సైన్యం చెప్పుచేతల్లో వున్నదని గమనించాము. పోతే కాశ్మీరీ ఆజాదీకోసం పోరాడే, జమ్మూ-కాశ్మీరులో అత్యధిక ప్రజాదరణ పొందిన ప్రధాన పోరాట సంస్థ J.K.L.F కు నేరుగా ISI నుండి లభించే సహాయ సహకారాలు అత్యల్పమేనని చెప్పవచ్చు. కాని పాక్ ఆక్రమిత కాశ్మీరులోని ముజఫరాబాదు ముఖ్యకేంద్రంగా పనిచేసే ఆ సంస్థ (JKLF) చైర్మన్ అమానుల్లాఖాన్ ప్రభృతులద్వారా, ఆజాద్ కాశ్మీరు ప్రభుత్వవర్గాలద్వారా ఈ సంస్థకు తగిన సైనికశిక్షణ, నిధులు, ఆయుధాలు,యింకా యితర విధాలైన సహాయ సహకారాలు లభించాయి.

చివరగా మన మింతవరకు తెలుసుకున్నదంతా జమ్మూ - కాశ్మీరులో సాయుధ తిరుగుబాటు, గెరిల్లా యుద్ధాలు నిర్వహిస్తున్న సంస్థల్లో కొన్ని ముఖ్యమైన వాటిని గురించి, అదీ ఎంతో పైపైగా మాత్రమేనని, ఈ అంశంపై యింతకెన్నో రెట్లు యింకా వెలుగులోకిరావల్సివుందని గమనించాలి.

* * *



## ఇంగువ మల్లికార్జున శర్మ (1950-    )

పుట్టింది చెన్నపట్నం, పెరిగింది కర్నూలు. కొత్తగూడెంలలో. వరంగల్ రీజనల్ ఇంజనీరింగు కాలేజీ చదువులు విడిచిపెట్టి 1969 నుండి నక్సలైటు వుద్యమంలో నాలుగేళ్ల చురుకైన భాగస్వామ్యం; పర్యవసానంగా సికిందరాబాదు కుట్ర కేసులో, యితర కేసులలో చిక్కి ఆరేళ్ల కారావాసం. విడుదలయినప్పటి నుండి స్వతంత్ర మార్క్సిస్టుగా వామపక్ష ఐక్యతకు, సోషలిజం భావజాల వ్యాప్తికి తీవ్రకృషి. 1979-82లో ***విప్లవ సందేశం*** పత్రికా నిర్వహణ. 1981 నవంబరు 7న మార్క్సిస్టు అధ్యయన వేదిక స్థాపనప్పటినుండి దానికి కన్వీనరుగా చురుకైన పాత్ర; అనేక సభలు, సెమినార్ల నిర్వహణ. కారల్ మార్క్స్ ***'పెట్టుబడి'*** సంక్షిప్త పాఠం మొట్టమొదటగా తెలుగుచేసి ప్రచురించడమే గాక, యింకా అనేక ప్రగతిశీల, విజ్ఞానదాయక పుస్తకాల ప్రచురణ. భారత స్వాతంత్ర్యోద్యమంలో విప్లవకారుల పాత్రపై విస్తృత అధ్యయనం ద్వారా ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఫిల్. పట్టా పొందడమేగాక యిప్పుడు ఆ విప్లవోద్యమ భావజాలపర కోణాలపై మరింత లోతుగా పరిశోధన. ఇంగ్లీషులో ముఖ్యరచనలుః ***Role of Revolutionaries in the Freedom Struggle, Easter Rebellion in India: The Chittagong Uprising;*** యింకా ***Remembering our Revolutionaries, The Martyrs*** లకు సంపాదకత్వం. తెలుగులో ముఖ్యరచనలు ః ***రష్యా విప్లవం, మన పరిస్థితులు-మన విధానాలు.*** ముఖ్య అనువాద రచనలు ః ***ముస్లిం మతతత్వాన్ని ఎదిరించండి, బిస్మిల్ ఆత్మకథ*** (హిందీ నుండి), ***భారతదేశ ద్వితీయ స్వాతంత్ర్య సంగ్రామం*** (బెంగాలీ నుండి).

పౌరహక్కుల వుద్యమంలో క్రియాశీల పాత్ర ; 1985-87లో ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల ప్రజా సంఘం (PUCL) కార్యదర్శిగా ***'గణ జనం గొంతుక'*** అనే పౌరహక్కుల పత్రిక సంపాదకత్వం, యితర కార్యకలాపాల నిర్వహణ. ప్రస్తుతం హైకోర్టు న్యాయవాదిగా వృత్తి; అయినా ప్రవృత్తి ప్రజోపయోగకర రచనలు, రాజకీయాలే. మారుతున్న ప్రపంచ పరిస్థితులను ఆకళింపు చేసుకుంటూ, పిడివాదాలకు దూరంగా, వ్యక్తి సర్వతోముఖ వికాసం లక్ష్యంగా, దేశ పరిస్థితులకు మార్క్సిజం సృజనాత్మక అన్వయం ద్వారా మానవతా పూర్ణ సోషలిజం సాధనకు పాటుపడాలనే వ్యక్తి.